పరమహంస విద్యానంద, స్వామి

చంద్రగుప్త చక్రవర్తి

చెన్నపట్టణము, 1912

Record no. 783

Paramahaṃsa Vidyānanda, Svāmi

Candragupta cakravarti

Cennapaṭṭaṇamu, 1912

Record no. 783

పరమహంస విద్యానంద, స్వామి.
చంద్రగుప్త చక్రవర్తి / స్వామివిద్యానంద పరమహంసగారిచే రచియింపబడినది.- చెన్నపట్టణము : జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల, 1912.
8, 178 p. :port. ;17 cm.
Record no. 783

Paramahaṃsa Vidyānanda, Svāmi.
Candragupta cakravarti / Svāmi Vidyānanda Paramahaṃsagāricē raciyimpabaḍinadi.- Cennapaṭṭaṇamu : Jyōtiṣmatī Mudrākṣaraśāla, 1912.
8, 178 p. :port. ;17 cm.
Record no. 783

విజ్ఞానచంద్రికా గ్రంథమాల 19.

సంపాదకుడు

కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ.

# చంద్రగుప్త చక్రవర్తి



గ్రంథకర్త

శ్రీస్వామి విద్యానంద పరమహంస, బి.ఏ.



శ్రీ స్వామి విద్యానంద పరమహంస బి.ఏ.

Vijnana Chandrika Series 19

EDITED BY

K. V. LAKSHMANA RAO, M. A.

# చంద్రగుప్త చక్రవర్తి.

ఇయ్యది

శ్రీస్వామి విద్యానంద పరమహంస, బి. ఏ., గారిచే

రచియింపఁబడినది.




చెన్నపట్టణము

జ్యోతిష్మతీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1912

చందాదారులకు 0-8-0] వెల [ఇతరులకు 0-12-0

[illegible]





# సంపాదకీయ భూమిక.

---

ఈగ్రంథము మేము తలపెట్టిన హిందూదేశపాలకచరిత్రమాల (Rulers of India Series) యందు మొదటి సంపుటము. దీనికి విషయము సమకూర్చుటయందు గ్రంథకర్త మిక్కిలి పరిశ్రమ చేయవలసివచ్చినది. మన ప్రథమచక్రవర్తి చంద్రగుప్తుడు. ఆతనింగుఱించి మొట్టమొదట వ్రాయ నుపక్రమించితిమి. కాని ఇటీవల ప్రతిదినమును అక్కాలమునుగూర్చి ఏదో యొక విశేషాంశము బయలుపడుచుండుటవలన సాధ్య మయినంత వఱకు ప్రాచీన నవీనాంశముల సమన్వయము చేయుట ధర్మ మని యెంచి ఇంతకాలాతిక్రమణంబునకు నోర్వవలసివచ్చినది. మా చందాదారులు మమ్ము క్షమింతురుగాక !

ఆంధ్రమున వ్రాయఁబడిన చరిత్రగ్రంథములలో నిదివఱకు నవలంబింపఁబడని నవీనపద్ధతు లిందు నవలంబింపఁబడినవి. చంద్రగుప్తకాలనిర్ణయము ఆంగ్లేయచరిత్రకారులలో నగ్రగణ్యులనందగువారి ఫక్కి ననుసరించి చేయఁబడినది. గ్రంథాంతమున 'చంద్రగుప్తుని సమకాలీనులు' అను ప్రకరణమున స్వదేశీయులును పరదేశీయులును నగు కొందఱు మహాపురుషుల జీవితములు వర్ణింపఁబడినవి. ప్రసిద్ధపాశ్చాత్య చరిత్రకారులచే

రచింపఁబడిన 'జీవితచరిత్రములు' సార మిం దిమిడ్చినందులకు గ్రంథకారు లభివందనీయులు.

ఇయ్యది చిన్న సంపుటమే యైనను నిద్దానిని జాతీయాభిమానముతోఁ జదువునట్టివా రెల్లఱకును దీని యుపయోగము గొప్పది యని తోఁచకమానదు.

సంపాదకుఁడు.

# విషయసూచిక.

# చంద్రగుప్తచక్రవర్తి



## మొదటి ప్రకరణము.



### మగధరాజ్యము.

మగధము ఆర్యావర్తంబునందు మిక్కిలి పురాతనకాలమునుండి ఖ్యాతివడసిన యొక మహారాజ్యము. ఈ రాజ్యముయొక్క వైశాల్యము వేరువేరు యుగములయందు వేరువేరు విధములుగ నుండినను మొత్తముమీఁద నీదేశమునకు ఉత్తరమున గంగానదియు, దక్షిణమున వింధ్యగిరియు, పడమట శోణానదియుఁ, దూర్పున చంపాదేశమును నెల్లలుగా నుండెనని చెప్పవచ్చును. ఇప్పు డీప్రదేశమును దక్షిణబేహార్ అనియెదరు. బేహారనునది విహారశబ్దభవము. బౌద్ధయుగమునం దీరాజ్యముయొక్క చుట్టుకొలత రెండువేల మూఁడువందల మైళ్లు. ఇందలి గ్రామములసంఖ్య యెనిమిది వేలు.

మగధదేశపు రాజధాని ప్రథమమున గిరివ్రజ మను దుర్గము. పిదప క్రమముగా రాజగృహము, వైశాలి, పాటలీ

పుత్రము అను పట్టణములు రాజధాను లయ్యెను. ఉత్తరప్రాంతమందలి రాజ్యముల యభివృద్ధియే యిట్టి మార్పులకు ముఖ్యకారణము. గిరివ్రజ మయిదుపర్వతముల నడుమ నిర్మింపఁబడిన యొక దుర్గము. రామాయణమునందు గిరివ్రజ మీలాగుననే వర్ణింపఁబడి యున్నది.*

మహాభారతమునం దీపర్వతముల పేళ్లు వైహార, వరాహ, వృషభ, వృషిగిరి చైత్యకము లయినట్లు చెప్పఁబడియున్నది.† ఇప్పు డీపర్వతములను జనులు వైభార, విపుల, రత్నోదయ, సోనగిరు లని వాడుకొనియెదరు. వైభారపర్వతము మీఁద జైనుల శాసనములు పెక్కులు గలవు. ఈపర్వతముమీఁదనే క్రీ. పూ **543** లో బౌద్ధులయొక్క ప్రథమ పాంచవార్షికసంఘము కూడి యుండెను. గిరివ్రజముయొక్క చుట్టుకొలత నాలుగునర మైళ్లు. గిరివ్రజము కుశరాజుయొక్క కుమారుఁ డగు వసురాజుచేఁ గట్టింపఁబడియె. కట్టినశిల్పి పేరు మహాగోవిందుఁడు. గిరివ్రజపు రాతి గోడలకంటెఁ బురాతనమైన కట్టడము లెవ్వియు నార్యావర్తమునందుఁ గానరావు. గిరివ్రజమునే యిప్పటి జనులు పురాతన రాజగృహ మని వాడెదరు.

రాజగృహ పట్టణము గిరివ్రజమున కుత్తరమున అర్ధక్రోశము దూరమున నిర్మింపఁబడియె. ఈపట్టణము బింబిసారుఁ

* బాలకాండము 32 వ సర్గము.

† సభాపర్వము 21 వ అధ్యాయము.



డను నృపపుంగవునిచేఁ గట్టింపఁబడియె. ఈతని కుమారుఁ డగు ప్రజాతశత్రువు గౌతమ పుత్త్రునకు సమకాలికుఁడు. ప్రస్తుత మీ స్థలమందు రాజగిర్ అను జీర్ణదుర్గ మొకటి గలదు. ఇఁక మగధదేశపు రాజులనుగుఱించి విచారింతము.

మహాభారతకాలమునం దచ్చట జరాసంధుఁ డను రాజు రాజ్యము చేయుచుండెను. అతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడు. ఆతని దాడికి ఓర్వలేక యాదవులు మధురానగరము విడిచి పాఱిపోయి ద్వారకలో నివసించిరి. అతఁడు పెక్కండ్రగు రాజులను బట్టితెచ్చి తన చెఱసాలలో నుంచె నని మహాభారతమునందు వర్ణింపఁబడి యుండుటఁ జూడ నతఁ డసామాన్యపరాక్రమశాలి యనియుఁ, బెక్కురాజులు తన్ను బలిసికొలువఁ బ్రభుత్వము చేయుచున్న చక్రవర్తి యనియుఁ దోఁచుచున్నది. ధర్మనందనుఁడు రాజసూయ యజ్ఞముఁ సేయ నుద్యమించినప్పుడు కృష్ణ భీమార్జునులు గిరివ్రజమునకు బ్రాహ్మణులవలెఁ బోయి జరాసంధుని వధించి యతని చెఱసాలలో నున్న నసంఖ్యులగు మూర్ధాభిషిక్తుల విడిపించి, యతని పుత్త్రుఁడగు సహదేవునకే పట్టాభిషేకము చేసిన సమాచారము మహాభారతముఁ జదివినవా రందఱకును దెలిసిన విషయమే.

మహాభారత యుద్ధమునం దీ సహదేవుఁడు పాండవపక్షమునం బోరాడి హతుఁ డయ్యెను. అతనివంశపువా రగు నిరువదియొక్కరు రాజులు తరువాత రాజ్యము చేసిరి. చివర

వాఁడు పురంజీవుఁ డను నామాంతరము గల రిపుంజయుఁడు. వీరందఱును గలసి వేయి సంవత్సరముల వఱకు రాజ్యము చేసిరని పురాణములవలనఁ దెలియ వచ్చుచున్నది. పురంజయుని మంత్రి యగు శునకుఁడు తనరాజును జంపి తనకుమారుఁ డయిన ప్రద్యోతునకు రాజ్యము నిచ్చెను. ఈవంశమువా రైదుగురు రాజ్యము నేలిరి. చివర వాఁ డగు నందివర్ధనుని జంపి యాతని మంత్రియైన శిశునాగుఁడు రా జయ్యెను. ఈవంశమునకు శిశునాగవంశ మని పేరు. శిశునాగుఁడు, కాకవర్ణుఁడు, క్షేమధర్ముఁడు, క్షత్త్రౌజుఁడు, బింబిసారుఁడు, అజాతశత్రువు, దర్శకుఁడు, ఉదయనుఁడు, నందివర్ధనుఁడు, మహానంది, అని శైశునాగులు పదుగురు.

శిశునాగుఁ డేడవశతాబ్దమున రాజయ్యె నని చెప్పవచ్చును. ఈవంశమునం దయిదవవాఁడు బింబిసారుఁడు ఇతనికి శ్రేణికుఁడని నామాంతరము. ఇతఁడు క్రీ. పూ. 528 వ సంవత్సర ప్రాంతమున అంగరాష్ట్రము నాక్రమించి వశపఱచుకొనెను. ఇతఁడు కోసలరాజు కూఁతును లిచ్ఛవివంశ కన్యను వివాహ మాడెను. ఈరాజు రాజ్యము చేయుచుండఁగనే గౌతమ బుద్ధుఁడును, మహావీరుఁడును దమ తమ క్రొత్తసిద్ధాంతములను మాగధులకుఁ బోధఁజేసి నూతన మతాభివృద్ధి చేసిరి. జైన మతాచార్యుఁ డగు మహావీరుఁడు బింబిసారుని రెండవ భార్యకు దగ్గఱి చుట్టము. గౌతమ బుద్ధుఁడు తన జీవితములో చాలకాల



మితని రాజ్యములోనే నివసించి యుండెను. రాజ్యమువిడిచి సన్న్యాసి యయి బయలుదేరిన తరువాత బుద్ధుఁడు ప్రప్రథమమున రాజగృహమునందే గురువుల యొద్ద తత్త్వవిచారము నేర్చుకొనెను. అతఁడు బుద్ధత్వము చెందిన బుద్ధగయ మగధదేశములోనిదే.

బుద్ధుఁడు బింబిసారుని దనశిష్యుని జేసికొని రాజగృహపట్టణమునకు వెలపల నున్న వేణువనమునందు విశేషముగా వాసము చేయుచుండెను. అనేకరాజులును, విద్వాంసులును, బ్రహ్మవేత్తలును వేణువనమునకు వచ్చి యాతని మతమును స్వీకరించిరి. బుద్ధుఁడు నిర్వాణము చెందిన సంవత్సరముననే రాజగృహము నొద్ద సప్తపర్ణిగుహలో ఏనూరుగురు బౌద్ధాచార్యులు చేరి బుద్ధుని యుపదేశ వాక్యములను మూఁడు పిటకములుగా సంగ్రహించిరి.

బింబిసారుఁ డిరువది యెనిమిది సంవత్సరములు రాజ్యమునేలి తన రెండవభార్య కుమారుఁ డగు అజాతశత్రు నకు పట్టముఁగట్టి తాను ముక్తిమార్గమును వెతకుచుండెను. కాని అజాతశత్రువు దుర్మార్గుఁ డై దేవదత్తుఁ డనువాని బోధవలనఁ దండ్రిని జంపించెను.

అజాతశత్రువు క్రీ. పూ 500 ల ప్రాంతమున రాజ్యమునకు వచ్చె నని చెప్పవచ్చును. గౌతమబుద్ధుని బోధవలన నితనికిఁ దాను జేసిన పితృహత్యకై పశ్చాత్తాపము గలిగెననియుఁ

తరువాత నాతఁడు పరిశుద్ధాచరణ గలవాఁడుగ నుండెనని యు బౌద్ధ గ్రంథములు చెప్పుచున్నవి. ఈ యజాతశత్రువునకును, గోసలదేశపు రాజునకును, జరిగిన యుద్ధవిషయమైన యొక వింత కథ గలదు. అప్పటి కోసలాధీశ్వరుఁడు పసేనది (ప్రసేనది)· ఈతని యక్కయగు కోసలాదేవి బింబిసారుని భార్య; అనఁగా అజాతశత్రువునకు సవతి తల్లి. తనసవతికొమారుఁడగు నజాతశత్రువు తనభర్తను జంపఁగాఁ గోసలాదేవి యాదుఃఖముతో మరణ మొందెను. కోసలరాజులు కాశీరాజ్యములోని కొన్ని గ్రామములు కోసలాదేవికి నరణ మిచ్చియుండిరి. ఆమె పోఁగానే యాగ్రామములు గోసలరాజయిన పసేనదిచే నాక్రమింపఁబడియె. అందుపై ముసలివాఁడగు పసేనదికిని, అతని సవతి మేనల్లుఁడగు నజాతశత్రువునకును యుద్ధము ప్రారంభమాయెను. మొదట నజాతశత్రువునకుఁ గొంచెము జయము కలిగెఁ గాని నాల్గవసారి యాతఁడు దాడివెడలినప్పుడు పసేనదిచేఁ జెఱఁబెట్టఁబడియె. కాశీదేశపు గ్రామములపై దనకు నేమియు హక్కు లేదని యనిపించుకొని యాతని గోసలేశ్వరుఁడు విడిచిపెట్టెను. కాని చెఱలో నున్న కాలమందు నాతనికిని గోసలేశ్వరుని కూఁతునకును బ్రేమ యంకురించినందునఁ గోసలేశ్వరుఁడు తన కూఁతు రగు వజిరా (వజ్రా) దేవిని అజాతశత్రువున కిచ్చి వివాహము చేసి వివాదగ్రామములనే యామెకు అరణ మిచ్చెను.



ఇట్లు కోసలదేశములోని కొంతభాగమును స్వాధీన పఱుచుకొని యజాతశత్రువు గంగ కుత్తరమందున్న లిచ్ఛవీ దేశముపై దండు వెడలి రాజధాని యైన వైశాలి పట్టణమును స్వాధీన పఱుచుకొనెను. అజాతశత్రుని తల్లి లిచ్ఛవీ రాజు కూఁతురైనందున యిప్పు డీతఁడు జయించిన రాజ్యము తాతదియు నను, మేనమామదైనను కావలయును. ఈ దిగ్విజయముచే నాతఁడు గంగా నదికిని, హిమాలయ పర్వతమునకును నడుమ నున్న రాజ్యముయొక్క ఎక్కువ భాగమును సంపాదించి మగధ సామ్రాజ్యముయొక్క వైభవమును హెచ్చించెను. అజాతశత్రువు క్రీ. పూ. 475 సంవత్సర ప్రాంతమునఁ గాలధర్మము నొంది యుండవచ్చును. ఆతని మనుమఁడు ఉదయుఁడు. ఉదయుని కాలము క్రీ. పూ 450. ఇతఁడే పాటలీపుత్త్ర పట్టణమును గట్టించెనని చెప్పెదరు. అతని తరువాత నందివర్ధనుఁడు, మహానంది అనురాజులు రాజ్యము చేసిరి.

మహానందితో క్షత్త్రియ కులము నశించినదనియుఁ దరువాత రాజ్యముచేసిన వారందఱును శూద్రులనియు మన పురాణకారుల యభిప్రాయము. మహానందికి ఔరససంతానము లేదు. మహాపద్ముఁడను దాసీపుత్త్రుఁ డొకఁడు మాత్ర ముండెను. మహానందికి తరువాత మహాపద్ముఁడే మగధరాజ్యమునకుఁ జక్రవర్తి యయ్యెను.

## రెండవ ప్రకరణము.

### చంద్రగుప్తుని జననము.

క్రీ. పూ. 528 లో బింబిసారుని ప్రతాపము వలన నంగదేశాక్రమణముతోఁ బ్రారంభమయి క్రీ. పూ. 371 లో మహాపద్ముని దిగ్విజయము వలనఁ దన ఛత్రముక్రిందికి దేశమంతయును రాఁగనిన మగధసామ్రాజ్యము క్రీ. పూ. 321 లోఁ జంద్రగుప్తుని భుజాదండము నాశ్రయించెను.

ఈ చంద్రగుప్తుని యుత్పత్తియు వృద్ధియు మిగుల నాశ్చర్య కరములు, కాని వానిని గుఱించి ఇదమిత్థమ్మని సంశయరహితంబుగఁ జెప్పుట కఠినకార్యము. పురాణములలో నొకరీతిగను, నాటక కథలలో వేఱొకరీతిగను, జైనబౌద్ధ చరిత్రములలోను గ్రీకుల చరిత్రములలోను మఱొకరీతిగ నుండుటం బట్టి చరిత్ర కర్తలు తమ తమ చిత్తములకు సరిపోయిన ట్లూహాపోహలను విస్తరించి యున్నారు. కావున మనదేశమునందు సాధారణముగ నంగీకరింపఁబడి యుండుపద్ధతిని మొదట వ్రాసెదము. తరువాత నితరుల వ్రాతల ననువాదించెదము.

'నందాంతం క్షత్త్రియకులమ్' అని పౌరాణిక శాసనమును లోకోక్తియు గలదు. ఇందునకుదృష్టాంతము, కల్యాదిని నందనామాంకితులు కొందఱు రాజు లుండిరి. అందుమిక్కిలి ఖ్యాతిగాంచిన వాఁడు సర్వార్థసిద్ధి. ఇతనికి మహాపద్మనందుఁడు, ధననందుఁడు, మహాబలి యని నామాంతరములు. ఈతఁడు నవకోటిశతేశ్వరుండు. చిరకాలము భూమి నేలెను. వక్రనాసికుఁడు మున్నగు బ్రాహ్మణు లతనికి కులమంత్రులు. వీరిలో రాక్షసుఁడనువాఁడు పరమవిఖ్యాతుఁడు. దండనీతి ప్రవీణుఁడు. సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధ, ఆశ్రయములు, అనియెడు షాడ్గుణ్యప్రవిభాగముల నెఱింగినవాఁడు; శుచి, శూరుఁడు. ఇతఁడు నందమాన్యుఁడై రాజ్యభారమును ధరించెను.

మహాపద్మనందుఁడు పెక్కుదేశముల రాజులను గెలిచి మిక్కిలి శూరుఁడని పేరొందెను. ఇరువది నలుగురు ఐక్ష్వాకులను, ఇరువది యయిదుగుగు పాంచాలురను, ఇరువది నలుగురు హైహాయులను, ముప్పది యిద్దఱు కాళింగులను, ఇరువదియయిదుగురు శకులను, ఇరువది యాఱుగురు కురువులను, ఇరువది యెనుమండ్రు మైథిలులను, ముప్పది యిద్దఱు శూరసేనులను, ఇతఁడోడించెనని వ్రాయఁబడి యున్నది.

మహాపద్ముఁడు మిక్కిలి ధనవంతుఁడు. ఇతనియొద్ద మహాపద్మ ధనమున్నందుననే యితనికీపేరు వచ్చెనఁట. నూఱు కోట్లయిన నొకపద్మమగును; అట్టి పద్మములు వేయియయిన నొక మహాపద్మమగును. ఈతఁడు తన ప్రతాపముచే వృద్ధిపొందించిన మగధరాష్ట్రమునుండి పన్నులు, కప్పములు, కానుకలు దయాదాక్షిణ్యములు లేక లాగి ధనమును గుప్పలు పోసికొనినందున

ధననందుఁ డాయెను. తానుసంపాదించిన ధనమును ఈతఁడు గంగానదిలోఁ బంచకోశములుగాఁ బాతియుంచెనఁట. పై భాగమునందు నడ్డకట్టగట్టించి గంగా ప్రవాహమును ద్రిప్పి బయల్పడిన స్థలమునందు నయిదుగోతులు త్రవ్వించి వాని ప్రక్కలను రాళ్ల కట్టడముతో ననువుపఱచి లోభాగమున ధనమునించి కరగిపోసిన సీసముతో వానిని మూయించి, యడ్డకట్టను ద్రెంచి ప్రవాహము నెప్పటి మార్గమునకు మరల్చి యాధనము మీఁదుగఁ బోవునట్లు చేసెనఁట. ఈ రహస్యము వెల్లడి కాకుండుటకై యాపనులయందు నియుక్తులైన పరిజనులనెల్ల సంహరించినట్లును ఒకగాధకలదు.

గ్రీకువారి వ్రాతల ననుసరించి చూడఁగా క్రీ॥ పూ॥ 326 వ సంవత్సర ప్రాంతమున ననఁగా అలెగ్జాండరు(సికందర్) ఈదేశము మీఁదికి దండెత్తి వచ్చినప్పుడు, మగధ రాజ్యము మహాన్నత్యముఁ జెందియుండెను. ఆదేశపు రాజునొద్ద ౨౦,౦౦౦ గుఱ్ఱములును, ౨౦౦,౦౦౦ పదాతి సైన్యము, ౨౦౦౦ రథములును, ౩౦౦౦ ఏనుంగులును ఉండెను.

నవనందులు—మౌర్యుఁడు.

మహాపద్మునకు ఇళయను పట్టపురాణియు, మురయను ఉంపుడుకత్తెయుఁ గలరు. ఇళకు నెనమండ్రు కుమాళ్లు గలిగిరి. తండ్రియయిన నందుఁడును, వీరును గలిసి నవనంధులని పిలువఁబడిరి. మురకుఁ బుట్టినవాఁడు మౌర్యుఁడని పిలువఁబడెను. ఈ



మౌర్యుఁడే చంద్రగుప్తుడని కొందఱును నీ మౌర్యుని పుత్రుఁడే చంద్రగుప్తుఁడని మఱి కొందఱును వ్రాసియున్నారు. మొదటి పురాణ గాధ ననుసరింతము.

మహాపద్మనందుఁడు దుష్టస్వభావము గలవాఁడై ప్రజా పీడన మొనరించినందున నతఁడు ప్రజలకు నప్రియుఁడయ్యెను. ఇతఁడు కలికాంశుఁడనియు శూద్రప్రాయుఁడనియు అధార్మికుఁడనియు పురాణములు చెప్పుచున్నవి. విష్ణు పురాణ వ్యాఖ్యానము నందీతఁడు ఏకచ్ఛత్రుఁడు, ఏకరాట్టు, లుబ్ధుఁడు, సర్వక్షత్రకర్త, పరశురామసదృశుఁడు అని వర్ణింపఁబడియున్నది

గ్రీకువారి వ్రాతను జూచినను రాజగు నందునిపై ప్రజలకప్రీతియనియు అతఁడు లుబ్ధుఁడును విషయ లంపటుఁడును అనియుఁ దెలియుచున్నది.

మఱియొక కథ చొప్పున నందునకు శకటాలుఁడను ప్రియమంత్రి గలఁడు. ఒకప్పుడు రాజునకు మంత్రిపైఁ గోపము వచ్చి యాతఁడు మంత్రిని భూగృహములోఁ ద్రోయించెను. అతనికి దేహయాత్ర మాత్రమున కవసరమగునంత ఆహారము పెట్టించుచుండెను. ఇట్లతఁడు ప్రాణావశేషుఁడై చెఱలో నుండఁగా పగతురు మగధము మీఁదికి దాడి వెడలివచ్చిరి. నందుఁడు శత్రులను బారఁదోలునట్టి యుపాయముగానక శకటాలుని చెఱనుండి విడిపించి యాతని మంత్ర శక్తిమహిమచే శత్రువులను దిరస్కరింపఁ గలిగెను. కాని తరువాత నాతఁడు

మంత్రిత్వము చేయనొల్లక యున్న సత్రాధికారిగ నుండుచు నందుల కప్రఖ్యాతి వచ్చునట్టులఁ గుట్రలు పన్నుచుఁ దుదిని చాణక్యుని కోపమును రేగించి నంద నిర్మూలము గావించెనఁట.

నందుని యధర్మపుత్రుఁడగు మౌర్యుఁడు బలసాహసములచే పేరువడసెను. ఇతనికి చంద్రగుప్తుఁడు మున్నగు నూఱుగురు సుతులు గలిగిరి. వీరు మహా బలాఢ్యులు. మౌర్యుఁడును మౌర్యుని నూర్గురు పుత్రులును నవనందుల సైన్యమునకు అధిపతులుగఁ జేయఁబడిరి. కాని పుత్ర సమేతుఁడయిన మౌర్యుఁడు రాజ్యము నపహరించు నేమో యని నందులకు నసూయ హెచ్చెను. కావునఁ దమ యుద్యాన వనమున నొక కృత్రిమ శిల్ప గృహమును నిర్మించి మంత్రాలోచన మిష మీఁద మౌర్యుల నచ్చటికి రావించి వారలనందఱను నేలక్రింది గుహలోఁ బ్రవేశపెట్టిరి. చంద్రగుప్తుఁడు దప్ప మిగిలిన వారందఱచ్చట భూగర్భమందు దుర్మరణము నొందిరి. చంద్రగుప్తుఁడు మాత్రము తప్పించుకొని లోనుండి బయలు వెడలెను.

చంద్రగుప్తుఁడు చాణక్యుని నాశ్రయించుట.

ఆజాను బాహుండును రాజలక్షణ సమన్వితుండును ఔదార్య శౌర్యగాంభీర్య నిధియు, వినయ వారిధియు నైన యాతని నా ఈర్ష్యాళులు నందులు తిరిగి సమయింపఁ గపటోపాయములఁ బన్నిరి. ఉన్నత పదవియం దునిచిన నంతఃక్షోభమును, వెడలఁ గొట్టిన బాహ్యక్షోభమును బుట్టించు నని



వెఱచి నీచమును హాస్యాస్పదమును నగు నన్న సత్రాధికార మందుంచిరి. ఇచటన మరి పగతీర్పునకు సమయోపాయముల నెదురు చూచుచున్న చంద్రగుప్తుఁడొకనాఁడు అగ్రహావతార మనఁదగిన యొక అగ్రజన్మునిఁ జూడఁగల్గెను. ఈతఁడు కాలికిఁ దగిలిన యొకగడ్డిపోచను వేరుతోఁ బీకి నిప్పునఁ గాల్చి మిగిలిన బూదిని నీళ్ళలోఁ గరగించి త్రాగెను. అదిగని మౌర్యుఁడు, ఇటువంటి చండకోపియే నంద నిర్మూలమునకుఁ దగినవాఁడని నిర్ణయించెను.

గుప్తుఁడను పేరుగల యాబాలద్విజుండు ఔశనునిదండనీతియందును, జ్యోతిశ్శాస్త్రమందును పారంగతుఁడు; నీతిశాస్త్ర ప్రణేతయగు చణకుని నందనుండు; చాణక్యుఁడని ప్రసిద్ధిగాంచిన శ్రోత్రియుండు; సర్వధర్మవిదుండు; గుణాఢ్యుండు. ఈ బ్రాహ్మణుఁడు వేదములనన్నిటిని వల్లెవేసినవాఁడు; శాస్త్రములన్నిటిని జదివినవాఁడు; ముఖ్యముగ బృహస్పతి, శుక్రుఁడు, మున్నగువారి దండనీతుల యందత్యంత ప్రవీణుఁడు; నైజమైన బుద్ధి సామర్థ్యమును సమయస్ఫూర్తియుఁ గలవాఁడు; మిక్కిలి ముక్కోపమును, పట్టినపట్టు వదలని గట్టి దిట్టతనమును గలవాఁడు. ఇతఁడొకనాఁడు నందులశాలలో నొకదాని యందు బహుజనమధ్యమున నగ్రాసనమునందుఁ గూర్చుండి యుండెను. అప్పుడా యచటికి నందులు వచ్చుట తటస్థించెను. వచ్చి యా వికృతరూపుఁడును బ్రహ్మచారియు నగు బ్రాహ్మణుని పూర్వోత్తరముల

విచారించి నందుల వెంటవచ్చిన వారిమంత్రులును మూఁగి యున్న జనులలో గొందఱును బ్రాహ్మణోదాసీనము కూడదని బోధించినను నామాటలు వారాలకింపక యతనిని గర్విష్ఠునిగ భావించి బంటులఁ బనిచి యాయాసనమునుండి లాగివేయించిరి. అంత నా చాణక్యుని జుట్టు వీడిపోయెను, కండ్లెఱ్ఱనాయెను, ఒడలు వడకెను. పెదవిని కొఱికికొని యెగిరిపడుచు నచ్చటి జనులందఱు వినునట్లుగొప్పపంత మొకటి పట్టెను. చాణక్య శపథమేమనిన, "నన్ని ట్లగ్రాసనము నుండి లాగి బహుజన సమూహమున నవమాన పఱచిన యో నందాధములారా! ఇట్లనే మిమ్ములను మీ సింహాసనము నుండి లాగించి మీశిరముల నెల్లదునిమి, యటుపిదపనే యీ జుట్టును ముడిచెద! నాచాతుర్య సామర్థ్యములఁ జూతురుగాక!" అనిధిక్కరించుచు కాలరుద్రుని వలె గర్జించిన యాబ్రాహ్మణుని కోపానలమును జల్లార్చుటకై నందు లేవిధమైన శాంతివచనములనైన నాడక పోయిరి. అయ్యో పాపము! బ్రాహ్మణ ద్వేషము సామాన్యమా? అద్దాని ఫలమును నందులు త్వరలోనే అనుభవింప వలసి వచ్చెను.

చాణక్యుని యాగ్రహోక్తుల చంద్రగుప్తుఁడు చూడఁ గలిగెను. అట్లు బ్రతినపట్టి యరుగుదెంచుచున్న యాబ్రాహ్మణుని వెంబడించి నడచివచ్చుచున్న చంద్రగుప్తుఁడు, వెనుక చూచుడు నతనికనులఁ బడియెను. అంతఁ జంద్రగుప్తుఁడు సాగి



పడి నమస్కరించెను. అతఁడును నితని లేవనెత్తి కుశల ప్రశ్నము వేయ నతనితో చంద్రగుప్తుఁడు తనకును నందులకును గల విరోధమును విశదీకరించి శరణము వేడెను. వెంటనే చాణక్యుఁడతని నోదార్చి సర్వనందరాజ్యమునకును పట్టాభిషేక మతనికి జేయించునట్లు రెండవ ప్రతిజ్ఞయుఁ జేసెను. మౌర్యచంద్రుని తనయందఁ జేర్చుకొని యాకుటిలుఁడు నందకుల నిర్మూలనోపాయమును పన్నెను. తనమిత్రుఁ డిందుశర్మకు క్షపణక వేషము వేసి, యా యభిచారికావేత్తతో రాక్షసాదుల వంచించుచు, నంద రాజ్యార్ధమును బహుమతిగా వాగ్దానముచేసి మహాబలిష్ఠుఁడైన పర్వతేంద్రుని సాహాయ్యముగాఁ జేర్చుకొని మ్లేచ్ఛబలములతో కుసుమపురిని ముట్టడించెను. నందులును సంరబ్ధులై, మంత్రి రాక్షస వీర్యదృప్తులై యుద్ధమునకు నమకట్టిరి. పలుతెఱంగుల ప్రయత్నించియు నాబలమును జయింప నశక్తుఁడై రాక్షసుండు ఛద్మమున చంద్రగుప్తుని సంహరింప నుద్యమించెను.

కాని సర్వనందులును పర్వతేంద్ర బలానిలముతో చెలరేగింపఁబడిన చాణక్య క్రోధానలంబున శలభంబులమాడ్కి సందగ్ధులైరి. పిదప రాక్షసుఁడు క్లేశపరవశుఁడై, బలపౌరుషనష్టుఁడై, అరిబలాక్రాంతమైన సేనలసాహాయ్యము గోలుపోయినవాఁడై, ప్రాణత్రాణ పరాయణుఁడై, నందవృద్ధుఁడైన సర్వార్థసిద్ధిని సురంగమార్గమున పురమునుండి బయలుపంపి,నందపక్షపాతులగు పౌరులతో పురమును మౌర్యవశము పఱిచెను.

### బౌద్ధగ్రంథములందలి కథ.

బౌద్ధులు చెప్పుటేమనఁగ, చంద్రగుప్తుఁడు శాక్యవంశ సంభూతుఁడు. కాన నితఁడు శాక్యసింహుఁడని వాడఁబడు గౌతమబుద్ధునివలె క్షత్రియకులస్థుఁడు. అతనితండ్రి మయూర దేశాధిపుఁడు. ఆరాజు రాజ్యమేలుచుండ పగతు రితని దేశముపై దాడివెడలివచ్చి యుద్ధమునం దితని నోడించి సంహరించిరి. అట్టి విపత్తుసమయమున మన చంద్రగుప్తుని గర్భమందు గాంచియున్న మయూరరాణి ఒక పసువులకొట్టమునకు చేరువ నాబిడ్డను కని విడిచిపోయెను. అంత నొక గొల్లఁడు బిడ్డను పెంచి, పాటలీపురమున నొకనాఁడు వెడల దటస్థించి యచ్చట తక్షశిలాబ్రాహ్మణుఁడగు చాణక్యున కమ్మివేసెనఁట. ధననందుఁడు చాణక్యుని అవమానపఱచినందున, చంద్రగుప్తుని నిమిత్తీకరించుకొని పగఁదీర్చుకొనెనఁట.

మఱియొకవృత్తాంతము చొప్పున మోరియ అనఁగ మయూరనగరపు రాణి, స్వభర్తసంహారము కాఁగనే గర్భార్భకుని కాపాడుటకై, తనయన్నను దోడ్కొని పుష్పపురికి పరుగెత్తిపోయెనఁట. అచ్చట మాఱువేసము దాల్చి బ్రతుకుచుండ కుమారునిఁగాంచెను. దేవతలు రక్షింతురుగాతమని యా శిశువును ఒక జాడిలోఁ బెట్టి పసుల కొట్టపు గుమ్మమున నుంచిపోయె. అప్పుడు చణ్డుఁడన్న ఒక్కయెద్దు జాడియొద్ద నిలిచి బిడ్డను కాపాడుచున్నందున అచ్చటి పసువులకాపరి వానికి



చండగుప్తుఁడని పేరుపెట్టి కాపాడెను. చండగుప్త నామము చంద్రగుప్తనామముగ మాఱిపోయెనఁట. మోరీయులు పిప్పలివనమున నున్నవారని బౌద్ధజైనుల వార్తగా నున్నది. స్వాటు పల్లపుసీమయందు నేఁటికిని 'మోరా'యని యొక కనుమ యున్నదని వాడ్డెలుగారు నుడువుచు ఈనామము చంద్రగుప్తుని ఔత్తర జన్మమును సూచించుచున్నదనుచున్నారు.

బౌద్ధచరిత్రములు గ్రీకు ఇతిహాసములతో మిక్కిలి సమరస పడియున్నవి. ముఖ్యాంశముల కథనమునందు వ్యత్యాసము లగుపడవు. మరికొన్ని బౌద్ధ గ్రంథములలో నిట్లున్నది:—

చాణక్యుఁడు గొల్లవానికి క్రయంబిచ్చి చంద్రగుప్తుని తీసికొని అతనికి యుక్తమైన క్షాత్త్రవిద్యాభ్యాసముఁ జేయించెను. చంద్రగుప్తుఁడు యౌవనముఁ బొందగనే, తనయొద్ద రహస్యముగ వేతనంబిచ్చి యుంచియున్న సేనను అతని వశము జేయ నతఁడు పాటలీపురముపై దాడి వెడలెను. కాని యీ తిరుగుబాటు వ్యర్థమాయెను. కావున చంద్రగుప్తుఁడు పంజాబునకు బాఱిపోయెను.

మఱి యొక కథ గలదు. చాణక్యుఁడు తనచేత నున్న దొంగ కాహాపణములతో సేనను గూర్చికొని నందునిపై దాడి వెడలగ మొదట నపజయముఁ బొందెను. అంత చంద్రగుప్తుని బిలిచి "యుద్ధము వల్ల లాభము లేదు. గుప్తచారులమై జనుల యభిప్రాయములను మొదటఁ దెలిసి కొందము" అని చెప్పి

వా రిరువురు గ్రామములో గుప్తచారులై దిరుగుచుండిరి. ఒకో దినమొక పిల్లవాఁడు తల్లి తనకొక రొట్టె నియ్యఁగా దాని నడిమి భాగము మాత్రము తిని చుట్టునున్న భాగము వదిలిపెట్టి మఱియొక రొట్టె నడుగఁగా తల్లి "ఓరి పిచ్చివాఁడా! చుట్టు నున్న రాజ్యమును ముందు వశపఱుచుకొనకయే మొట్ట మొదట రాజధాని మీఁదికి దండెత్తి వచ్చి యోడిపోయిన చంద్రగుప్తునివలె రొట్టెను తింటివి గదా" యని వెక్కిరించెను. సమీపప్రదేశమునందే మాఱువేషముతో నున్న చంద్రగుప్తుఁ డామాటలు విని మొదట సామంత రాజులను వశపఱుచు కొనుటకై యత్నముచేయ సాఁగెను. ఒక బెస్తవానికి లంచ మిచ్చి గంగానది ప్రవాహములో దాఁచి యుంచఁబడిన పంచ నిధుల సంపాదించెను.

మాక్సుముల్లరుగారికథ.

ఉత్తరవిహార సన్న్యాసుల కథలయందుండితీసి మాక్సు ముల్లరు గారు తమ సంస్కృత గ్రంథావళీ చరిత్రమునం దుదహరించున దేమనఁగ: తక్షశిలావాసియగు బ్రాహ్మణుం డొకఁడుకలఁడు. అతనిపేరు చాణక్యుఁడు. పాటలీపుత్రము దుండఁ దటస్థించిన యీచాణక్యుఁడు ఏవిధముననో నందాగ్రహము నార్జించుకొనెను. అపుడు నందుఁడు భటులఁ బనిచి యతని బట్టుకొమ్మని యానతిచ్చెను. అంతఁ జాణక్యుఁడు సమయస్ఫూర్తి తోఁ దక్షణమె తనగట్టిన బట్టల సడలించి పారవైచి దిసమొల



కాఁడై ఆజీవక వేషంబుఁ గైకొని తప్పించుకొనిపోయి నగ రున విజనస్థలముగనున్న సంభారస్థానమునందు దాఁగియుండి, కొంత తడవుమీఁద పర్వతరాజకుమార పరివారమును సంధించి వింధ్యంబుఁ జేరె. వృషభరక్షితుఁడైన చంద్రగుప్తుఁడు అచ్చట పశువుల మేపుచుండెను. ఆపిల్లవాని శుభలక్షణములఁజూచి, పశువుల కాపరికి ఒకవేయి కాహాపణములఁ జెల్లించి చాణక్యుఁడు కుఱ్ఱనిఁ గొని, యతని మెడకు లక్ష విలువగల బంగారు ప్రోగుతోఁ జుట్టఁబడిన యొక కంబళిత్రాటిని జుట్టి కట్టె నఁట. పర్వత రాజపుత్రునకు నిటువంటి త్రాటిని మెడకు గట్టించెను. ఒకనాఁడా యిద్దఱు బాలురును విచిత్రములైన కలలు కనిరఁట. అంత నాబ్రాహ్మణుండు పార్వతుని బిలిచి నిద రించుచున్న చంద్రగుప్తుని మెడత్రాటిని త్రెంపకయు నీడ్వకయు నతనిని మేలుకొలుపకయుఁ దెమ్మని చెప్ప, పార్వతుఁడు చేత కాక వచ్చెను. మఱునాఁడు పార్వతుఁడు నిదురింపఁగ చంద్ర గుప్తునిఁ బిలిచి యమ్మెయినే ఆనతియ్య నితఁడు చేతికత్తితో పార్వతుని శిరము ద్రుంచి త్రాటిని తెచ్చి సమర్పించెనఁట. అది గని చంద్రగుప్తుని యోగపురుషునిగ నిర్ణయించి నాఁటనుండి యేడువత్సరములలో సమస్త విద్యావిశారదునిగఁ జేసెను.

గ్రీకులవ్రాతలు.

చంద్రగుప్తుఁడు చిన్న వయస్సులోనే మగధరాజు కోప మునకుఁ బాత్రుఁడై పాటలీపురమునుండి తక్షశిలా ప్రదేశమునకు

అనఁగా పంజాబు దేశమునకుఁ బాఱిపోయి యచ్చట సైన్యమును గూర్చుకొని అదివఱకు రాజ్యము చేయుచుండిన గ్రీకు వారిని వెడలగొట్టి, పిదపనందుల సంహరించి మగధ రాజ్యమును స్వాధీన పఱచుకొనెను.

### గాథలసమన్వయము.

ఇట్లు చంద్రగుప్తుని జననమును గుఱించి, సర్వార్థసిద్ధి మనుమఁడని యొకకథ, ధననందునికి మురయందు బుట్టిన వాఁడని మఱియొక కథ, మయూర దేశపు రాణికిఁ బుట్టి చాణక్యున కమ్మఁబడిన వాఁడని వేఱొక కథ, ఆరాణి కని పసుల కొట్టమందుంచి పోఁగ గొల్లవాఁడు కాపాడి చాణక్యున కమ్మిన శిశువని యింకొక కథ, మోరియను రాణి మారువేసమునఁ బుష్పపురమున బిడ్డను గని జాడిలోనిడ చన్దుఁడన్న యెద్దు సంరక్షించి నందునఁ బసులకాపరిచే చండగుప్త నామమందిన బాలుఁడని యైదవకథ, పర్వత రాజ పుత్రునితో పాటలి వదలి పోయి వింధ్య ప్రాంతమున నొక గొల్లపాళెమునందుఁ దేజస్వియగు బాలచంద్ర గుప్తుఁడు తోటి గోపాలబాలురతో రాజుమంత్రులయాట లాడుచుండ నతఁడు కులీన సంభవుఁడని చాణక్యుఁ డూహించి యాబాలుని విలువకుఁ దీసికొనిన దాఱవకథ. కావున నతఁడు ఏకులమునఁ బుట్టినవాఁడని నిర్ణయించుట ఇంచుమించుగ నశక్యము. ముద్రారాక్షసమున నతఁడు వృషలుఁడుగ నెన్నఁబడి యున్నాఁడు. చాణక్యుఁ డతనిని చాటున



వృషలుఁడనుచున్నాఁడు. ఎదుటను వృషల యనుచున్నాఁడు. జాతి వివేకమునందు. వృషలుఁడనగ అంబష్ఠునకు శూద్రియందు బుట్టినవాఁడని వివరణ. మహానందియను శైశునాగుల గడపటి రాజునకు శూద్రియందు మహాపద్ముఁ డుదయించె ననునది పురాణ సిద్ధము. ప్ల్యూటార్కు ద్వారా మహానంది అంబష్ఠుఁడని తెలియుచున్నది. కావున మహాపద్మనందుఁడె వృషలుఁడాయెను. అతని కొమారుఁడును వృషలుఁ డనిన, చంద్రగుప్తుఁడే కాక నందులును వృషలులయిరి. తక్కిన కథలెల్ల చంద్రగుప్తుని క్షత్రియుఁడనుచున్నవి. ముద్రారాక్షసమున విష్ణుగుప్త విరాధగుప్తులు బ్రాహ్మణులు, బలగుప్తుఁడు క్షత్రియుఁడు. కావున చంద్రగుప్తుఁ డెవఁడు? తరువాతి కాలములలో గుప్తనామము వైశ్యుల బిరుదాయెను.

అన్ని కథలను ఆలోచించి చూడ చంద్రగుప్తుఁడు మురయను స్త్రీకి కుమారుఁడనియు చిన్ననాఁడె సపత్నులగు శత్రువులచేఁ బీడింపఁబడి స్వగ్రామము విడిచి దూరదేశమునకుఁ బాఱిపోయెననియు నచ్చట చాణక్యుఁడను బ్రాహ్మణుని ఆశ్రయించి యతని కుటిలనీతి సాహాయ్యముచే నందుల సంహరించి రాజ్యమును సంపాదించె ననియుఁ గానవచ్చుచున్నవి. చంద్రగుప్తుఁడు మొదట నందుల సంహరించి మగధ మాక్రమించుకొనెనో లేక గ్రీకుల వెడలఁగొట్టి పంజాబును వశపఱచుకొనెనో నిశ్చయముగఁ జెప్పుటకు చరిత్ర సాధనము లేవియు

ను లేవు. అతని జీవితములో నాతఁడు చేసిన ముఖ్య దిగ్విజయములు రెండు; ఒకటి మాగధము నాక్రమించుకొనుట; రెండవది గ్రీకుల నోడించుట. మొదటిది మన పురాణాదులలోను ముఖ్యముగా ముద్రారాక్షసమను నాటకములోను వర్ణింపఁబడి యున్నది. రెండవ సంగతి యగు గ్రీకులపరాభవమును గురించిన చరిత్రము వారి గ్రంథముల వలననే తెలిసి కొనవలసి యున్నది. ఈచరిత్రాంశములు వేరు వేరుగ రెండు ప్రకరణములలో రచియింపఁబడును.

---

## మూఁడవ ప్రకరణము.

### మగధరాజ్యము నాక్రమించుట.

మహాపద్మనందుని వార్ధకమునందు రాచకార్యములన్నియు నతని ఎనమండుగురు కుమారులే చూచుచుండిరి. వారుగర్వాంధులు. మంత్రిశ్రేష్ఠుఁడును, అనన్యసామాన్యస్వామిభక్తిభూషితుండును అగు నమాత్య రాక్షసుని బోధలు వినక వారు చాణక్యుఁడను బ్రాహ్మణుని అగౌరవించుటయు నతఁడు నందుల నందఱను సంహరించెద ననియు చంద్రగుప్తునకు రాజ్యము గట్టెదననియు నీరెండు కార్యము లయినంగాని జుట్టుముడి వేయననియుఁ బ్రతిజ్ఞ చేయుట నిదివఱకే వర్ణింపఁబడి యున్నది.

అట్లు రెండుపంతములఁ బట్టిన యాబాపఁడు మౌర్యుని వెంటఁబెట్టుకొని పోయెను. త్రోవలో చాణక్యునకు అత్యంత స్నేహితుఁ డొకఁడు నివసించుచుండెను. ఇతనిపే రిందుశర్మ. ఈతఁడును చాణక్యుఁడును ఒక్కగురువుని కడ విద్యనేర్చినవారు. ఇందుశర్మ శుక్రనీతి యందును జ్యోతిశ్శాస్త్రమందును అఖండమైన నేర్పుగలవాఁడు. చాణక్యుఁ డతనియాశ్రమమున నిలిచి చంద్రగుప్తున కాతిథ్యమిప్పించి, కుశలప్రశ్న రాఁగనే

నందతిరస్కారాది విషయములనెల్ల వెల్లడి చేసి యతని సాహాయ్యము వేఁడెను.

అందుపై నిందుశర్మ తాను క్షపణకవేషమును దాల్చి నందమంత్రులకు తనయెడ స్నేహవిశ్వాసములు పుట్టునట్టుగ నటించుచు గట్టితనముగల నమ్మకమైన శిష్యులను చారులుగ నియమించి తనకుఁ దెలిసిన వర్తమానములెల్లఁ జాణక్యునకుఁ దెల్పుచు దేశకాలపాత్రములకుఁ దగినయట్టి పనులను సల్పుచు జంద్రగుప్తునకు తోడ్పడుటకు నంగీకరించెను.

### నందసంహారము.

పిదప చాణక్య చంద్రగుప్తులు పర్వతరాజు నగరునకుఁ బోయిరి. పర్వత రాజ్యమునకు తక్షశిల రాజధానియని కొంద అనుచున్నారు. కాని రాజునకు సింహళ దేశాధిపుఁడనియుఁ బేరుండుటంబట్టి సిమ్లాయను పురియందతఁడుండుట కలదు కాఁబోలు. చాణక్యుఁడు పర్వతరాజు సన్నిధిఁజేరి చంద్రగుప్తుని యొక్కయుఁ దనయొక్కయుఁ బూనికలను దెలియఁ జెప్పె. పర్వతరాజునకును మగధరాజునకును బద్ధవైరముకలదు. కాని యతఁడు వంచకుఁడు, మిత్రునివలె నభినయించువాఁడు. దండయాత్రకుఁ దగుపాటి సమయము నెదురుజూచుచున్నవాఁడు. చాణక్య చంద్రగుప్తుల వ్యాజమునఁ దనరాష్ట్రమును వృద్ధిఁ బొందించుకొనఁదగిన యదను రాఁజూచి స్వబలమును శత్రుబలమును ఆలోచించుచు నిశ్చిత ప్రత్యుత్తరంబీయకుండెను.



కాని చాణక్యుఁడు గడుసరికావున నతని యాలోచనల నూహించుకొని అతని సంశయములు నశించునట్లు దగినట్టి మంత్రతంత్రములఁ బన్ని యతని మెప్పించి నందరాజ్యమునం దర్ధభాగము నిప్పించునట్లుగా నొప్పందము సేయించి యెట్టకేలకతని సాహాయ్యమును బడసెను. పర్వతరాజు వెంట నతని సహాయులుగ శక, యవన, కిరాత, కాంభోజ, పారసీక, బాహ్లిక రాజ ప్రభృతులును లేచివచ్చిరి. ఇట్లు ప్రాంతసీమలనుండి దాడి వెడలి వచ్చిన మ్లేచ్ఛబలములు బహుసంఖ్యాతములును శౌర్యవీర్యవైర సంయుతములు నైనవి.

చాణక్య చంద్రగుప్తుల యాలోచన మూలమున, మ్లేచ్ఛబలములు రెండు భాగములుగ వీఁడి, పూర్వభాగము గండకీ ప్రాంతముసేరి పాటలిని ముట్టడింపఁ బోవ పర్వతరాజుచే నడపఁబడిన మూలబలము గంగా శోణాసంగమము వైపు నడచెను. నందులు తమసైన్యముల నడపుకొని సరయూసంగమున శత్రువునకై వేచియుండఁగా, ఇందుశర్మ తంత్రములఁ బన్ని నందుల విడఁదీసి చాణక్యునివలయందుఁ జిక్కించెను. అంత నితఁడు వీరి నందఱను సంహారింపించి మొదటి ప్రతిజ్ఞను నెరవేర్చుకొనెను.

### మంత్రిరాక్షసుఁడు.

నందమంత్రులలో ప్రముఖుఁడును ప్రచండధీబలదోర్బలములు గలవాఁడు నొకడుండెను. ఇతనిపేరు రాక్షసుఁడు. రాజ్య

నిర్వాహణమునందు మనుష్యులలో నితనికి సమానుఁ డక్కాలమున లేనందున, అట్టి అమానుష ప్రజ్ఞా శౌర్యములకు రాక్షసుఁ డని బిరుదుఁ బడసియుండెను. స్వామిభక్తి పరాయణుఁడగు నీతఁడు తన యనుపమేయ సాహసంబుతోఁ బగతుర సైన్యములఁ బలు సోలించి కూలించి నందుల శ్లాఘనను బడసెను గాని నంద నాశ వృత్తాంతము సేనలయందుఁ బర్వఁగనే పర్వతరాజు బలముల కుత్సాహాధిక్యమును పాటలి బలములకు దైన్యాధిక్యమును రాక్షసునకు శోకవిహ్వలతయు నుప్పతిల్లె.

నందసంహార మయినను మంత్రి రాక్షసుని ప్రతిభా విశేషమునకును స్వామిభక్తికిని వెఱచి చంద్రగుప్తుఁడు పాటలి నగరమునఁ బ్రవేశించినవాఁడు కాఁడు. మఱియు చాణక్యుఁడు తన రెండవ పంతమగు చంద్రగుప్త పట్టాభిషేకమును జెల్లించుట కుపాయముల నాలోచించుచు పాటలీ ప్రవేశ ప్రయత్నమందు నుద్యుక్తుఁ డయ్యెను. కావున జయరాత్రిని పర్వతు బలములు పురికి దూరమ్మున శిబిరములయందు విడిసియుండెను.

## విషకన్యక.

ఇంతలో రాక్షసుఁడు నందుల కుచితమైన తర్పణము చాణక్య చంద్రగుప్త పర్వతేశ్వరాదుల సంహారమె యని నిశ్చయించుకొని, అదిముగించుటకు యుద్ధోపాయ మక్కఱకు రానందునఁ దగిన మాయోపాయములను తనయావచ్ఛక్తితోఁ బన్నెను. అందు మొదటిది విషకన్యా ప్రయోగము. చిఱుత



ప్రాయమునుండి యొకయాఁడు పిల్లను రాక్షసుఁడు సాఁకుచు వచ్చెను. దీనికిఁ గ్రమక్రమముగ నల్పమాత్రలనుండి యెక్కించుచు నధికమాత్రల పర్యంతము జీర్ణమగునట్లుగా విసము మెసవించు చుండెను. ఈ చిన్న దిపుడు నవ యువతిగను జగన్మోహనాంగిగను నుండె. జీవసిద్ధియను పేరఁబరంగుచు తనయొద్ద నాశ్రితుఁడుగ, విశ్వాస పాత్రుఁడుగ, దైవజ్ఞ సూత్రుఁడుగనున్న క్షపణక వేషధారి నిందుశర్మను బిలిచి యతనిని బలువిధములఁ బొగడి యొకసందేశమునకు నియ్యకొలిపి విష కన్యక నొప్పగించి చంద్రగుప్తునకుఁ దన కుమారార్పణా స్వాగత సూచకమగు కానుకగా నాచిన్న దానిని జేర్చుమని వేడెను. అట్టిసందేశ సమర్పణములతో నాజీవసిద్ధి చాణక్య సన్నిధిఁ జేరి నితఁడును రాక్షసాపేక్ష నూహించి చంద్రగుప్తునకు పరస్త్రీ కాంక్ష లేమిని దెలిపి పర్వతేశ్వరుని సంశ్లేషంబునకు కొనిపోవు నట్టి యుపాయమును చేయింప, బుద్ధిహీనుఁడును కామాతురుఁడును నగు నాపర్వతేశుఁడు ఆకన్యకను స్వీకరించి విషస్పృష్టుఁడై మృతినొందెను. ఇట్లు చాణక్యుఁడీ యుక్తి వలనఁ జంద్రగుప్తుని ప్రాణములను దక్కించుటయే కాక నందరాజ్యములో భాగమడుగకుండఁ బర్వతేశ్వరునిఁగూడ సంహరించెను.

## భాగురాయణుఁడు.

పర్వతరాజు కొమారునిపేరు మలయకేతువు. తండ్రి మరణముచే భీతిఁబడుచున్న మలయకేతువు నొద్దకు సేనాపతి

భాగురాయణుఁడువచ్చి పర్వతేంద్రుఁడు చాణక్యునిచేఁ జంపింపఁబడెననియు మలయకేతువు తక్షణమే స్వదేశమునకుఁ బారిపోవని యెడల వాఁడు గూఁడ అర్ధరాజ్యమొసఁగఁగొట్టఁ దలఁచిన చాణక్యునిచేఁ జంపింపఁబడుననియు చెప్పి చంద్రగుప్తచాణక్యుల మీఁదఁ దనకు భక్తి లేనందున మలయకేతువునే యాశ్రయించి మనుదమని నిశ్చయించి వచ్చినట్లు దెలిపి, యతనియొద్ద గొలు వమరియుండి చంద్రగుప్త పరమున మలయకేతువును వంచించెను. మలయకేతువు ఆమాటలనమ్మెను. భాగురాయణుండును అత్తెఱంగుననే సలుపుచు మలయకేతువును దోడ్కొని పర్వతరాజ్యంబుఁ జేరి యతనికమాత్యుఁడుగ నమరియుండెను.

రాక్షసుని మాయోపాయములు.

ఇట్లు పర్వతకుఁడు చచ్చిపోవ, మలయకేతువు పాఱిపోవ, చాణక్యచంద్రగుప్తులు పాటలీపురియందు జయఘోషముతోఁ బ్రవేశించిరి. రాక్షసుఁడు నందున కీయకొనన ట్లభినయించుచుఁ బ్రవేశించిన సైన్యములపై తన సైన్యముల ద్రోలి పెక్కు శత్రువుల సంహరించెను. నందపక్షమే జయించినట్లు జయఘోషములఁ జేయించి చంద్రగుప్త పట్టాభిషేకము నాటంకపఱచెను. సర్వార్థసిద్ధిని భద్రపఱచినయెడల, స్వీకారపుత్రుని ద్వారా నందవంశమును నిలుపవచ్చునని, అతని సురంగమార్గమున నగరునుండి వెడలిపోయి తపోవనంబుననుండుమని వేఁడి పంపెను. తనకు అత్యంతప్రాణ సఖుండగు చందనదాసుని వశ



మున గర్భిణియగు స్వపత్నిని పుత్రసమేతముగ నిలిపి కాపాడుమనియెను. తన కార్యస్థుని శకటదాసునివశమున రహస్యములగు ధనకోశముల నప్పగించి నందపక్షబలంబునకై యుక్తరీతినెల్ల వ్యయంబు సేయఁబనిచెను. సూత్రధారదారువర్మను పిలిచి రాజభవనపు పూర్వద్వారమును కనకతోరణాదులతో నలంకరించి అందు యంత్రమును నిలిపి దానిని చంద్రగుప్తుఁడు ప్రవేశించునపుడు సడలించి వాని తలపైఁ ద్రోయించి చంప నియమించెను. పట్టపుటేనుఁగు మావటికాని బర్బరకుని పిలిచి సవారిని మంచియదనుజూచి కనకదండికలో దాఁచిన కత్తిని దుస్సి, వెనుకనుండు చంద్రగుప్తుని పొడిచి చంపుమనియెను. రాజవైద్యుఁడౌ అభయదత్తుని రప్పించి యోగచూర్ణము గలిపిన యౌషధముతో చంద్రగుప్త మరణమును సంపాదించుమని ప్రేరేపించెను. రాజశయనాధికారియగు ప్రమోదకుని బంచి చంద్రగుప్తుఁడు మైమఱచి నిదురించుతఱిని సానకత్తితో సంహరించుమనియెను. రాజగృహముయొక్క అంతర్భిత్తి సురంగమునందు బీభత్సకాది ఘాతుకసమూహమును వేచియుండ నేర్పఱచి శయనమందు చంద్రగుప్తుని బ్రహరింపింప దిట్టము చేసెను. ఈప్రకారము రాక్షసుఁడెన్ని సందిగ్ధసమయములందు చంద్రగుప్త సంహారమునకై యతిచతురతరోపాయములఁ బన్నినను నందొక్కండైన నతనికి సుఫలప్రదంబు గాకపోయెను.

సర్వార్థసిద్ధి తపోవనం బరిగినది విని చాణక్యుఁడు నమ్మకమైన ఘాతుకులఁ బనిచి యతని శిరము దునిమించెను. ఇట్లు విషకన్యకమూలమున బర్వతరాజ మరణమును, చాణక్యప్రయత్నమున సర్వార్థసిద్ధి మరణమును, విని, రాక్షసుఁడు తన కింకఁ బాటలియందు నిలుకడ తగదనియెంచి సురంగమార్గమున నగరు వదలి పర్వతరాజ్యమునకు నడచెను. నడచిపోయి మలయకేతువు నాశ్రయించి తననందభక్తియు మృతినందతర్పణప్రతిజ్ఞయు విప్పి చెప్పెను. పర్వతేశ్వరునకు ఉచితతర్పణము శత్రుసంహార రూపమున మలయకేతువు ఆచరింపవలసిన యగత్యమును గట్టిగ బోధించెను. రాక్షసునివంటి యమాత్యశ్రేష్ఠుఁడు తోడై యుండఁ దనకు తప్పక జయము కలుగునని నిశ్చయించి అతఁడు తన సైన్యముల నెల్ల సన్నద్ధపఱచి యుద్ధమునకు బయలుదేరెను. అతనికి కశ గాంధార యవనక శచీన పూణకొలూతాది రాజులు తోడ్పడిరి.

## చాణక్య ప్రయత్నములు.

చాణక్యుఁ డీవినోదములను చూచుచు నూరకుండెనా? లేదు లేదు. రాక్షసుని ప్రయత్నముల నన్నిటిని జారులచేఁ దెలిసికొనుచు నాతని మాయోపాయముల కన్నిటికిని ప్రతిమాయోపాయములు పన్నుచు చంద్రగుప్తునకు నెట్టి యాపద రాకుండఁ గాపాడుచుండెను. తనకు పరమ మిత్రుఁడగు పర్వతరాజు ఘాతమునకై రాక్షసుని పనుపున విషకన్యనుదోడ్కొని



పోయెనని నేరముమోపి జీవసిద్ధిని గ్రామమునుండి వెడలఁగొట్టెను. ఇందుమూలమునఁ జిరిగియు రాక్షసాశ్రయము జీవసిద్ధి కనుకూలించునట్లును, ఇట్టియనుకూలమున చంద్రగుప్తుని పరమున వేగు చూచుటకును, రాక్షస మలయకేతువులకు వైరము కల్పించుటకును, జీవసిద్ధికి సందుదొరికెను. మఱియు నీయుపాయము వలన పర్వత రాజు నొద్దకు విషకన్యను బంపిన వాఁడు చాణక్యుఁడన్న యపవాదము తొలఁగి ఆకన్యను రాక్షసుఁడే బంపెనన్న జనశ్రుతి పుట్టెను.

చాణక్యుఁడు పట్టణమునందంతటను తన చారుల నంపి నందపక్షపాతు లెవ్వరెవ్వ రెచ్చటనున్నది కనుగొనుచుండెను. ఒకచారునివలన నమాత్య రాక్షసుని భార్యాపుత్రాదులు పాటలిపురములోనే యొకసెట్టి యింటనున్నారని తెలిసికొనుటయేగాక రాక్షసుని చేతి ముద్రికయు సంపాదించెను. ఆముద్రికా సాహాయ్యము వలన నాతఁడు కొన్ని కాగితములు సృష్టించి మలయకేతువునకును రాక్షసునకును వైరము కలుగునట్లు చేసి వారి దాడిని వ్యర్థపుచ్చెను. ఇట్లు రాక్షసుఁడు చేసిన పరశిక్షణోపాయముల నెల్ల చాణక్యుఁడు తగుపాటి ప్రతివిధానముల నేర్పఱచి రెప్పవాల్పక చంద్రగుప్తుని రక్షించుచుండెను. నందాదులందఱు మృతినొందినను వారియెడ భక్తి విశ్వాసములు గలవాఁడై వారిశత్రువుఁడైన చంద్రగుప్తు నెట్లయిన సంహరించి తినమృతస్వాములకు తృప్తిం గలుగఁ జేయవలెనని యమాత్య

రాక్షసుఁడు పట్టు విడువకుండెను. అమాత్య రాక్షసునివంటి మంత్రి చంద్రగుప్తుని కబ్బినయెడల నతఁడసామాన్య వైభవ శాలియగునని యెంచి రాక్షసున కెన్నియో యాశలు చూపి చాణక్యుఁడతని వశపఱచుకొన నెంచెనుగాని యా స్వామి భక్తపరాయణుఁడు లోఁబడిన వాఁడు కాఁడు. తుదకు నీ క్రింది యుపాయముచే రాక్షసుని వశపఱచుకొనెను.

### రాక్షసుని వశీకరణము.

చందన దాసుఁడను సెట్టి పాటలీపురమున కలఁడు. అతఁడు రాక్షసునకు పరమమిత్రుఁడు. రాక్షసుఁడూరువిడిచి వెళ్లినప్పుడు తనభార్యా పుత్రాదుల నీతనియింటనే విడిచి వెళ్లెను. ఈ సంగతి తెలిసికొని చాణక్యుఁడు రాక్షస భార్యా పుత్రాదులను తనస్వాధీనముచేయుమని చందనదాసుని నిర్బంధ పెట్టెను. కాని యాతఁడు మిత్రద్రోహముచేసినవాఁడు కాఁడు. అందుకాతనికి నురిశిక్ష విధింపఁబడెను. ఈసమాచారము తెలిసి తనకొఱకై తనమిత్రుఁడు చంపఁబడుట న్యాయము కాదని తలఁచి రాక్షసుఁడు తన ప్రతిస్పర్ధియయిన చాణక్యుని స్వాధీనమయి తనను జంపి తనమిత్రుని విడువ వలసినదని కోరెను. కాని "నీవు చంద్రగుప్తుని మంత్రిత్వము నొప్పుకొనిన యెడల నీమిత్రుని రక్షించెద" మని చాణక్యుఁడు చెప్పగా విధిలేక రాక్షసుఁడు అందునకు నొప్పుకొనెను. ఈ సమాచారమంతయు క్రీ. పూ. 322వ సంవత్సర ప్రాంతమున జరిగియుండును. అమాత్యరాక్షసుని



సాహాయ్యము వలనను చాణక్యుని మంత్రపు సాయమువలనను చంద్రగుప్తుఁ డరిభంజకుఁడై తనరాజ్యమును భరతఖండమందంతటను వ్యాపింపఁ జేయుటయేగాక హిమాలయ పర్వతమున కావలనుండుదేశమును గూడ సాధించెను.

### చరిత్రాంశములు.

రాక్షసుని వశపఱచుకొనినప్పుడే మలయ కేతువును గూడ వశపఱచుకొని యాతనిచే చంద్రగుప్తునకు సామంత రాజుగా నుండుట కొప్పించుకొని చాణక్యుఁ డాతని రాజ్యమునకు నాతని బంపి వేసెను. ఈమలయకేతు వెవ్వఁడై యుండనోపు? ఇతనిచే నడుపఁ బడిన మ్లేచ్ఛయవన కాంభోజాది సైన్యములనఁగనెవ్వి? ఈ ప్రశ్నలకుఁ బండితు లనేకులు పెక్కు-రీతుల ప్రత్యుత్తర మిచ్చుచున్నవారు. మలయకేతువు తండ్రి పర్వతరాజని చెప్పఁబడియున్నది. అందుచే నాతఁడు హిమాలయ గిరికందరప్రాంతమున వసించువాఁడని తోఁచుచున్నది. చంద్రగుప్తుని కిట్లు సాయము చేసిన సైన్యములు గ్రీకుసైన్యములని కొందఱు యూరోపియనుల యభిప్రాయము. కాని గ్రీకుచరిత్రకారు లందఱును చంద్రగుప్తునకు గ్రీకుసైన్యములు సాయముచేసినట్టు వ్రాసియుండనందున పై యభిప్రాయము సరియైనది కాదని కీర్తిశేషులైన కాశీనాథ త్ర్యంబక తెలంగు గారి యభిప్రాయమై యున్నది. పిలిప్పాస్ అను గ్రీకుక్షాత్రపుని హిందువులు చంపిరని కర్టియస్ మొదలైన గ్రంథకారులు

వ్రాసినందున ఈక్షత్రపుఁడే పర్వతరాజ నామముతో హిందూ గ్రంథములందు వర్ణింపఁబడి యుండ నోపునని తలంప వచ్చును. తరువాత చంద్రగుప్తునిచే నోడింపఁబడి యాతనితో సంధిచేసి కొనిన శల్యూకస్ అనువాఁడే మలయకేతువైనఁ గావచ్చును కాని ఇది యిట్లని నిశ్చయముగాఁ జెప్ప వీలులేదు. హిమాలయ పర్వత సమప్రదేశము లందును దరులందును పార్వతీయజాతుల వారనేకు లిప్పటికిని వాసము చేయుచున్నారు. అట్టివారు గొందఱుచంద్రగుప్తునకు సహాయులు వచ్చియుందురు. అప్పుడా ప్రాంతముల గ్రీకువారును కొంద ఱుండినందున వారును నీ సైన్యములో చేరినను చేరియుండవచ్చును.

---

## నాలుగవ ప్రకరణము.

### గ్రీకువారితో యుద్ధము.

చంద్రగుప్తుఁ డసంఖ్యాకములగు సైన్యములఁ గూర్చు కొని యపరిమిత పరాక్రమవంతుఁడై యదివఱకు పంజాబ్ దేశము నాక్రమించియున్న గ్రీక్ సైన్యములఁ బూర్తిగ నోడించి వెడలఁగొట్టెను. కాని ఈ కథాభాగమంతయు సవిస్తరముగ వర్ణించుటకుఁ బూర్వము గ్రీకువా రెవరైనది, వీరీ దేశమున కెట్లువచ్చినది సంగ్రహముగఁ జెప్పవలసియున్నది.

సింధునది కావలివైపుననుండు సులేమాను హాలా పర్వతములు సరిహద్దుగ బ్రారంభమయి వరుసగ పశ్చిమమున అఫ్గనిస్థానము, బెలూచిస్థానము, పరషియా (పారసీకము) ఆసియాలోనితుర్కి, ఐరోపాలోని తుర్కియను దేశనామముల చేఁ బిలువంబడు భూభాగమంతయు మన కథాకాలమునఁ బార సీకముగ నుండెడిది. అట్టి పారసీకమునకుఁ బశ్చిమసరిహద్దు మక డోనియా రాజ్యము. ఈ మకడోనియాకు దక్షిణమున గల దేశము గ్రీసు. అక్కడి జనులే గ్రీకులు. ఇట్లు గ్రీకు మకడోని యా దేశములకును హిందూదేశమునకును మధ్యనుండినది పూర్వకాలమున నొక్క పారసీకమె. ఇందు దక్షిణ సముద్రము

నుండి గెడ్రోష్యా, అరకోష్యా, పరోపమిశదము, బాక్ట్రియానా, సాగ్డియానా క్రమముగ నుత్తరమున వ్యాపించియుండెను. ఇందు గెడ్రోష్యా, అరకోష్యా, పరోపమిశదములు ఇక్కాలమున బెలూచిస్థానము, అఫ్గనిస్థానము లనఁబడుచున్నవి. బాక్ట్రియానా సాగ్డియానాలు ఇప్పట్ల బొకారా, సమరకండము లనియు, భారతమున బాహ్లిక మనియు, ప్రకటములై యున్నవి. పరోపమిశద బాక్ట్రియానాలకు నడుమ హిందూకుశ పర్వతములును, బాక్ట్రియానా సాగ్డియానాలకు నడుమ ఉకు (Oxus) నదియును నున్నవి. సాగ్డియానా దేశమునకు దక్షిణమున ఉకునదియు ఉత్తరమున జాక్సార్టిసు నదియును పాఱుచున్నవి. అరకోష్యాకు పడమట డ్రాంగియానా, పరోపమిశదమునకు పడమట ఆర్యా, బాక్ట్రియాకు పడమట మార్గియానా దేశములు కలవు. గెడ్రోష్యాకు పడమట కార్మానియా, పెర్సిసు దేశములును వీని కుత్తరమున ఎడారియు దీని కుత్తరమున వరుసగ పార్థియ, హుర్కేనియా దేశములు వ్యాపించి కశ్యప (Caspian) సముద్రమును డాయుచున్నవి. పార్థియ హుర్కేనియలకు పడమటను, కశ్యప సముద్రమునకు దక్షిణ పశ్చిమముల మధ్యదేశము ఉన్నది. మధ్యదేశమునకు దక్షిణమున నూసియానా సీమయున్నది. ఈ దేశములన్నియు గలిసి ఇప్పట్ల పెరిషియా (పారసీకము) అని పఱఁగుచున్నవి. ఇట్టి భూమికి పడమట టైగ్రిసునది ప్రవహించుచున్నది. టైగ్రిసునది మొదలు సింధునది వఱకును, పారశీక అరేబియా సముద్రములు మొదలు కాకసపర్వతము కాశ్యపసముద్రము జాక్సార్టిసునది వఱకును, వ్యాపించియుండు భూభాగమునకు అతిప్రాచీనకాలమునందు, ఐరాను అనగ ఆర్యావర్తమని పేరు. ఇందున్న వారికి ఆర్యులని పేరు. ఈ ఆర్యులే క్రమముగ ప్రజాధనబలముల ప్రబలించి నానాదిగ్దేశములనువ్యాపించి, నేఁటికిని పృథివీతలవాసులలో నత్యంత బుద్ధి భుజబలాఢ్యులై విలసిల్లు చున్నారు. అగుంగాక. మనము ప్రస్తుతమనుసరింతము.

గ్రీసు దేశమునకును హిందూదేశమందలి సింధూనదమునకును అంతరము రమారమి నాలుగువేల మైళ్లుండును. గ్రీసు దేశస్థులను గ్రీకువారని పిలిచెదరు. వీరిని మన పూర్వులు మ్లేచ్ఛులనియు యవనులనియు వాడియున్నారు. ఈ పదములకు చదువరులు మహమ్మదీయులని యర్థము చేయగూడదు. ఏలయన మేమిప్పుడు వ్రాయుచున్నకథ మహమ్మదు పుట్టుటకు పూర్వము జరిగినది. ఈ వృత్తాంతము జరిగిన తరువాత 900 సంవత్సరములకు మహమ్మదు పుట్టెను. గ్రీకువారు మహాబలాఢ్యులు. మగధదేశముపై నందులు రాజ్యము చేయుచున్నప్పుడు గ్రీసుదేశమును దనసామ్రాజ్యమునఁ జేర్చుకొనియుండిన మకడోనియాలో అలెగ్జాండరను నొక మహావీరుఁడు క్రీ. పూ. 356 వ సంవత్సరమందు జన్మించెను.

### అలెగ్జాండరు దండయాత్ర.

ఇతఁడు పెక్కుదేశములు జయించి పారసీకదేశమును స్వాధీనపఱచుకొనిన తరువాత హిందూదేశము మీఁదికి దండెత్తి వచ్చెను. ఈతఁడు క్రీ. పూ. 327 వ సంవత్సరము మేనెల మొదలుకొని క్రీ. పూ. 324 వ సంవత్సరము మేనెలవరకును అనఁగా మూఁడు సంవత్సరముల కాలము పంజాబ్ సింధు దేశముల యందుండి చిన్నచిన్న రాజ్యము లనేకములు జయించెను. ఇతనికిఁ దమంతట వశులయిన గొప్పరాజులలో మొదటివాఁడు తక్షశిలా నగరాధీశ్వరుఁడు. తక్షశిలా రాజ్యము సింధూ జీలమ్ నదుల నడుమనుండి పూర్వము మిక్కిలి విఖ్యాతివడసి యుండెను. బౌద్ధ కాలమునందు తక్షశిలా (రావల్ పిండి) నగరము సకల విద్యలకుఁ బుట్టినిల్లైయొప్పెను. అలెగ్జాండర్ సింధునదికిఁ దూర్పున విడిసియుండగనే తక్షశిలా రాజగు ఆంభీ అనువాఁడు ఏడువందల గుఱ్ఱములును, ముప్పది యేనుఁగులును, మూఁడువేల బలిసిన ఎద్దులును, పదివేల బలిసిన గొఱ్ఱెలును, కానుకగాఁ దీసికొనిపోయి అలెగ్జాండరు శరణుఁజొచ్చెను. ఇట్లు పంజాబు దేశమందలి యొక గొప్పరాజే అలెగ్జాండరుకు వశుఁడైనందున నతనిసాహాయ్యమువలన నలెగ్జాండరు పెక్కు స్వదేశీయ రాజుల నోడింపఁ గలిగెను.

అలెగ్జాండరు సింధునదముమీఁద ఓహింద్ అనుస్థలము నొద్ద నావలతో వంతెనకట్టి దాటి తక్షశిలా రాజ్యమునకు



వచ్చి అచ్చటిరాజువలన మిక్కిలి గౌరవమందెను. అటనుండి యాతఁడు తక్షశిలా సైన్యములనుగూడ వెంటఁబెట్టుకొని పోరస్ రాజ్యముమీఁదికి దండెత్తి వెళ్లెను. జీలమ్ చీనాబ్ నదుల నడుమ పోరసు లను పౌరుషప్రధాను లప్పుడు రాజ్యము చేయుచుండిరి. గ్రీకు చరిత్రకారులు ఈ రాజుల పేరు పోరస్ అని వ్రాసిరి. ఈపదము పౌరవపదద్యోతక మని కొందఱును పురుషోత్తమపదద్యోతక మని మఱికొందఱును వ్రాసియున్నారు. అప్పటి పౌరవరాజు హూణుఁడగు నలెగ్జాండరును జీలము నదియొద్ద తన చతురంగసేనతో నెదురించెను. ప్రస్తుతము చిలియూం౯ వాలా యనఁబడు మైదానమునకుఁ బశ్చిమమునఁ బదునాల్గుమైళ్ల దూరమున నదియొడ్డున ఘోరమైన పోరుగలిగె. ఇంటిగుట్టు లంకకుఁ జేటన్నట్లు లీయుద్ధములోఁ దక్షశిలా రాజులు తమ స్వదేశస్థుఁడగు పురుషోత్తమునికి సాహాయ్యము చేయుటకు మాఱుగ దేశఘ్నులై తమసైన్యముతో నలెగ్జాండరు పక్షమునఁ బోరిరి. అందువలనను, బురుషోత్తముని రథంబులు నదియొడ్డు బురదలో దిగఁబడినందునను, అతని యేనుంగులు తిరుగఁబడి యతనిసైన్యమునే నాశనము చేసినందునను అలెగ్జాండరు సైన్యములు పురుషోత్తముని సైన్యములకంటె నెక్కుడుగా నున్నందునను, అతనికిఁ బరాభవము గలిగి యలెగ్జాండరునకే జయము గలిగెను.

అలెగ్జాండరు పంజాబుదేశములోను, సింధు దేశములోను, రెండుసంవత్సరముల కాలముండెను. అంతలో నుత్తర పంజాబులోని తక్షశిల (డేరిమహాన్), నికాయా (మాంగ్); దక్షిణ పంజాబులోని అలెగ్జాండ్రియా, (వుచ్), సింధుదేశములోని పాటల (హైదరాబాద్), అను స్థలముల రాజులను దనకు నంకితులఁ జేసికొనియెను. తన సైన్యములోఁ గొంత భాగ మచ్చటచ్చట నుంచెను.

ఆతనికి హిందూదేశమంతయు జయింపవలెనను కోర్కె యుండెనుగాని యతని సైన్యములు బియాస్ నది దాఁటుటకు సమ్మతింపక తిరుగఁబడినందున నాతఁడు క్రీ. పూ. 325 లో మరలిపోవలసినవాఁ డాయెను. తానుపంజాబుదేశములో సంపాదించిన రాజ్యమును కాపాడుటకు నధికారుల నియమించి వెళ్లెను.

### చంద్రగుప్తుఁ డలెగ్జాండరును జూచుట.

ఇట్లు మన కథానాయకుండగు చంద్రగుప్తుఁడు చిన్న వయస్సులో నుండఁగా పంజాబుదేశమంతయు గ్రీకు దేశస్థులచే నాక్రమింపఁబడియె. నందవైరము కారణముగ చంద్రగుప్తుఁడు పాటలిపురమునుండి పలాయితుఁడై పంజాబు ప్రాంతమున దిరుగుచు నలెగ్జాండరుని దండుఁజొచ్చి యాతని దర్శించినట్లును నందులు సర్వజన విరోధులుగావున వారి నోడఁగొట్టి మగధము నాక్రమించుట మహాసులభ కార్యమని గ్రీకు యోధశ్రేష్ఠునకు



నేప్యభారత చక్రవర్తి మంత్రోపదేశ మొసఁగినట్లును, యేదో యొక కారణమువలన అలెగ్జాండరునకు చంద్రగుప్తునిపై నాగ్రహముప్పతిల్లి యతనిని బట్ట నాజ్ఞయిడ నతఁడు పర్వతప్రాంతములోనికిఁ బారిపోయినట్లును ప్లూటార్కు వ్రాసి యున్నాఁడు. ఈమాటయే నిజమైనయెడల చంద్రగుప్తుఁ డిరువదియేండ్ల వయస్సును మించనివాఁడుగా నున్నప్పుడు అలెగ్జాండరు మన దేశము మీఁదికి దండెత్తి వచ్చెనని మన మూహింపవచ్చును. కాని అలెగ్జాండరుతో నితనికిఁ బోరేల కలిగెనో మనమూహింపలేకున్నాము.

మూఁడులక్షల సైన్యపు వ్యూహములను, మగధాధీశుని యేకచ్ఛత్రాధిపత్యమును, మహాపద్ముని ధనజనాదివైభవములను, చూచిన చంద్రగుప్తుని కనులకు అలెగ్జాండరుని 50,000 సైన్యమును పేదటికమును చులకనయై తోఁచెనో? అలెగ్జాండరు చంద్రగుప్తుల పరస్పర మర్యాదోపచారములలో హెచ్చుతక్కువలు కానిపించెనో? గాంగేయసీమకు రాక స్వదేశ ప్రయాణోన్ముఖుఁడైన గ్రీకువీరుని జూచి మౌర్యుఁడు పరిహాసించెనో? సాయమిచ్చి గాంగేయ భూమిని బొసఁగ గూర్చినయెడ, తనకు భవ్యతం జూపమని తెల్పిన మౌర్యునిపై నలెగ్జాండరు కినిసెనో? సామాన్య సంభాషణయందే చంద్రగుప్తుని స్వసామ్యతాగౌరవ భావంబుల కలెగ్జాండరోర్వక పోయెనో? చింత్యము.

## చంద్రగుప్తుఁడు స్వతంత్రుఁడగుట.

పైని వర్ణించినట్లు గ్రీసుదేశీయుఁడగు నలెగ్జాండరు పంజాబుదేశంబునఁ గొంత రాజ్యము సంపాదించి, వాని రక్షణార్థమై కొందఱు సైనికుల నటనట నునిచి వెడలిన తరువాత వారిని వెడలి గొట్టి యారాజ్యమును దానాక్రమించుకొనవలెనని చంద్రగుప్తుఁడు ప్రయత్నములు చేయఁ దొడఁగెను.

మహావీరుఁడగు నీతఁడు సమయమును కనిపట్టి వాయవ్యప్రాంతమందలి యుద్ధప్రియులగు భటులను నరాట్టులను గూర్చుకొని శేషించిన గ్రీకుదళముల విదళీకరించి సైన్యబలమును నానాఁటికి వృద్ధిఁజేసికొని ప్రాంతసీమలకెల్ల నధికారి యాయెను. (క్రీ. పూ. 322) అరాట్టులు, * అనఁగ, పంజాబు నివాసులును దొంగలును దోపిడికాండ్రును అని భారతమునందు దూషింపఁబడి యున్నారు. కతేయులు నటులనే దూషింపఁబడి యున్నారు. కాని ఈ అరాట్టుల సీమలు ప్రజాసభ పాలితములై, రాజుల కధికారమియ్యక స్వతంత్రజనపూరితముగ నున్నట్లు తోఁచెడిని.

మహామ్మదీయ చరిత్రమునందు అక్బరు చెల్లాచెదరుగ నున్న దేశభాగముల నెల్ల తన యాజ్ఞయం దిమిడ్చికొని చక్రవర్తిత్వముఁ బడసినట్లు అతనికి 1900సంవత్సరములకుమునుపు చంద్ర

* అరాట్టులు, అరాష్ట్రులు అను పదములను గ్రీకు చారిత్రకులును చోరార్థమునం దుపయోగించి యున్నారు.



గుప్తుఁడు చెల్లాచెదరుగనున్న సామంత ప్రభుత్వములనెల్ల ఏకాజ్ఞాచక్రమునకు వశపఱచుకొని మగధాధీశుఁడాయె ననవచ్చును.

చంద్రగుప్తుఁడిట్లు గ్రీకు వారిని వెడలఁగొట్టి, పంజాబు దేశమంతయు నాక్రమించుకొని, నందుల నోడించి, మగధ రాజ్యము సంపాదించి, హిందూదేశమున కంతకును దాన యేకచ్ఛత్రాధిపతిగ నుండఁదలఁచి సైన్యముల మిక్కిలి యభివృద్ధి చేసెను. ఆతనియొద్ద నాఱు లక్షల కాల్బలమును, ముప్పది వేల స్వారులును, తొమ్మిది వేల గజంబులును నుండెను. ఈ ప్రచండ సైన్యంబుతో నాతఁ డుత్తర హిందూదేశ మందలి యన్ని రాజ్యములను గెలిచి, నర్మదా హిమాలయములు దక్షిణోత్తరపు టెల్లలుగను బూర్వపశ్చిమ సముద్రంబు లాయా దిక్కుల యెల్లలుగను గల యార్యావర్తంబున కంతటికిని ప్రథమ చక్రవర్తి యయ్యెను.

## శల్యూకస్‌ను జయించుట.

అట్లు పంజాబునుండి వెడలఁగొట్టఁబడిన గ్రీకువారికి శల్యూకస్ నికేటర్. అను రాజుగలఁడు. ఇతఁడు మొదట నలెగ్జాండరు నొద్దనున్న గొప్పసేనానులలో నొకఁడు. అలెగ్జాండరు కాలధర్మము నొందిన తరువాత సెల్యూకస్ కొన్ని దినముల వఱకు నితర సేనానులతోఁ బోరాడి ఆసియా ఖండములోని పశ్చిమ భాగమునకును మధ్యభాగమునకును రాజై బేబిలోన్ పట్టణమందు క్రీ. పూ. 312 వ సంవత్సరమున పట్టాభిషిక్తుఁ డయ్యెను.

అతని రాజ్యము యొక్క తూర్పుసీమ హిందూదేశము నంటి యున్నందున గ్రీకుపతాకమును మఱల పంజాబు దేశములో నిల్ప నెంచి దానిపై దాడివెడలి వచ్చెను. (క్రీ. పూ. 305). అప్పటికి చంద్రగుప్తుఁడు సింహాసనమెక్కి పదునైదు సంవత్సరములయి యుండెను. అతఁడు పంజాబు సింధు దేశములను, గుజరాతు దేశమును జయించి వశపఱచికొని యుండెను. సెల్యూకసు సింధునది దాఁటుట నడ్డగింపక చాణక్య చంద్రగుప్తులు అత్యంత చాతుర్యముతో అతని సైన్యములనెల్ల తమ సైన్యములతో చుట్టి ముట్టడించుకొని బంధించి వేసిరి.

ఇట్టి యవసరమున సెల్యూకసు యుద్ధముఁజేసి సోలి పోయి శరణాగతుఁడాయెనని కొందఱును; యుద్ధము సేయుటకు వెఱచి తన దుర్బలము నరసి వీర్యముకంటె వివేకము మేలని నిశ్చయించి చంద్రగుప్తునకు శరణాగతుఁడాయెనని మఱికొందఱును వ్రాసి యున్నారు. కాని సెల్యూకసు శరణు వేడుటయు చంద్రగుప్తుఁడభయమిచ్చుటయు జరుగుటకు పూర్వమే తమ చేతఁ జిక్కిన మకడోనియా సైన్యములపై మాగధసైన్యములు కసిదీర్చుకొనె ననుటకు సందియము లేదు. (క్రీ. పూ. 303.)

చంద్రగుప్తుఁడు శల్యూకసుతో నొడంబడిక చేసికొని, గెడ్రోషియా అరకోషియా అనఁబడు అఫ్గానిస్థాను బలూచిస్థాను దేశముల నూడఁబీకికొనియెను. ఇప్పటి యాంగ్లేయులు పశ్చిమోత్తర సామంతసీమలందు పర్వతరక్షితమై, పరశత్రువుల



కభేద్యమై యుండు సరిహద్దులు తమచేతఁ జిక్కఁబడవలెనని యత్నించిరి. మోగలరాజులును యత్నించిరి. కాని వీరి కేరికిని సాధ్యము కాలేదు. ఇట్టి సరిహద్దులు 2200 సంవత్సరములకు మునుపె మనదేశపు చారిత్రిక చక్రవర్తియగు చంద్రగుప్తుని యఱచేత నిమిడియుండెనన్న మన కెంతటి యశఃకరము నానందకరముగ నున్నది!

చంద్రగుప్తుఁడు సెల్యూకసును అంతటితో వదలిపెట్టలేదు. అతని కుమారిత సుందరియు, యువతియు, నిపుణయునై యున్నందునను, తనకు మహిషినష్టమై యున్నందునను, యవనులిఁక మీఁదట శత్రుత్వము పాటింపకుండునట్లు దగుపాటి వస్తువును విశ్వాస స్థానమందుంప వలసియున్నందునను, యాదవ పాండవులయు విరాట పాండవులయు వియ్యంబులు వోలె నా కాలమునందు వియ్యంబు నెయ్యంబునకు ఆధారముగ భావింపబడినందునను, చాణక్య మంత్రాలోచన నంగీకరించి చంద్రగుప్తుఁడామెను తనకు భార్యగ నామె తండ్రి సమర్పించునట్లు చేసెను. అటుపిమ్మట నా గ్రీకునాయకుఁడు తనకు 500 ఏనుఁగులు కావలయునని వేడ, ఒక గజగమనకు మూల్యముగ 500గజముల నియ్యవచ్చునను వాదుక ననుసరించి చంద్రగుప్తుఁడు మామకు బహుమానమంపెను. నాఁడు చంద్రగుప్తునివలనఁ బడినబాధలు మనస్సున నాటుకొనినందున గ్రీకులు ఈ దేశముపై దాడివెడలుట కలలోనైనను దలంప

రయిరి. కాని గ్రీకుదొర కుమారిత గాన, చంద్రగుప్తుని మహిషికిఁ బరివారములుగ ననేక గ్రీకులు పాటలియందు నివసించుచుండిరి. సెల్యూకసు తనరాష్ట్రపు పశ్చిమ ప్రాంతమున అంతిగోనసు అను పగతుఁడొకఁడు లేచి యభిద్రవించుట విని క్రీ॥ పూ. 303 వ సంవత్సరమున బయలుదేరి వెడలెను. కాని తనకు రాయబారిగ మెగాస్తనీసు అనువానిని నియమించి పాటలిపురమున నుండుమని నిలిపెః ఈ మెగాస్తనీసు పరివారములును, ఆగ్రీకుసాని పరివారములును, మౌర్యసేనయందు దమరియున్న శిల్పులును, చేతిపనివాండ్రును, గలిసి యొక్క గ్రీకుపేటయే పాటలిపురమందున్న ట్లూహింపదగియున్న దని రిసు డేవిడ్సుని యభిప్రాయము. ఇందువలన మనదేశపు జనులకు శిల్పాదికృత్యములు తెలియవని భావముకాదు.* మనవారినేర్పును గ్రీకులును గ్రీకులనేర్పును మనజనులును నేర్చియుందు రందము.

అలెగ్జాండరునకు పూర్వము భరతవర్షమును గుఱించి పశ్చిమ ఖండవాసులకు నిర్ణీత జ్ఞానము లేక యక్షరక్షాదిలోకములవలె పుక్కిటి పురాణములకు విషయమై యుండెను. లోకమంతటిని జయింప నాసక్తుఁడై వచ్చిన అలెగ్జాండరు అక్కాలమందు గ్రీకులకు ఋషిస్థానముననున్న అరిస్టాటిలుని శిక్షయందుంపఁబడి విద్యావినీతుఁడై పెరిగినందున, దానాక్రమింపఁగల

* శిల్పములు మున్నగువాని యందు హిందువుల నేర్పరితనమునకు మెగాస్తనీసు కలనీనంత దృఢసాక్ష్య మిచ్చినాఁడు.



సమస్త దేశముల చరిత్రభూగోళాది వివరములఁ జక్కఁగ వ్రాయగలయట్టి గ్రీకువిద్వాంసులను తోడ్కొనివచ్చెను. అట్టిపరంపరాప్రాప్తబుద్ధితో మెగాస్తనీసు తానున్నంత కాలము విన్నవియు కన్నవియు నౌవిషయముల దినచర్యగ వ్రాసికొనిపోయెను.

ఆ దినచర్యలో పాటలిపుత్రనిర్మాణాది వివరములును, చంద్రగుప్తరాజ్యభారాది వివరములును, ఆకాలమున నతఁడు అవలోకింప గల్గిన మతవర్ణాశ్రమాచార వ్యవహారాది వివరములును, దక్షిణ హిందూస్థానము మున్నగు తాను గనని ప్రదేశములనుగుఱించి దావినిన యట్టివివరములును, వంచనలేక లిఖించియున్నాఁడు.

ఆతఁడు పాటలియందున్న రెండు వత్సరముల లోపలనె ఎంతయో వ్రాసి స్వదేశమునకు పుస్తక రూపముగ జ్ఞానమును కొనిపోయెను. అందలి వర్తమానములను గ్రీసు ఇటలీ దేశస్థులగు చరిత్రకారులు తమతమ చరిత్రములలో నెక్కించుకొని, సరితప్పులను తమచిత్తము వచ్చినట్లు విమర్శనములలో కలిపి వ్రాసియుంచిరి.

ఇట్టివగు ఈచరిత్రాంశములే మన హిందూదేశపు చరిత్రవృత్తాంతముల కాలనిర్ణయములను గూర్చుటకు ఆధారములాయెను. భారతీయుల నాగరికతయు, చరిత్రయు శ్రుతిస్మృతిపురాణేతిహాసముల మూలమున దొరకగలయట్టివి అత్యంత ప్రాచీనములును 5000, 10000, 20,000 మొదలుగాగల సంవ

త్సరముల భూతకాల వ్యాప్తములయినను, కాల నిర్ణయపట్టికా రూపమున పేర్చి వ్రాయనందునను, అద్భుత విచిత్రములను అతిశయోక్తులుగ కలిపిరచించినందునను చరిత్ర దృష్టికి నవి అవిశ్వసనీయములయి యున్నవి. కావున మనదేశపు గత 2500 సంవత్సరముల వృత్తాంతముల పట్టికకు ఈ మెగాస్తనీసుని దినచర్య సమస్త చరిత్రకారకులకును అనివార్యమైన యాధారముగ నున్నది. ఈతఁడు సాంద్రాకోట్టసు, అని పేర్కొనియుండు నామము మొదట అనర్థ నామముగనే యుండెనుగాని, చంద్రగుప్త పదము ఆగ్రీకుని నోట నట్లు మాఱినదని సరు విల్లియమ్ జోన్సుఅను నొకపాశ్చాత్య విద్వాంసుఁడు వ్యాఖ్యానమియ్యగనే, అందుండి చరిత్ర జ్ఞానాగ్ని రేగి ఇదమిత్థమ్మని తెలియని హిందూచరిత్రపు వార్తాంగారము లెల్ల రగులుకొనెను.

అటువంటి అగ్నిదాయకుఁడీ మెగాస్తనీసు; అటువంటి అగ్ని యీచంద్రగుప్త (సాంద్రాకోటసు) నామము. కావున, నవనందులను చితియందు దగ్ధమగునట్లు చేసిన యీ చంద్రగుప్తుని పేరు, ఈభరతక్షితి దిగంతములకు వ్యాపించిన ప్రథమ చక్రవర్తి యశోఽగ్నిగను, భారతచరిత్రాంధకారమును కొంత మట్టునకైన తొలఁగించుచు, పురాణాతిశయోక్తి గహనంబును భస్మీకరించునట్టి దావానలంబుగను ప్రజ్వరిల్లుచున్నది.

చంద్రగుప్తుఁడు పూర్వమే కోసలరాజ్యమును కబళీకరించి యుండె. అతఁడు స్వయముగ పంజాబును సింధు దేశమును



జయించెను. పంజాబులో సైన్యశిథిలతరాఁగనే చెదరువడియున్న సైన్యమంతటిని నాతఁడు తన మూలబలముగా చేసికొనెను. అనంతరము గుజరాతును జయించి అచ్చట నొకరాజ ప్రతినిధిని నియమించినట్లు రుద్రదాముని శిలాశాసనము నేఁటికిని తెల్పుచున్నది. దీనికి పూర్వమే ఇతఁడు అవంతి అనగా ఉజ్జయిని దేశమును ఆక్రమించి వశము పఱుచుకొని యుండెను.

ఇమ్మహిని రాజ్యారూఢుఁడైన చంద్రగుప్తునకు విశ్రాంతికి సమయము దొరకినదిగాదు. వృషలజనన కలంకమునకు విషయభూతుండు కావునను, ధననందునిచే పరిపీడింపఁబడిన ప్రజలపై యధిరూఢుండు కావునను, నందకులాభిమానుల కూటోపజాపములకు లక్ష్యుండు కావునను, ఉన్నతజాతి సంభూత సామంత రాజుల అవజ్ఞా విరోధంబులకును, అలెగ్జాండరు పాశ్చాత్య సేనానాయకుల యభియోగంబునకును ఆస్పదుండు కావునను, స్వయంభారతసర్వస్వ విజయకాంక్షి గావునను, జయింపఁబడినరాష్ట్రముల సమాధానపఱచి పరిపాలనా సంవిధానములయందు సంస్కారలక్షణ దృష్టినైజము గలవాఁడు గావునను ఒక్కయెడ కూర్చొనుటకుగాని నిలచుటకుగాని త్రుటికాలము పరుండుటకుగాని వ్యవధిలేక, సదా దుష్టనిగ్రహ శిష్టపరిపాలనమునందే జీవితకాలమంతయు గడపవలసినవాఁడయ్యెను. చారిత్రికవిషయముల కవిశ్వసనీయములగు పురాణేతిహాసాదివిషయముల నెఱుండనిచ్చిన భరతఖండ చక్ర

వర్తులయం దీతఁడే మొదటివాఁడుగఁ గన్పించుచున్నాఁడు. సేనలునడుపుట, శత్రువులనాక్రమించుట, నూతనదేశముల నార్జించుట, న్యాయముల దీర్చుట, నగరపంచాయతులు గ్రామపంచాయతులు నియమించుట, శిల్పములవృద్ధిపఱచుట, విదేశీయుల విచారించుట, జననమరణముల గణించుట, వ్యాపారముల విమర్శించుట, చేతిపనులపెంచుట, బాటలు వేయుట, వంతెనలు కట్టుట, ఓడలు నిర్మించుట, రాజపురుషులనియోగించుట, చారదృష్టిచూచుట, చౌర్యఘాతకాదులఖండించుట, పన్నులరాఁబట్టుట, కాలువలు చెరువులు బావులుత్రవ్వించుట, నీళ్లు విడుచుట, నేలకొలుచుట, పంటలెక్కించుట, ద్యూతమద్యాది దుఃఖముల విమర్శించుట, మున్నగు సర్వరాష్ట్రనిర్వాహ విషయములందును వేగన్నులచూపుతో జాగరూకుఁడై, ఆత్మరక్షణార్థము ఆహార, విహార, శయ్యా, ఆసన, భాజన, ఔషధ, బంధు, కళత్ర, మిత్ర, పుత్త్రాదులనెల్ల అనిమిషాలితనయనుఁడై పరిశోధించుచు ఇరువదినాలుగు వత్సరములు రాజ్యమేలెను.

## చంద్రగుప్త రాజ్యవిస్తారము.

క్రీ. పూ 322 మొదలుకొని 303 వఱకు అనఁగా చంద్రగుప్తుఁడు మొదట గ్రీకువారిని పంజాబుదేశమునుండి వెడలఁగొట్టినది మొదలు శెల్యూకస్ నికేతర్ నోడించి అతనితో సంధి చేసికొను కాలమువఱకును చంద్రగుప్తుఁడు ఉత్తరమున ఆఫ్గనిస్థానము బెలూచిస్థానముల వఱకును పూర్వమునను పశ్చిమమునను సముద్రమువఱకును గల రాజ్యమును జయించి యేకచ్ఛత్రాధిపత్యముతో నేలి హిందూదేశముయొక్క మొదటి చక్రవర్తియనిన బిరుదును సంపాదించుకొనెను.



మైసూరు గెజటీయరు లేఖకుఁడగు రైసుగారినుడువున, శికర్పూరుతాలూకా బందనిక్కె గ్రామపు శిలాశాసనము(12-వ శతాబ్దములో) కుంతలదేశమును మౌర్యుల మాగాణముగా వర్ణించుచున్నది. ఇయ్యది భీమావేదవతులకు నడుమ సహ్యాద్రులవఱకును శివమొగ్గ, చిత్రదుర్గము, బళ్లారి, ధార్వాడ, బీజాపురము, బొంబాయి, హైదరాబాదు సీమలభాగములను వ్యాపించిన దేశమనియు తెలిసెడిని. ఈదక్షిణదేశమును జయించినవాఁడు చంద్రగుప్తుఁడో, లేక ఇతనికొడుకగు బిందుసారుఁడో తెలియకున్నది. మైసూరు సీమలోనే శ్రవణ బెళగొళమునందలి శిలాశాసనము చెప్పున చంద్రగుప్తుఁడు అచ్చట జైనమతావలంబకుఁడై మరణమొందినట్లు గానంబడియెడి. కాని ఇది యింకను చింత్యము.

పదునాలు సంవత్సరములలో నింత విశాలరాజ్యమును నిర్మించి, దానిని మిక్కిలి జాగ్రత్తతోఁ గాపాడిన ఈ రాజును భూమండలములో శూరాగ్రేసరులని ఘనతవహించిన ఫిలిప్పు అలెగ్జాండరు, హ్యానిబలు, నెపోలియను మొదలయిన మహాసేనానాయకులలో నొక్కనిఁగా నెంచవలెనని యొకానొక పాశ్చాత్యుఁడు వ్రాసియున్నాఁడు.

అయిదవ ప్రకరణము.

# చంద్రగుప్త కాలనిర్ణయము.

హిందూదేశమునకుఁ బ్రథమ చక్రవర్తియైన చంద్రగుప్తుని కాలమెట్లు నిర్ణయింపఁబడినదని చదువరు లడుగవచ్చును. వారి జిజ్ఞాస తృప్తిపఱుచుటకై యిచ్చట నీవిషయము చర్చింప వలసియున్నది. ఇదియుఁగాక చంద్రగుప్తకాలనిర్ణయము హిందూదేశచరిత్రాధ్యయనముఁ జేయగోరు విద్యార్థులు గమనింపవలసిన ముఖ్యవిషయములలో నొక్కటి. హిందూదేశముయొక్క సాద్యంతచరిత్రము నేఁటివరకు హిందూమహాయుగము, మహమ్మదీయమహాయుగము, బ్రిటిషుప్రభుత్వము అని త్రిప్రకరణాత్మకముగా వర్ణింపఁబడుచున్నది. ఇందు రెండవ మూఁడవ ప్రకరణములలోని కాలనిర్ణయములు నిశ్చితములు. వానిని గుఱించి విశేష భిన్నాభిప్రాయము లుండవు. గజినీ మహమూదు సోమనాథ దేవాలయమును దోఁచుకొనిన సంవత్సరమును, అగ్బరు చక్రవర్తి రాజ్యమునకు వచ్చిన తేదియు, లార్డు కారన్ వాలిసు రాజప్రతినిధిగా హిందూదేశమునకు



వచ్చిన యేఁడును మనము నిశ్చయముగా నెఱుఁగుదుము. ఇందుకు కారణము ఆయాకాలముల చరిత్రకారులు కాలస్థల నిర్ణయముతో సమకాలిక చరిత్రవిషయములను వ్రాసియుంచుటయే. కాని హిందూమహాయుగమునందలి చరిత్రాంశముల కాలనిర్ణయ మిట్టిదికాదు. ఇందలి ప్రతివిషయిక కాలనిర్ణయము సంశయాస్పదమే. ప్రతివిషయమును గుఱించియు అభిప్రాయభేదములు తండోపతండములు కలవు. ఋగ్వేదమెప్పుడు రచింపఁబడె ననిన ప్రశ్నకు నొక్కఁడు ఐదువేలయేండ్ల క్రిందననియు మఱియొకఁడు ఏడువేలేండ్లక్రింద ననియు, నింకొకఁడు పదివేలేండ్ల క్రిందననియుఁ బ్రత్యుత్తరము లిచ్చెదరు. ఇదమిద్ధమని చెప్పుటకు దగిన సాధనములు లేవు. ఇట్లే ఉపనిషత్తులకాలమును గుఱించియు మహాభాష్య రచనాకాలమును గుఱించియు శంకరాచార్యుని యవతార సమయమును గుఱించియు వాద ప్రతివాదములునుగలవు. పైకారణములచే హిందూమహాయుగము నిశ్చితకాలజ్ఞానాభావ మను అంధకారముచే నిండియున్నది. ఇట్టి మహాంధకార మధ్యమున చంద్రగుప్త కాలనిర్ణయమను నొకచిన్న దీపము గ్రీకుచరిత్రకారుల సాయముచే వెలుగుచున్నందున దానిని నాధారముఁ జేసికొని యందుకు ముందు వెనుక జరిగిన చరిత్రాంశముల కాలము పండితులు నిశ్చయించుచున్నారు.

కావున కాలనిర్ణయము లన్నింటికిని ఆధారభూతమైన చంద్రగుప్త కాలనిర్ణయమెట్లు చేయఁబడెనో, అదియెంతవఱకు నమ్మఁదగినదో మనమాలోచింప వలెను.

అలెగ్జాండరు హిందూదేశమునకు వచ్చినప్పు డతనితో నేతెంచిన పండితులును, చంద్రగుప్తుని దివాణమునకు రాయబారిగ వచ్చిన మెగస్తనిస్ అనువాఁడును వాని ననుసరించి మఱియు ననేకులగు గ్రీకుగ్రంథకారులును సాంద్రకోటస్ లేక శాంద్రగోప్తస్ అనువాఁడు అలెగ్జాండరును మొదట వచ్చి చూచినట్టును అలెగ్జాండరు చనిపోయిన కొలఁదికాలములోనే అతఁడు పంజాబు దేశమునుండి గ్రీకుసైనికులను వెడలఁగొట్టి స్వతంత్రుఁడైనట్టును అతని రాజధాని గంగయొడ్డున పాలిబోత్రా నామముతో మిగుల వైభవము నొందిన పట్టణమైనట్టును అతనికి పూర్వమున రాజుగనుండినది నంద్రస్ అనువాఁడైనట్టును వానియందు జనులకుద్వేషము గలిగినందున సాంద్రకోటస్ వానిని జంపి రాజైనట్టును వ్రాసియున్నారు. మొట్టమొదట సాంద్రకోటస్ అననెవ్వఁడో తెలియక పోయెనుగాని పైవర్ణనలన్నియు చక్కఁగ విమర్శించి పాశ్చాత్య విద్వాంసులు సాంద్రకోటస్ అనగా చంద్రగుప్తుఁడనియు పాలిహ్బోత్రయనగా పాటలిపుత్రమనియు నంద్రస్ అనగా నందుఁడనియు నిశ్చయించియున్నారు. పాలిహ్బోత్రకును గంగానదికిని గల యంతరము మెగస్తనిస్ వ్రాసియున్నాఁడు. అదియును ప్రస్తుతము పాట్నా



పట్టణమునకును గంగకునుగల యంతరముతో సరిపోవుచున్నది. ఇంతియగాక పాలిహ్బోత్ర గంగాశోణల సంగమము వలన గలిగిన యంతర్వేదిలో నున్నదని అతఁడు వ్రాసిన విషయము ప్రస్తుతము పాట్నా, అనఁగాపూర్వపు పాటలీపురమునకే, అన్వయించుచున్నది. కావున పాలిహ్బోత్రయనగా పాటలిపురమనియు, సాంద్రకోటస్ అనఁగా చంద్రగుప్తుఁడనియు ఈతఁడే సెల్యూకస్ నికేతర్ నోడించెననియు, ఇతనిరాజధాని పాటలిపురమనియు మనము గట్టిగఁజెప్పవచ్చును.

కాలనిర్ణయమునకు. రెండవసాధనము.

ఇట్లు మనమొకనిశ్చయమైన సాధనమును బట్టి చంద్రగుప్తుని కాలమును కనుగొంటిమి. ఇదియే నిజమైనదని నొక్కి వక్కాణించుటకు మఱియొకస్వతంత్ర సాధనము కలదు. మొదటి సాధనమునకును దీనికిని సంబంధము లేక దీన వేఱువిధముగ లెక్కలువేసి పైకాలము నే సాధించుటవలన దీనిని స్వతంత్ర సాధనమంటిమి.

చంద్రగుప్తుని కుమారుఁడు బిందుసారుఁడు. బిందుసారుని కుమారుఁడు అశోకవర్ధనుఁడు. ఇతఁడే ధర్మోపదేశార్థమై తన రాజ్యము నందంతటను శిలాశాసనములను చెక్కించి వేయించి మిక్కిలి ఖ్యాతివడసిన అశోకుఁడు. ఇతని శాసనములలో అశోకుఁడనెడు నామము లేదు. ప్రియదర్శియన్న సంస్కృత పదము

నకు ప్రాకృతరూపమైన పియదశి నామముకలదు. కాని అశోకునికే ప్రియదర్శియనిన నామాంతరము గలదని మనము పెక్కు-సాధనములవలన నిశ్చయింపవచ్చును.* ఈ విషయము చరిత్రకారులందఱును నిస్సంశయముగా నొప్పుకొనినదే యయినందున ఇచ్చట వివరణ మనవసరము.

అశోకునిచేఁ బ్రకటింపఁబడిన పదమూఁడవ శిలాశాసనమునందు నీప్రకారముగా వ్రాయఁబడియున్నది.

పదమూఁడవ శిలాశాసనము.

సత్యజయము.

"పియదశి ముఖ్యతమముగ నెన్నెడి విజయము ధర్మసందేశము వలననగువిజయమే. ఇట్టివిజయము పియదశి దనసామ్రాజ్యమునందేగాక దనకిరుగుపొరుగు సీమలయందలి ప్రజలందఱిమీఁదను గూడ నొందియున్నాఁడు. ఆరువందల యోజనముల దూరముననుండు అంతియోకనామధేయుఁడగు యోనరాజు నివసించు ప్రదేశమునకును ఈ అంతియోకున కావల 'తురమాయె' 'అంతికిని' 'మక' 'అలికసుందర' అనునామముల

*ఇందును గుఱించి యధికము తెలిసికొనఁగోరువారు The Journal of the Royal Asiatic Society యొక్క 1901 వ సంవత్సరపు సంపుటములోని Identity of Piyed.si with Asoka Maurya అన్నవ్యాసము చూడ నగును.



తోఁబరఁగు రాజచతుష్టయము నివసించు ప్రదేశములకును (ఈవిజయము వ్యాపించియున్నది." *

ఈశాసనమునందు నైదుగురు విదేశపురాజుల పేళ్లుదాహరింపఁబడినవి. వీరిలో అంతియోకుఁడనువాఁడు ఆంటియోకస్ థియాస్ అను(Antiochus Theos)సిరియాదేశపు రాజు. ఇతఁడు క్రీ. పూ. 246 వఱకు రాజ్యముచేసెను. తురమాయె అనువాఁడు టాలిమీ ఫిలాడల్ఫస్( Ptolemy Philadelphus ) అనునామముతో ఈజిప్తుదేశముపై రాజ్యముఁజేసి క్రీ. పూ. 246 లో మృతుఁడయ్యెను. ఈతనికూఁతునే అంటియోకుఁడు వివాహమాడెను. అంతికిని అనువాఁడు ఆంటిగోనస్ గొనిటస్ అను నామముతో మకడోనియా రాజ్యమును సంపా

* Eshe cha mu (kha) mute Vijayedevanam Priyasayo dhramavijayo; so cha puna ladho devanam priyasa iha cha sa (dre) shu cha anteshu [8] ashashu pi Yojanasa(te) shu yatra Amtiyokonama Yona raja param cha teva Amtiyokena chature- [4] rajani Turamaye nama Amtikini nama Maka nama Alikasundaro nama. (ఏ షేచా ముఖముతే విజయే దేవానాం ప్రియసయో ధ్రమవిజయో సో చ పున లధో దేవానాం ప్రియస ఇహ చ సద్రేషు చ అంతేషు [8] అషషుపి యోజనా శ[తే] షు యత్ర అంతియోకో నామ యోనరాజా పరంచ తేన అంతియోకేనచతురే [4] రాజాని తురమాయే నామ అంతికిని నామ మక నామ అలిక సుందరో నామ.)

దించి 289 వఱకు రాజ్యము చేసెను. అలికసుందరుఁడను వాఁడు పైరసు అనువాని కుమారుఁడు. అలెగ్జాండరు నాఁబడు ఎపిరస్ దేశపు ప్రభువు. క్రీ. పూ. రమారమి 260 వ సంవత్సరము వఱకు ప్రభుత్వముఁ జేసెను. మాగాస్ అనువాఁడు సైరిన్ దేశపురాజు టాలిమీకి సాపత్న్యసోదరుఁడు. 258 వ సంవత్సరమున పరలోకగతుఁ డయ్యెను.

పైని ఉదాహరింపఁబడిన పేళ్లుగల రాజు లచ్చటచ్చట భిన్నకాలములం దుండినను పై ఐదుపేళ్లుగల రాజు లేక కాలమునందు భిన్నదేశముల నేలుచుండుట మేముదహరించిన సిరియా, ఈజిప్తు, మకడోసియా, ఎపిరస్, సైరిస్ రాజుల విషయమయ్యే సిద్ధించుచున్నది. కనుక కాలనిర్ణయ విషయములో పొరబాటెంతమాత్ర ముండుటకు వీలులేదు. ఇదియునుంగాక ఈ మెగాస్ తప్ప యీనామధేయము గల మఱియొక రాజు లేనే లేఁడు.

మెగాస్ రాజు 258 వ సంవత్సరమున మృతుఁడయ్యెను. అలెగ్జాండరు గూడ ఆసంవత్సరముననో లేక యంతకు గొంచెము కాలము పూర్వముననో పరలోక గతుఁడయ్యెను. కావున పైని పేర్కొనఁబడిన అశోకశాసనము మెగాస్ బ్రతికియుండగనో లేక మృతిఁజెందిన సమాచారము తెలియక పూర్వమో చెక్కింపఁబడి యుండును. సైరస్ నుండి మెగాస్ మృతిఁజెందిన



వర్తమానము హిందూదేశమునకు వచ్చుటకు నొకసంవత్సరముకంటె నెక్కుడు కాలము పట్టదనుట నిశ్చయము. కావున 257 వ సంవత్సరముకంటెఁ దరువాతికాలమున నీ శాసనము చెక్కింపఁబడలేదని మనము నిశ్చయింపవచ్చును. ఈశాసనము అశోకుని పట్టాభిషేకమయిన తరువాత పదమూఁడవ యేట చెక్కింపఁబడియెను. అనఁగాఁబట్టాభిషేకమై పండ్రెండు సంవత్సరములు గతించెనని యర్థము. 257 తో 12 కలుపఁగా 269 వ సంఖ్య సిద్ధించుచున్నది. కావున క్రీ. పూ. 269 వ సంవత్సరమున అశోక మహారాజు పట్టాభిషిక్తుఁడయ్యెనని తేలుచున్నది. సింహళద్వీప చరిత్రములఁజూడ, కొన్నిగృహ కలహములచే నశోకుఁడు రాజ్యమునకు వచ్చిన తరువాత మూఁడు సంవత్సరములకు నతనిపట్టాభిషేకము జరిగెనని తెలియుచున్నది. కనుక నాతనికి 269 లోఁ బట్టాభిషేకము జరిగినను ఆతఁడంతకు మూఁడుసంవత్సరములముందే అనఁగా క్రీ. పూ. 272 లో రాజ్యమునకు వచ్చినట్లు గ్రహింపవచ్చును.

అశోకుని తండ్రి బిందుసారుఁడు. ఆతఁడిరువది యైదు సంవత్సరములు రాజ్యముఁ జేసెనని పురాణములు చెప్పుచున్నవి. మన చరిత్రనాయకుఁడగు చంద్రగుప్తుఁ డీ బిందుసారునితండ్రి. ఈతఁడిరువది నాలుగు సంవత్సరములు నేలయేలెనని పురాణములును సింహళగ్రంథములును నుడువుచున్నవి. అనఁగా చంద్రగుప్తుఁడును బిందుసారుఁడును కలిసి 49 సంవత్స

రములు రాజ్యమేలిరి. ఈ సంఖ్య 49 యిదివఱకు మనచే సాధింపబడిన 272 లో ననఁగా అశోకుఁడు రాజ్యమునకువచ్చిన సంఖ్యలోఁ గలుపఁగా 321 వచ్చుచున్నది. ఇదియే చంద్రగుప్తుఁడు రాజ్యమునకు వచ్చిన సంవత్సరపు సంఖ్య.

ఈలాగు మనము రెండు భిన్నమార్గముల బయలుదేరి వేఱువేఱు నడకల నడచినను ఘట్టకుటీప్రభాత న్యాయమున నొక్కచోటికే వచ్చి చేరుచున్నాము. సాంద్రకోటస్ అనఁగా చంద్రగుప్తుఁడని యెంచి, అలెగ్జాండరుయొక్క దండయాత్ర తిథులును గ్రీకుచరిత్రకారులును నాధారముగా గైకొని వేసిన లెక్కవలనను అశోకవర్ధనుని శాసనము నాధారము చేసికొని పురాణాదులలో వర్ణింపఁబడిన మౌర్యరాజుల పాలనాకాలము లెక్కవేసినను క్రీ. పూ. 321 లోనో లేక 322 లోనో, అతఁడు రాజ్యమునకు వచ్చినట్లు స్పష్టమగుచున్నది.

ఇదియుఁగాక వేరొక విశేషము గలదు. అశోకుఁడు క్రీ. పూ. 272 మొదలు కొని 231 వఱకు రాజ్యమేలెను. అతనిచే శాసనములోఁ బేర్కొనఁబడిన ఆంటియోకుఁ డతనికి సమకాలికుఁడై 261 మొదలు 246 వఱకు రాజ్యమేలెను. చంద్రగుప్తుఁడు అశోకునితాత. శెల్యూకస్ నెకటార్ ఆంటియోకుని తాత. మనుమలు సమకాలికులైనప్పుడు వారితాతలు గూడ సమకాలికు లగుట సహజమని సాధారణముగ గ్రహింప



వచ్చును. కావున సెల్యూకస్‌నికేతర్ చంద్రగుప్త మౌర్యునకు సమకాలికుఁడనుట స్పష్టము.

పైని వ్రాయఁబడిన హేతువులచే మనచరిత్ర నాయకుండగు చంద్రగుప్త మౌర్యుఁడు అలెగ్జాండరు తోడను సెల్యూకస్ నికేతర్ తోడను సమకాలీనుఁడు అని తేలినది. గ్రీకువారగు వీరిద్దఱి చరిత్రలును సమకాలికులైన గ్రంథకారులచే వ్రాయఁబడియున్నందున వారికాలము నిశ్చితము. వారి యుద్ధములనుగుఱించియు దాడులనుగుఱించియు ప్రవాసములనుగుఱించియు చేయఁబడిన కాలనిర్ణయములలో ఒకటిరెండు నెలల విభేదము వచ్చినను రావచ్చును. కాని అంతకంటె నెక్కుడు ఎచ్చుతక్కువ లుండవు.

అలెగ్జాండరు హిందూదేశమునకు వచ్చినప్పుడు చంద్రగుప్తుఁడు ఆతనిని సందర్శించి నట్లున్నది గావున ఈప్రసంగము క్రీ. పూ. 325 లోనో 326 లోనో జరిగియుండవలెను. అలెగ్జాండరు క్రీ. పూ 325 వ సంవత్సరమందు మేనెలలోనో జూన్ నెలలోనో కీర్తిశేషుఁడయ్యెను. అతని మరణవార్త తెలిసిన కొలఁది కాలముననే చంద్రగుప్తుఁడు స్వతంత్రుఁడయ్యెనని వ్రాయఁబడియున్నది. అలెగ్జాండరుని మరణవార్త హిందూదేశజనులకుఁ దెలియుటకు రెండునెలలు పట్టినదనుకొన్నను ఆగస్టునెలలోనో లేక సెప్టెంబరు నెలలోనో యీవార్త తెలిసియుండును.

ఆతఁడు వెంటనే సైన్యములను కూర్చుకొని పంజాబుదేశము నుండి గ్రీకువారిని వెడలఁగొట్టి నందున నీవార్త క్రీ. పూ. 322 లో జరిగెనని చెప్పవచ్చును. సెల్యూకస్ తన ఏష్యా వైభవమునకు బునాది నిర్మించుకొనుచుండగా చంద్రగుప్తుఁడు హిందూదేశమునకు జక్రవర్తియయ్యెనని జస్టిన్ వ్రాసియున్నాఁడు* సెల్యూకస్ క్రీ. పూ 321 లో బేబిలోన్ పట్టణమునకు క్షేత్రపుఁడుగా నియమింపఁబడెను. ఈక్షేత్రపాధికారమే యతఁడు తరువాత రాజగుటకు మూలాధారము. అప్పటికి చంద్రగుప్తుఁడు మగధాధీశ్వరుఁడై యుండవలెను. కావున నందసంహారము, పర్వతేశ్వర వధ, అమాత్యరాక్షసుని వశపఱచుకొనుట మొదలైన ముద్రారాక్షస వర్ణిత కథాంశము లన్నియు 321 లోనో తరువాత ఒకటిరెండు సంవత్సరములలోనో జరిగియుండవలెను. సెల్యూకసు 305 లోనో 304 లోనో చంద్రగుప్తుని మీఁదికి దండెత్తివచ్చి 303 లోఁ బూర్తిగ పరాభూతుఁడై మగధేశ్వరునితో సంధిఁ జేసికొని వెళ్లిపోయెను. చంద్రగుప్తుఁడిఱువదినాలుగు సంవత్సరములవఱకు రాజ్యముఁ జేసెనని వాయుభాగవతాది పురాణములలోను సింహళదేశపు చరిత్ర లోను వ్రాసియుండుటఁ బట్టి అతఁడు 298 లోనో లేక 297 లోనో కీర్తిశేషుఁడయ్యెనని మనముచెప్పవచ్చును. చంద్రగుప్తుఁ డలెగ్జాండరును చూచువఱకు నిఱువదియైదేండ్ల వయస్సు గలవాఁడని యెంచితి మేని యాతఁడు 350 వ సంవత్సరప్రాంతమున జన్మించి యుండవలెను. మనమిట్లు తేల్చుకొనిన కాల నిర్ణయమంతయు నీక్రింది పట్టికలోఁ గనుపఱుచఁ బడినది.

| క్రీ. పూ. | |
|---|---|
| 350 | చంద్రగుప్తజననము. |
| 326, 325 | అలెగ్జాండరును చూచుట. |
| 323 అక్టోబరు, 322 | చంద్రగుప్తుఁడు పంజాబునుండి గ్రీకువారిని వెడలఁ గొట్టుట. |
| 322, 321 | మగధరాజ్యము నాక్రమించుకొనుట. |
| 305, 304 | సెల్యూకసు హిందూదేశము మీఁదికి దండెత్తివచ్చుట. |
| 303 | సెల్యూకసు పరాభవము, చంద్రగుప్తునితో సంధిచేసికొనుట. |
| 298, 297 | చంద్రగుప్తుని మరణము. |

* "Sandrakottus having thus won the throne was reigning over India when Seleucus was laying the foundations of his future greatness". (Justin

ఆఱవ ప్రకరణము.

---

# చంద్రగుప్తుని రాజధాని.

---

భరతఖండంబునంతను ఏకఛత్రాధిపత్యము క్రిందికిఁ దెచ్చిన మనకథానాయకుఁడు పాటలిపుత్త్రిమను నగరమునందు రాజ్యము చేయుచుండెను. పుష్పపురము, కుసుమ పురము అను నామాంతరములు గల యీపట్టణరాజము చంద్రగుప్త చక్రవర్తి ప్రభుత్వకాలమునందు మహోన్నతావస్థను చెంది, ఆతని మనుమఁడగు అశోకుని రాజ్యకాలమందు నత్యుచ్చ వైభవ శిఖరముఁజేరి, భూలోకమునందు నాకాలమున నున్న యశేష పట్టణములలో నతిశ్రేష్ఠ మైనదియు, నద్వితీయమైనదియు నని బొగడ్తఁగని యుండెను. ఇదియుఁగాక, యనేక కవులకును, పండితులకును, శిల్పులకును, అన్యదేశ వర్తకులకును, ఆశ్రయ స్థానమును, వర్ణనీయవిషయమును అయి రాఘవుల అయోధ్యకును, కౌరవుల హస్తినాపురమునకును, మొగలుల ఢిల్లీకిని, ఆంగ్లేయుల కలకత్తాకును సరిపోల్పఁదగిన యీపుష్పపురి రమారమి వేయి సంవత్సరముల వఱకును మగధరాజధానియై విలసిల్లెను! ఇట్టి పురశ్రేష్ఠముయొక్క యుత్పత్తియు, చంద్రగుప్తుని



కాలమున నద్దాని వైభవమును, సంక్షిప్తముగఁ దరువాతి చరిత్రయు, నీప్రకరణమునందు వర్ణింపఁబడుట యత్యంతావశ్యకము.

## నామ నిర్దేశము.

సాధారణముగా నిటీవలి యింగ్లీషు చరిత్ర గ్రంథములలో 'పాటలిపుత్ర' నామమే యెక్కుడుగా వ్యవహరింపఁబడు చున్నను, సంస్కృతకవులు మాత్రము పాటలిపుర, కుసుమపుర, పుష్పపుర నామములనే వాడి యున్నారు.* త్రికాండశేషము నందు మాత్రము 'పాటలీపుత్ర' మను పాఠాంతరము కలదు. బృహత్కథయందుఁ గూడ నీపేరు వచ్చినట్లున్నది. గ్రీకుల భాషలో దీనిని పాలిబోతు(Palibothu)అని వాడియున్నారు. ఈ పట్టణస్థానమునందున్న పట్టణమునకు నిపుడు 'పాట్నా' యన్న పేరు కలదు.

## ఇప్పుడీ పట్టణమెచ్చట నున్నది?

హిందూదేశపటమును ఎదుట వేసికొని చూచిన యెడల, ఈశాన్యదిశయందు ఇప్పుడు ఈ దేశపు ముఖ్యరాజధాని యగు కలకత్తాపురి కానవచ్చును. ఇప్పురి గంగానదిపాయలలో పెద్దది యగు హూగ్లినదీ తీరమున గంగాసాగరమునకు నలువది మైళ్ళ దూరమున అలరారుచున్నది. ఇచ్చటనుండి యోడ మార్గ

---

* రఘువంశము, 6. వ సర్గము, 24 వ శ్లోకము. ఆర్యభటీయము, ద్వితీయ గణితపాదము.

మునో లేక పొగబండి మార్గమునో అనుసరించితిమేని రమారమి 333 మైళ్ళ దూరమున పాట్నాయను పట్టణము గంగాతీరమున కలకత్తాకు వాయవ్యమున నుండఁజూతుము. ఇయ్యది దిగువ బంగాళపు(Lower Bengal) పట్టణములలో కలకత్తాకు రెండవదిగానున్నది. ఇంతటి విస్తీర్ణమును జనసంఖ్యయు నేఁటికిని గల యీ పాట్నాపురి మహమ్మదీయ పరిపాలనమున బేహారు జిల్లాకు ముఖ్యస్థానముగనుండె. కాని ఈ నామముచే నొప్పు పురము 650 వత్సరములకు మున్నుండలేదు. దీనిస్థానమున గొంత కాలము బీడును, అంతకుఁ బూర్వమున, ననఁగా ప్రాచీన కాలమునందు మఱియొక గొప్పపురియు నుండెడివి. ఆపురియే పాటలిపురము.

రాజకీయవిషయమునందు గంగానదియొక్క విశేషము నరయుఁడు. గంగాశాఖ యగు హూగ్లితీరమున హిందూదేశపు ప్రస్తుతపు రాజధాని కలకత్తా యున్నది. గంగ కుపనదియగు యమునాతీరమున, మహమ్మదీయ రాజధానులగు దిల్లీ, యాగ్రాలు కలవు. దిల్లీకి మూఁడు మైళ్లదూరమున పాండవ రాజధాని ఇంద్రప్రస్థ ముండె. ఇంద్రప్రస్థమునకు అఱువదిమైళ్లు వాయవ్యమున కౌరవపారిక్షితుల రాజధాని హస్తినాపురముండె. గంగ కుత్తరోపనదియగు సరయు (గాగ్రా) దక్షిణతీరమున అయోధ్యాపురి రఘుకులరాజుల రాజధానిగనుండె. గంగ, గాగ్రా, రాప్తి, గండకి, శోణానదులుకలియు ప్రాంతమున పాటలి



పుత్రము చంద్రగుప్త రాజధానిగనుండె. కావున రాఘవ, కౌరవ, పాండవ, పారిక్షిత, నంద, చంద్రగుప్త, గుప్త, ఆంధ్ర, మహమ్మదీయ, ఆంగ్ల రాజధానులు, గంగనో, గంగా శాఖోపశాఖలనో ఆశ్రయించి యున్నవి. ఇందు పాటలిపుత్రము నిర్మింపఁబడిన స్థలము కంఠసరములను గూర్చిన పతకమువలె అనేకనదుల సంగమమునకు సమీపమున నుండుటంబట్టి అలంకారముగను, బలప్రదముగను, వ్యాపారానుకూలతంబట్టి ధనప్రదముగను నుండెను. కనుకనే ఇది వేయునెక్కుడేండ్ల కాలము హిందూస్థానపు బలిష్ఠరాజధానిగ విరాజిల్లు చుండెను.

### నామోత్పత్తి.

పాటలిపుత్ర మన్న పేరు గల్గుట కనేకు లనేక హేతువులు చెప్పుచున్నారు. పాటలియన నొక పుష్పవిశేషము. దీనిని తెలుఁగులో కలిగొట్టు పువ్వందురు. ఈ పువ్వును బోలి ఆ పురియొక్క యాకారముండెననియు, అందుచే నాపేరు వచ్చెననియు కొందఱి యభిప్రాయము. ఆ పట్టణమందును, సమంతప్రాంతమందును పాటలి వృక్షములును, పుష్పములును మెండుగ నున్నందున ఈ నామము కల్గెనని కొందఱందురు. శ్రీరామలక్ష్మణులు సరయూగంగా సంగమమునకుపైని సరయునుదాఁటి దక్షిణ తీరము చేరఁగనే వారికి పాటలాది వృక్షసంకీర్ణమైన వనము కానవచ్చినట్లు శ్రీమద్రామాయణమునందు వర్ణింపఁబడి

నది.* కావున మిక్కిలి ప్రాచీనకాలమునుండి మగధదేశము యొక్క యీ భాగము పాటలిపుష్పమునకై ప్రసిద్ధి వహించినట్లు కానవచ్చెడిని.

ఇప్పుడు పాట్నా నగరమునందు చిన్న పట్నదేవి, పెద్ద పట్నదేవి యను దేవాలయములు రెండు గలవు. వానిలో నర్చకులుగానుండువా రిట్లు చెప్పెదరు. సుదర్శనుఁడను రాజునకు పాటలి యను కూఁతురు గలదు. ఆమెచే నీపట్టణము కట్టింపఁబడియెను. ఈమె కాతఁడు బహుమతిగ నీపట్న మొసంగగ, దీనిని పుత్రవాత్సల్యముతో తల్లింబోలె సంరక్షించినందున పాటలిపుత్రమని పేరుగల్గెనఁట.

పుత్రకుఁడు అను రాజకుమారుఁడు మంత్రదండ మహిమచే నిర్మించెననియు నతని భార్యపేరు పాటలి కావున దీనికి పాటలిపుత్రమని పేరుఁ బెట్టెననియు కథాసరిత్సాగరము నందును హ్యూయాన్‌త్సాంగునియాత్రాచరిత్రమునందును వ్రాయఁ బడి యున్నది. డియోడోరసు అను గ్రీకుచరిత్ర కారుఁడు హెరక్లీస్ (Herakles) అనఁగా బలరామునిచే నిది ప్రతిష్ఠింప బడియెనని తాను విని నట్లుగా దెల్పియున్నాఁడు. వాయుపురాణమును సూత్తపిటకమును శిశునాగవంశస్థుఁడు ఉదేయుఁడు దీనిని కట్టించినట్లు తెల్పుచున్నవి.

* వాల్మీకి రామాయణము, బాలకాండము, 34 వ సర్గము.



మేజరు విల్ఫోర్డు పాటలిపుత్రమును పద్మావతియనియు మహాబలిపురమనియు పేళ్లుగలవనియు, ఈ పేళ్లు గల్గుటకు కారణము, మహాబలియనియు మహాపద్మఁడనియు దానిని బ్రతిష్ఠించిన రాజు పేళ్ళగుట యనియు వివరించుచున్నాఁడు. అట్టి నందుని పట్టణము కావున బలిపుత్ర యనియు పాలిబోత్ర యనియుఁ బేళ్ళనొంది గ్రీకులచెవుల కందెననియు నుడువుచున్నాఁడు. ఇంకొక వ్యుత్పత్తి కలదు. కోసీ గంగాసంగమమున రాజమహాలునకు సమీపమున పాలిబోత్ర యుండెనఁట; ఇప్పటికిని మత్స్యదేశమున పాలి జాతివారు మెండుగ నివసించెదరు. కావున పాలిబోత్రయని పేరువచ్చెననియుఁ జెప్పఁబడుచున్నది. సూర్యవంశపు రాజగు మనువుండను వానికి 18 వ తరమువాఁడు సుదర్శన రాజనియు, అతని కూఁతురు పాటలియనియు, నీమె మూలమున పాటలిపుత్రనామంబనియు నింకొక న్యాఖ్యానంబు గాన వచ్చుచున్నది.

మఱియొక చిత్రకథ.

దక్షిణదేశమునందు నొకబ్రాహ్మణుఁడు కలఁడు. వానికి ముగ్గురు కొమాళ్లుండిరి. ఆబ్రాహ్మణుఁడు చిన్నవారైన తన పుత్రులను ఇంటియొద్దనే యుంచి హిమాలయ మందలి గంగాద్వారమునకు యాత్ర వెడలి యచ్చటనే కాలధర్మము నొందెను. ఎంతకాలమునకును తండ్రి తిరిగిరానందున అతని ముగ్గురుపుత్రులును విద్యాభ్యాసము నిమిత్తమై బయలుదేరి

కుమారస్వామి క్షేత్రము నొద్దనున్న చించణీ యను గ్రామమందు నివసించియున్న భోజకుఁడను విద్వాంసుఁడైన బ్రాహ్మణుని ఆశ్రయించిరి. ఆబ్రాహ్మణుఁడు వీరి ముగ్గురికిని తగిన విద్యలఁగఱపి తనకు ముగ్గురు కూఁతులుండ వీరిముగ్గురికి నిచ్చి వివాహము చేసి వారిని తన ఇంటనే యుంచుకొనెను.

వారు పెద్దకాల మచ్చటనే యుండి యొకప్పుడు కఱవు సంభవింపఁగాఁ దమ భార్యలను అచ్చటనే యుంచి ధనార్జనకై తాము దేశాంతరమునకు వెడలిపోయిరి. వారు వెడలునప్పుడు నడిపివాని భార్య గర్భవతియై యుండెను. కాని యీసమాచార మాబ్రాహ్మణునకుఁ దెలియదు. ఆపెకు నొకకుమారుఁడు కలిగెను. వానికిఁ బుత్రకుఁడని పేరు పెట్టిరి. కాని బ్రాహ్మణులు తిరిగి రానందునను, కఱవధికమైనందునను పుత్రకునిఁ దీసికొని యాతనితల్లి మగధదేశమునకుఁ బోవలసినదాయెను. అచ్చట ఈమె దనకుమారునితోఁగూడ యజ్ఞదత్తుఁడను బ్రాహ్మణు నాశ్రయించి యుండెను.

పుత్రకుఁడు పెద్దవాఁడై విద్యాబుద్ధులు నేర్చుకొని మిక్కిలి ధనమును ఆర్జించెను. తన తండ్రియు పినతండ్రి పెదతండ్రులును దేశాంతరము వెళ్లి రాలేదన్న సమాచారము విని వారిని కనుఁగొను నిమిత్తమై యొక యన్న సత్రమును స్థాపించి తాను సత్రాధికారిగనుండి వచ్చిపోవువారి గోత్రనామములఁ దెలిసికొనుచుండెను. ఆ ముువ్వురు బ్రాహ్మణులును ఒక్కదిన



మా సత్రమునకు రాఁ దటస్థించెను. వారా పుత్రకుని సమాచారమంతయుఁ దెలిసికొని వాఁడు వ్యభిచార జాతుఁడుగాఁ దలఁచి వానిని జంపుటకుఁ గొందఱు పురుషులను నియమించిరి. పుత్రకుఁడు వారికి లంచమిచ్చి వారిచేతినుండి తప్పించుకొని వింధ్యప్రాంతమునకుఁ బోయెను. ఈతఁ డచ్చట సంచరించుచుండ నిద్దరన్నదమ్ములు రాక్షస కుమారులు తమ పిత్రార్జితమైన మూఁడు వస్తువులను గూర్చి తగవులాడుచుండఁ జూచెను. వారు తగవులాడుచున్న వస్తువు లేవన ౧ భోజనపాత్రము, ౨ దండము, 3 పాదరక్షలు. ఈ మూఁటియందును మూఁడు విశేషములు కలవు. భోజనపాత్రము కోరిన భోజనపదార్థముల నిచ్చును. దండము వలన కోరిన ద్రవ్యము లభించును. పాదరక్షలను తొడిగినయెడల ఆకాశపథమున స్వేచ్ఛావిహారమును చేయవచ్చును! ఇట్టి వస్తువులకై పోరాడువారు పుత్రకుని మధ్యవర్తిగ నేర్పఱుచుకొనిరి. రాక్షస పుత్రులు పరుగెత్త వలసినదనియు, ఎవ్వఁడు నిర్ణీత స్థలము చేరునో వానికి ఈ మూఁడు ద్రవ్యము లీయఁబడుననియుఁ బుత్రకుఁడు నిర్ణయించెను. వారందుకు నంగీకరించి పరువెత్త సాగిరి. అటువారిని పరువెత్తనిచ్చి యిటు పుత్రకుఁడా పాదరక్షలను ధరించి మిగిలిన రెండుద్రవ్యములను తీసికొని యెగిరి యాకాశమార్గమున ఆకార్షికా పురికిఁ బోయెను. అచ్చటిరాజు మహేంద్రవర్మ. ఆతనికి పాటలియను కూఁతురుకలదు. ఆమె యుక్తవయస్క-

రాలై వివాహమునకు సిద్ధముగనున్న దని విని పుత్రకుఁ డొక
నాఁడు ఆకాశమార్గమున నామె మందిరముఁ జేరెను. ఆమెయు
నతని యమానుషశక్తి కచ్చెరువంది ఆతనిని వరించెను. కాని
యీ సమాచారము రాజునకుఁ దెలిసిన నాతఁడు పుత్రకుని
వధించు నని యెంచి వారిరువురును, అచ్చట నుండి ఆకాశ
మార్గమున వెడలి పోయి యొక పట్టణమును నిర్మించి, తమ
యిద్దఱిపేళ్లను కలిపి దానికి 'పాటలీపుత్రమని' పేరుపెట్టిరఁట.
ఈకథ బృహత్కథయను గ్రంథమునందున్నది.

ఇట్లీగ్రామముయొక్క యుత్పత్తిని గుఱించి పెక్కు
గాథలు గలవు. ఇఁక వీనిని విడిచి చరిత్రభాగమునకు వత్తము.

### పాటలి దుర్గము.

క్రీ. పూ. 490 వ ప్రాంతమున అజాతశత్రుఁడను వాఁడు
మగధ రాజయ్యెను. ఇంతకుఁ బూర్వము పాటలియనునది
గంగకు దక్షిణ తీరమున నుండిన చిన్నపల్లె. ఆనదికి నుత్తర
మున లిఛవి వంశజులగు రాజుల ప్రబలమైన రాజ్యముండెను.
ఆరాజులు తన రాజ్యమునకు నేమియు నాపద కలుగ చేయకుం
డగ వారిని అడఁచియుంప వలయునని అజాతశత్రుఁడు పాటలి
గ్రామమున నొక దుర్గమును కట్టించెను. రాజభృత్యులు దుర్గ
మును నిర్మించుచుండు కాలమున గౌతమ బుద్ధుఁడు అచటికి
వచ్చెను. అతఁడా దుర్గమును చూచి యందునుగుఱించి యిట్లు
భవిష్యత్తు చెప్పెనఁట. "మిక్కిలి విఖ్యాతి చెందు స్థలముల



లోను, నలు దిశలనుండి వర్తకమును ఆకర్షించినందున పేరొం
దుపట్టణములలోను ఇది ముఖ్యమైనదిగాఁ గలదు. కాని యీ
పట్టణమునకు, అగ్ని, జలము, అంతః కలహము అను మూఁడు
విపత్తులు సంభవించును."

ఉదయనుఁడు అజాతశత్రుని మనుమఁడు. ఇతఁడు
క్రీ. పూ. 450 వ ప్రాంతమున రాజయ్యెను. ఇతఁడు పాటలిదుర్గము
నొద్దనే క్రీ. పూ. 434 వ ప్రాంతమున పాటలీపుత్ర పట్టణమును
గట్టించెను. ఇదియే భగవాన్ బుద్ధదేవుని భవిష్యత్తు నను
సరించి వేయి సంవత్సరములవఱకును హిందూదేశముయొక్క
కంఠమణివోలె భ్రాజిల్లెను.

ఇంతకుఁ బూర్వము మగధరాజ్యమునకు రాజగృహము
రాజధానిగ నుండెను. ఉదయనుఁడు రాజధానిని పాటలిపుత్ర
మునకు మార్చెను. ఇట్లు పర్వత ప్రాంతములో నున్న రాజ
గృహమునుండి ఏటియొడ్డున నున్న పాటలిపుత్రమునకు రాజ
ధానిని మార్చుటకుఁ గారణము లేక పోలేదు. మగధరాజ్యము
దినదినాభివృద్ధినొందుచుండెను. రాజ్యముయొక్క యన్ని
భాగములను స్వాధీనమం దుంచుకొనుటకును, హిందూదేశ
మందలి వర్తకము నంతయును ఆకర్షించుటకును గంగా, శోణ,
గోగ్రా మొదలయిన నదులసంగమమునకు సమీపమునందున్న
పాటలిపుత్రము మిక్కిలి తగినదియని నిశ్చయింపఁబడెను. ఉద
యనుఁడు శిశునాగ వంశపురాజు. క్రీ. పూ. 371 వ ప్రాంత

మున ఈవంశమంతరించి మగధము నందుల స్వాధీనమయ్యెను. వారిని నోడించి మన చరిత్రనాయకుఁడగు చంద్రగుప్తుఁడు క్రీ. పూ. **321** వ ప్రాంతమున మగధాధీశ్వరుం డయ్యెనని యిదివఱకే వ్రాసియున్నారము.

## చంద్రగుప్తుని కాలపు
## పాటలీ పుత్రము.

క్రీ. పూ. **303**-వ సంవత్సరము నందుఁ జంద్రగుప్తుఁడు సెల్యూకస్ అను గ్రీకురాజును నోడించి యతనితో సంధిచేసికొనెనని యిదివఱకే వ్రాసియున్నాము. ఆ గ్రీకురాజు మెగస్థనీస్ అను వానిని పాటలి పుత్రమందు జంద్రగుప్తునియొద్ద రాయబారిగ నుంచెను (క్రీ. పూ. 302). ఇతఁడు కొన్ని సంవత్సరముల వఱకు ఈపట్టణమునందుఁ గాపురముండి యాగ్రామమును గుఱించియు, ఈదేశమును గుఱించియు విశేషము లనేకములు వ్రాసియుంచినాఁడు. ఆకాలమునాఁటి చరిత్రాంశములు తెలిసికొనుటకు ఈ రాయబారియొక్క వ్రాతలే ముఖ్యాధారములు. ఆవ్రాతల ననుసరించియే యీక్రింది వర్ణనలు వ్రాయఁబడుచున్నవి.

## పురవర్ణన.

మగధ దేశరాజధానియగు పాటలిపురము గంగాశోణానదుల సంగమమువలనఁ గలిగిన యంతర్వేదిలో శోణకు నుత్తరమునను, గంగకు దక్షిణమునను ఉండెను. ఇప్పురి రమారమి తొమ్మిది పదిమైళ్ళనిడివియు, రెండుమైళ్ల వెడల్పును గలిగి చతుర్భుజాకారముగ నిర్మింపఁబడియె. అనఁగా నిది యిరువది చదరపు మైళ్లు వైశాల్యముగల నగరము. అత్యంత ఘనమైన కాష్ఠప్రాకారముచే నావరింపఁబడి యఱువదినాల్గు ద్వారములును ఏనూటడెబ్బది బురుజులును గలిగి, శోణానది నీళ్లతో నింపఁబడిన మిగుల వెడల్పును లోఁతునుగల యగడ్తచే రక్షింపఁబడియుండెను. పట్టణము చుట్టునున్న యీకందక మాఱువందల యడుగుల వెడల్పును, ముప్పదిమూరల లోఁతును ఉండెనఁట. ఈ గ్రామము చుట్టు డెబ్బదిమైదు గజములకు నొక బురుజును ఆఱువందల యఱువది గజములకు నొక కోటగుమ్మమును ఉండెను. ఇరువది చదరపు మైళ్ల వైశాల్యమును ఇరువదినాల్గుమైళ్లు చుట్టుకొలతయుఁ గల యీనగరరాజము కలకత్తాకు సమముగ నున్నట్లు లెక్కింపవచ్చును.



## రాజమందిరము.

శోణానది యొడ్డున నానావిధ వృక్షజాతులచే శోభితంబగు నుద్యానవనము కలదు. అందు రాజమందిరము ముండెను. రాజ ప్రాసాదము మ్రాఁకుతోఁ గట్టబడి, పారసీక రాజభవనములగు సూసా, ఎక్బటానాలకంటె మిక్కిలి వైభవముతో విలసిల్లుచుండె. దాని స్తంభములు స్వర్ణఖచితములై బంగారు గాలిచెక్కుములతోను వెండి పిట్టలతోను అలంకరింపఁబడి

యుండెను. ఈభవనము అనేక కట్టడములుగ విభజింపఁబడి, అన్నియు నొక విశాలమును మనోహరమునైన యారామమునందు నిర్మింపఁ బడియుండెను. ఇందు తళుకుతళుకుమని మెఱయుచున్న మత్స్యపల్వలమును, పెక్కు తెగల శృంగార వృక్షములును పొదరిండ్లును పిక్కటిల్లె. ఇందలి కట్టడములలో కొన్ని రాజకార్యశాలలు, కొన్ని పరివార నివాసములు, కొన్ని రాజస్త్రీల యంతఃపురములు. ఇంతేకాక సప్తభూమికా ప్రాసాదమును, సహస్రస్తంభమండపమును, ద్యూతశాలయు, ఉష్ణస్నానవాటికయు నుండెనఁట. ద్యూతశాలలో గెలుపులయందొక యంశము రాజస్వమ్ముగా జేరెనని ఆపస్తంబ వచనము. స్నానశాలయందు మొదట ప్రవేశాగారమును, పిదప ఉష్ణగృహమును, అటుపై స్నాన పల్వలమును పొసఁగి, మధ్యమున అగ్నికుండమును చుట్టును ఆసనములు నుండును. సాధారణ స్నానమునకై వాపీతటాకము లుపయోగింపఁ బడుచుండును. వీనికి జాతిపడి కట్లును ఆ పడికట్లపై పుష్పాది శిల్పాలంకారములును అమరి యుండును.

రాజ సభామంటపము అత్యంతాలంకారాడంబరముల నొప్పియుండెను. ఆఱడుగుల నెడల్పుగల బంగారు పళ్లెములును గిన్నెలును, బలుసొగసు వలువలతోడను విలువయైన మెత్తలతోను నొప్పి ముద్దులొలుక నలంకరించిన రాజపీఠములును, ఫలకములును, రత్నఖచితములైన రాగిపాత్రములును, అతి



సుందరములైన చిత్రవస్త్ర సంచయములును కాన వచ్చుచుండెను. ఇచ్చట రాజు సంపూర్ణ శోభనముతో నైమిత్తిక వైభవ కార్యముల నాచరించును. అట్టి యుత్సవకాలముల నతఁడు ముత్యపుకుచ్చులతో నలంకరించిన బంగారుపాలకి నెక్కి స్వర్ణమయములైన పట్టుపచ్చడములును సొగసు బట్టలును ధరించి సవారిపోవుచుండు. చిన్న సవారుల కాలముల, రాజు, అశ్వారూఢుఁడైయును పెద్దసవారులప్పుడు గజారూఢుఁడైయును వెడలు సమయముల ఇయ్యవి బంగారు సజ్జలతో నొప్పుచుండును. మఱియు నిట్టి సమయములందు ఎద్దు, పొట్టేళ్ళు, ఏనుఁగులు, గండకములు మొదలగు మృగముల పందెములను మల్లుల పోట్లాటలును రాజు మిక్కిలి యుత్సుకముతో విలోకించును. ఇందలి ఎడ్లపందెములు మాత్ర మిప్పుడు జరుగు టరుదు. తక్కినవి హిందూరాజధానులలో నేటికిని వాడుకలో నున్నవి. ఇంతేకాక రథములకు నడుమ గుఱ్ఱమును దానికి ఇరువైపుల నెడ్లను, పూన్చిపరుగుఁరర దూరవుపందెములు పరిగింతురఁట.

నగరముయొక్క నిర్మాణము విస్పష్టముగఁ దెలియఁజాలము. కాని ఉన్నతములైన గోడలు, అలంగములు, ముట్టుగోడలు, కావు గోపురములు, బురుజులు, మహాద్వారములు, అగడ్తలును నిస్సంశయముగనుండెను. రాజు సాయంతన విహారము సేయునపుడతనిని పౌరులు చూచుటకై మందిరము

లుచితరీతిని కిటికీలు గలవై యుండెను.* నలువైపుల నిండ్లతో నమరిన చతుశ్శాల (Square) లును పెక్కులుండెను.

సామాన్యముగ రాతికట్టడములే లేవు. పునాదులు, కంబములు, పడికట్లును దప్ప తక్కిన వెల్ల మ్రాఁకు కట్టడములు నిటిక కట్టడములునుగ నుండెను. వెలుపలను లోపలను గచ్చుపూసి, పువ్వులు, బొమ్మలు, దండపని, తీఁగపని, సన్ననిబొందుపని, రాక్షసపుపని మున్నగునవి యొప్పునట్లు దేదీప్యముగ రంగులు దీర్చి యుండెను.

## గ్రామరక్షకసంఘము.

ఇట్టి రాజధానిని రాజమందిరంబును గాపాడుటకు ముప్పదియుద్యోగస్థుల సంఘమొకటి యేర్పరుపఁబడియె. ఇది యిప్పటి మునిసిపాలిటి యనవచ్చును. ఇందుండు ముప్పది మందియు నాఱుపంచాయితులుగా విభజింపఁబడిరి. ఒక్కొక పంచాయితిలో నైదుగు రుద్యోగస్థులుండిరి. అందు మొదటి పంచాయితివారు పట్టణములోని కళాకౌశల్యాభివృద్ధికి నుత్తరవాదులయి యుండిరి. అనఁగా నిప్పుడు మనదేశాభిమానులు

* కవికులగురు కాళిదాసకృతమైన రఘువంశము యొక్క యాఱవ సర్గములో ౨౪ వ శ్లోకమునందు పాటలిపురమును గుఱించి "ప్రాసాదవాతాయన సంశ్రితానాం నేత్రోత్సవం పుష్పపురాంగనానాం" అనఁగా "మేడలలోనికిటికీలను ఆశ్రయించియున్నట్టి పుష్పపురమందలి స్త్రీలకు నేత్రోత్సవము" అని వర్ణింపఁబడుట చూడఁగా ఉత్సవాదులు చూచుటకై యిండ్లకు గవాక్షముల నుంచుచుండిరనుట స్పష్టము.



కొందఱు చేయుచున్న స్వదేశోద్యమము వంటి యుద్యమమిా యుద్యోగస్థులప్పుడు చేయుచుండిరి. రెండవ పంచాయితీదార్లు పాటలీపుత్రమునకు వచ్చెడి యన్యదేశీయులఁ గాపాడుచుండిరి. అన్య దేశీయులు రాజ్యము గుట్టు కనుఁగొనవచ్చిన మోసకాండ్రో లేక నిజముగా నేదోయన్యకార్యముమీఁద వచ్చిన వారలో కనుఁగొనుట, అన్యకార్యముమీఁద వచ్చిన వారిని గౌరవించుట, వారికి నేమియు నిబ్బంది లేకుండఁ గాపాడుట, వారికిఁ గావలయు భోజనపదార్థములిప్పించుట, జబ్బుగానున్న వారికి ఔషధము లొసంగుట, మృతిఁజెందిన వారికి నంత్యసంస్కారములు చేయించి వారిసొత్తేమైన నున్నయెడల వారి వారసులకుబంపుట, వీరిపనులయి యుండెను. ఇందువలన నాకాలమందు ననేక పరదేశీయులు మనదేశమునకు వచ్చుచుండిరనియు చంద్రగుప్తునకు ననేక పరరాజులు స్నేహితులుగానుండిరనియుఁ గానవచ్చుచున్నది. మూఁడవ పంచాయితీదారులు గ్రామములోని జననమరణపులెక్కలను జూచుచుండిరి. నాగరికతఁ జెందినయింగ్లీషు దొరతనమువారుకూడ మొన్న మొన్నటివఱకు నీదేశంబున జననమరణపులెక్కఁ బ్రారంభింపలేదు. ప్రారంభించి కొద్దికాలమే యాయెను. ఇట్టి స్థితిలో రెండువేలేండ్ల క్రిందఁ జంద్రగుప్తుఁడు ప్రజాక్షేమము తెలియుకొఱకును, పన్నుకట్టుటకు వీలుగనుండుకొఱకును ఈలెక్కల వ్రాయించుట చూడ నతని బుద్ధివైభవమునకు నెవ్వరాశ్చర్యపడకుందురు? నాల్గవ

పంచాయితీదార్లు వాణిజ్యాధికారము గలవారయి యుండిరి. తూనికెలు, కొల్తలు తప్పువికాకుండను, అమ్మెడి వస్తువులలో మోసములేకుండను జూచుట వీరిపని. అయిదవ పంచాయితీదార్లు చేతిపనులమీఁది యధికారులు. వారు వర్తకులమ్మిన సరకులమీఁదఁ బన్నులు పోగుచేయువారు. ఈ విడివిడి పనులుగాక వీరందఱును గ్రామములలోని యితరవ్యవహారములన్నిటిని జూచుచు, గుళ్లు, రేవులు, అంగళ్లు, మొదలైనవానిని గాపాడుచుండిరి. ఇది పాటలీపుత్ర రక్షణ విధము. ఇటులే యితర పురంబులన్నియు రక్షింపఁబడుచుండెను.

ఒక మహోత్సవము.

పాటలిపుత్రమున వీథులయందు డంబుగ జరిపింపఁబడిన యొక దివ్యమహోత్సవమును మెగాస్తనీసు దర్శించి తెలిపిన దానిని స్ట్రాబో దిగువరీతిని వర్ణించినాఁడు.

"వారి పండువుల యూరేగింపులయందు స్వర్ణరజతాలంకృతములగు అనేక యేనుఁగులు ఒయ్యారముగ నడచి వచ్చును. నాలుగు గుఱ్ఱములచేతను, ఎద్దుల జతలచేతను లాఁగఁబడిన లెక్కలేని బండ్లును వెంబడించును; వెనువెంటఁరిబచర సమూహాములు నిండుదుస్తు తొడిగి బంగారు పాత్రలను, పెద్ద పళ్ళెరములను వెడల్పు గిన్నెలను, మేజాయిలు, విలువగల కుర్చీలు, పచ్చలు, మరకతములు, గరుడపచ్చలు, కెంపులు మున్నగు రత్నములు చెక్కిన రాగిగిన్నెలు, మొదలగునవి మోసి



కొనివచ్చుచుందురు. బంగారు నగిషీపనిచేసిన ఉత్తమవస్త్రములు మోచువారు కొంద ఱుందురు. వారి వెనుక అడవిదున్నలు, చిరుతలు, పెంపుడుసింగములు, పలురంగుల రెక్కలుగల నానాజాతుల పక్షులును, పిట్టలును గొనిరాఁబడుచుండెను."

---

# ఏడవప్రకరణము.

# సైన్యవ్యవస్థ.

క్రీ. పూ. నాలుగవ శతాబ్దముననుండిన ఈ ప్రథమ చక్రవర్తికాలముననే మన ఇరువదియవ శతాబ్దమునందలి రాజ్యాంగ నిర్మాణమును బోలిన విశేషరాజ్యాంగ నిర్మాణముండెను. ఒక్కొకయంగమును వర్ణించుట కొక్కొకప్రకరణ మయినం జాలదు. ప్రతిభాశాలియగు చంద్రగుప్తచక్రవర్తియు మంత్రాలోచనాధురీణుండగు చాణక్యుండును పన్నిన రాజ్యాంగముల స్వరూపమును మాచే నయినంత సంక్షిప్తముగ నిటం బొందుపఱచెదము.

## సైన్యవ్యవస్థ.

విస్తీర్ణమున ప్రస్తుతపు భరతఖండమునకంటె నెక్కుడగు భూభాగమును చంద్రగుప్తునకు సంపాదించి పెట్టిన సైన్యపుసంఖ్య యపరిమితముగా నుండెనని గ్రీకుచరిత్రకారులు వ్రాసియున్నారు. ఆరాజపుంగవునికడ నాలుగులక్షల పదాతులును, 30,000 ఆశ్వికులును, 9000 ఏనుంగులును, 8000 యరదంబులును, ఉండెనని తెలియుచున్నది.



సారథిగాక ప్రతి రథముమీఁదను ఇద్దఱు రథికు లుందురు. అందుచే 8000 భటు లనఁగా 24,000 రథికులని యర్థము ప్రతి ఏనుఁగుపై మావటివాఁడుగాక ముగ్గురు యుద్ధభటు లెక్కుచుండిరి. కాన 9,000 గజములనఁగా 36,000 భటులని యర్థము. ఇట్లు వీరినందఱను లెక్కవేయఁగా రమారమి ఏడులక్షల బలమగుచున్నది.

ఇంతగొప్ప స్కంధావారమున వ్యవస్థ కల్పించి, ఒక్కొక్కరికి వారివారి పనుల నిర్ణయించి యేవేళనే సందర్భము వాటిల్లిన నద్దాని కనువగు తెఱంగున బలంబుల నడిపి వ్యూహ చమత్కారంబుల గనుపఱచి చంద్రగుప్తుండు విజయంబుఁ గొనియె.

సైన్యవ్యవస్థకయి యీ చక్రవర్తి ముప్పది యధికారుల సంఘమేర్పఱచి దానిని గూడ నాఱు పంచాయతులుగ విభజించె. మొదటి పంచాయతిలోని యధికారులు సముద్రసైన్యమునకును, రెండవ పంచాయతివారు రస్తుసామగ్రికిని ప్రయాణప్రయత్నములకును, సైన్యమునకుఁ గావలసిన తృణకాష్ఠాదులను సంపాదించుటకును, మూఁడవ పంచాయతివారు కాల్బలమునకును, నాల్గవవారు రథసైన్యంబులకును, ఐదవవారు అశ్వసైన్యమునకును, ఆఱవవారు ఏనుంగులకును నధికారులై యుండిరి.[1]

1. మెగస్తనీసు.

### సముద్రసైన్యము.

ఈ చక్రవర్తివద్ద సముద్రసైన్య ముండినటుల మెగస్తనీసు వ్రాతలవలనఁ దెలియుచున్నది. కాని ఆసైన్యమును గుఱించిన విశేషము లెఱుంగుటకు సాధనములు గానవచ్చుట లేదు. కౌటిల్యుని అర్థశాస్త్రమును బట్టి చూడఁగా నాకాలమున 'నావాధ్యక్షుఁడ' ను అధికారి యుండినట్లును సముద్రముల మీఁదను సరస్సులమీఁదను దిరుగునట్టి యోడలను గుఱించిన యధికారమంతయు నాతనిచేత నుండినట్లును గనుపించు చున్నది. రేవులయందు సుంకములు వసూలుచేయు పనినిగూడ నితఁడే తీర్చుచుండెను. నావికాచోరులను దండించుటయు గాలివానలచే నలంగిన యోడలకు శరణమిచ్చుటయు నీతనిధర్మములలోనివయియుండెను. గొప్పగొప్ప నదులను దాఁటుట కొఱకై ప్రభుత్వమువా రేర్పఱిచిన నావలకును పడవలకును వానిపైనుండు నౌకరులకును నితఁడే యధికారి.

### రస్తుసామగ్రి.

రెండవ పంచాయతివారు రస్తుసామగ్రి మున్నగువానిని సమకూర్చువారని వ్రాసితిమి. యుద్ధమునకు సైన్యము బయలుదేఱు తఱి భోజనము సిద్ధపఱుచుటకుఁ గావలసిన ధాన్యాదులును గట్టియలును, యుద్ధమున గాయపడు భటుల చికిత్సకొఱకగు మందులును ఉపకరణములును, గుఱ్ఱములకు నేనుఁగులకు వలయు ఘాసాదులును, యుద్ధము సలుపు నెడ నవసరమగు నాయుధాదులును వెంటనంపుటకే యీపంచాయతి యేర్పడినది. ఆకాలమునందు వైద్యశాస్త్రము భరతవర్షమున మిక్కిలి పెంపు గాంచి యుండెను. కాశీనగరంబునను తక్షశిలానగరంబునను నెలకొల్పఁబడియుండిన సర్వకళాభవనములు ప్రసిద్ధిఁ జెంది యుండె. అచ్చట విద్యగఱచిన వైద్యవిద్యావిశారదులు శస్త్రములును, యంత్రములును, తైలములును (Oils), కాళ్లుచేతులు విరిగినవారికి కట్టులుగట్టుటకు వస్త్రములును మున్నగు వైద్యోపకరణంబులఁగొని బలంబుల వెంబడి నేగుచుండిరి. గాయములువడిన యుద్ధభటులకు నుపచారములు సలిపి పథ్యపానాదుల నమర్చుటకయి తత్తదర్హవస్తుసంచయంబులఁ గొనుచు ధాత్రికలు (దాదులు)ను వీరితోడంగూడ నుందురు. ఇట్టి ధాత్రికలకు మార్గదర్శని యని యీకాలమున లోకమునందంతట పేరుగాంచిన ఫ్లారెన్సు నైటింగేలుసతి గతశతాబ్దమునందలిది. ఇట్టి ఫ్లారెన్సు నైటింగేలులు చంద్రగుప్తచక్రవర్తి కాలమున నెందఱో యుండిరి. అట్టివారిని నియమించుటయు రస్తుసామగ్రి పంచాయతివారి కర్తవ్యంబె.[1]

### కాల్బలములు.

చంద్రగుప్తుని కాలమునందలి పదాతులు ముఖ్యముగ ధనుర్ధరులు. ప్రతిభటుఁడును దన పొడవునకు సమమగు పొడవు

1. చాణక్యుని అర్థశాస్త్రము. 10 వ భాగము.

గల వింటిని మోయుచుండును. అవసరమగుడు దానిని భూమి పై మోపి గుణము సంధించి ఆకర్ణాంతముగఁ దిగిచి మూఁడు గజములఁ బాణంబులఁ బ్రయోగించుచుండును. ఈ బాణము లకు డాళ్లుగాని కవచములుగాని మఱియెంత బలిష్ఠమయిన ఇతర రక్షలుగాని అడ్డుపడలేకుండెను. ఆకాల్బంటులు తమ శరీరముల సంరక్షించుకొనుటకు పదునుచేయని తోళ్లతోఁ జేయఁబడి నిలువైన తమ్మును బూర్ణముగఁ గప్పఁ గలుగు కేడెముల నెడమచేత ధరించుచుండిరి.

ఈధనుర్ధరులుగాక పదాతిసైన్యంబున ఖడ్గధారులును గొంద ఱుందురు. వారికత్తులు పొడవును వెడల్పును నై ఇఱుకుసందుల నగు యుద్ధముల మిక్కిలిగ నుపయోగింపఁబడు చుండెను. అట్టి సందర్భముల భటులొక్కొకవేళ రెండు చేతులతోడను ఖడ్గముం జళిపించి వేయుచుందురు.[1]

చంద్రగుప్తచక్రవర్తి కడనుండు బలములు మూల బలంబులు, కృతబలంబులు, శ్రేణిబలంబులు, అని మూఁడు తెఱంగులుగ నుండెను. రాజుచే శాశ్వతముగ నిలువుకొనఁ బడి యుండిన సైన్యములు మూలబలంబులు. యుద్ధప్రసంగము వచ్చినప్పుడు సిద్ధపఱిచి వేతనమొసంగి నిలుపుకొనఁబడినవి కృత బలంబులు. శ్రేణిబలంబులు అను పదమునకుఁ గొంచెము వివ

1. అర్రియను అను గ్రీకులేఖకుని వ్రాతల ననుసరించి.



లముగు వ్యాఖ్యయవసరము. దేశమునం దచ్చటచ్చట క్షత్రియ వీరుల 'శ్రేణులు' అనఁగా సంఘములు నెలకొని యుండెను. వీరు వర్ణమునందు క్షత్రియులే యయ్యును రాజ్యాధికారము లేమిం జేసి యుద్ధవిద్య నభ్యసించియు నితరవృత్తులచే జీవనము గడుపుకొనుచుండిరి. వీరి సాహాయ్యమును యుద్ధములయందుఁ జక్రవర్తులు పొందుచుండిరి. వీరే శ్రేణులు. ఆకాలమున నిట్టి శ్రేణులలోఁ బ్రసిద్ధమయినవి కాంభోజమునను, సౌరాష్ట్ర మునను, లిచ్ఛవియందును, వ్రిజకమునందును, మల్లకము నందును, మద్రక కుకురు కురు పాంచాలములయందును.[1] నుండెను. అందు కాంభోజ సౌరాష్ట్రముల వారు కృషీవలులు గను వర్తకులుగను గాలము గడుపుచుండిరి. తక్కుంగలవారు రాజు లనఁబడుచుండిరి. ప్రతిశ్రేణియు నొక్కనాయకునకు లోఁబడి ప్రవర్తించుచుండెను.

ఈ మూఁడు తెఱంగుల బలములు గాక అరణ్యకులును పార్వతేయులును సందర్భవశంబున విశేషసైన్యాంగముగ నుప యోగించుకొనఁ బడుచుండిరి. జయింపఁబడినవారిని దోఁచు కొనుటయే వీరికి వేతనము

ఇట్లేర్పడిన కాల్బలంబులకు నాయకుండగువాఁడే సర్వ సైన్యంబులకును నధ్యక్షుండు.

1. అర్థశాస్త్రము 11 వ భాగము 1 వ ప్రకరణము.

## ఆశ్వీక సైన్యము.

ఆశ్వీకసైన్యమునఁ బ్రతి భటుఁడును రెండు ఈటెలును డాలును యుద్ధమునకు గొంపోవుచుండెను. ఈతనిడాలు కాల్బంటు డాలునకంటె కురుచగ నుండెను. గుఱ్ఱముపై జీనులు వేయుట యాచారముగాదు. గుఱ్ఱములకుఁ గళ్లెము దగిలించుటయు లేదు. కాని గుండ్రముగ కుట్టఁబడిన ఎద్దుతోలు మూఁతతో వాని ముఖములు కప్పఁబడుచుండెను. ఆమూఁతల లోభాగమున వాడియంతగలేని ఇనుము, ఇత్తడి లేక దంతపు ముండ్లిముడ్పఁబడియుంటచే నదియే కళ్లెమువలె నుపచరించుచుండెడిది.[1]

యుద్ధమునకయి గుఱ్ఱములకు వల్గనలంఘనేత్యాద్యనేక గతి విశేషంబులు నేర్పఁబడుచుండె. యుద్ధభూములయందును అరణ్యములయందును మధ్యభాగమున నిల్చి మిగత సైన్యంబు చేరుటకు గుఱియై యుండుటయు, సైన్యోపయోగమునకగు జంతువులు ప్రవాహములు దాఁటవలసి వచ్చినప్పుడును ఝుంఝూమారుతమున ప్రయాణము సలుపవలసి వచ్చినప్పుడును చెదరిపోకుండుటకయి వానికి కట్టఁబడిన పగ్గములఁ బట్టుకొనుటయు, తమ రస్తుసామగ్రిని కాపాడుకొనుటయు శత్రువుల రస్తు సామగ్రిని గొల్లకొట్టుటయు, క్రొత్తఁగ తమ సాహాయ్యార్థము వచ్చు

1. అర్రియ నను గ్రీకులేఖకుఁడు.



దండులను సంరక్షించుకొనుటయు, శత్రువులకు సాయము వచ్చు దండుల చెదరగొట్టుటయు, తమ సైన్యమును సుశిక్షితముగఁ బెట్టుకొనుటయు, సమయమగుడు దానిని పొడువుగ గానవచ్చునట్లు దీర్చుటయు, సైన్యపార్శ్వాంగముల సంరక్షించుకొనుటయు, యుద్ధము ప్రారంభమగునప్పుడు మొదట స్వారికి వెడలుటయు, శత్రుబలంబుల చెల్లాచెదరుచేసి నుఱుమాడుటయు, తమ బలంబుల నాకస్మికముగ వైరులెదిర్చినచో నడ్డువడుటయు, వారిం బట్టుటయు, వారులోఁబడి శాంతికై వెడలుచో వారిని వదలుటయు, తమ సైన్యంపు మార్గమును మరల్చుటయు, రాజులను ధనంబును మోసికొనిపోవుటయు, శత్రువుల వెన్నుదన్ని తాఁకుటయు, పాఱిపోవు రిపులఁ దరుముటయు, జయించిన స్థానంబుల పోఁగగుటయు నాశ్వీక సైన్యంబుల కర్తవ్యంబులయి యుండె.

ఈయాశ్వీక సైన్యంబులకు నుత్తమాశ్వంబులు కాంభోజ సింధ్వారట్టవనాయు బాహ్లీక సౌవీర పాపేయ తైతల దేశంబుల[1] నుండి కొనిరాఁబడు చుండెను. ఇందులో కాంభోజ సింధ్వా

1 కాంభోజమనఁగా అఫ్గనిస్థానము. సింధువు మన మెఱింగినదియే. ఆరట్టు పంజాబునందలి అరాష్ట్రికుల దేశము. వనాయు వనఁగా అరబ్బీ దేశము. బాహ్లీక మనఁగా మధ్యఆసియా యందలి బాల్ఖ్ దేశము. సౌవీరమనఁగా గుజరాతు దేశమందలి ఈడరు రాష్ట్రము. పాపేయ తైతలదేశంబు లెవ్వియో కనుంగొన వలసి యున్నది.

రట్టవనాయువుల గుఱ్ఱములు శ్రేష్ఠములుగ నెన్నఁ బడుచుండెను.

గుఱ్ఱములమీఁది యధికారికి అశ్వాధ్యక్షుఁడని పేరు. తీక్ష్ణ, భద్ర, మందాదిగుణముల ననుసరించియు వాని జన్మస్థలముల ననుసరించియు గుఱ్ఱముల తరగతుల నేర్పఱచి లెక్కలు వ్రాయించుటయు, వానికి యుద్ధమునందును ఇతర సమయములందును బనికివచ్చు నానాగతులను[1] నేర్పుటయు విశాలమయిన అశ్వశాలలను నిర్మించుటయు, అశ్వచికిత్సకుల నేర్పఱచి వారిచేఁ బనులు గొనుటయు మఱి యితరవిధముల నశ్వముల పోషించి కాపాడుటయు నీయధ్యక్షునికిఁ గర్తవ్యములయి యుండెను. అశ్వముల కుపచారములు చేయుట కీక్రిందిక్షుద్ర సేవకులు నియమింపఁ బడియుండిరి.

1. సూత్రగ్రాహకుఁడు - నఫరుపని చేయువాఁడు
2. అశ్వబంధకుఁడు - గుఱ్ఱములను గట్టివేయువాఁడు
3. యావశికుఁడు - తృణమును కొని తెచ్చువాఁడు
4. విధాపాచకుఁడు - గుఱ్ఱములకుఁ బెట్టునిమిత్తమయి గుగ్గిళ్లు మొదలగు వానిని వండువాఁడు
5. స్థానపాలకుఁడు - అశ్వశాలను సంరక్షించువాఁడు

1. యుద్ధసమయమునందలి గతులకు 'ఔపవాహ్యక' గతులనియు శాంతిసమములందు చేయు స్వారి సంబంధమగు గతులకు 'సన్నాహ్య' గతులనియు పేళ్లు.



6. కేశకారుఁడు - వెండ్రుకలు కత్తిరించి గుఱ్ఱములకు నునుపు పెట్టువాఁడు
7. జాంగలికుఁడు - ఆహారాదులఁ బరీక్షించువాఁడు

## గజములు.

మనదేశమున ప్రాచీనకాలమునందు సైన్యములోని యంగములలో గజాంగమెక్కువ యుపయోగకారియై కన్పట్టుచున్నది. చంద్రగుప్తుని కాలమునఁ బ్రతి గజముపై మావటివాఁడు గాక ముగ్గురు యుద్ధభటులెక్కుచుండిరి. వారు మువ్వురును ధనుర్ధరులు. ఇద్దఱు ప్రక్కలనుండియు మూఁడవవాఁడు వెనుకనుండియు బాణముల వేయుచుండిరి.[1] ఆకాలమున గజసైన్యము యుద్ధసమయములఁ జేయుచుండిన పనులెవ్వియనిన:-

పర్వసేనాముఖంబున నడచుట, సైన్యము నడచుటకు మార్గములను శిబిరస్థానములను నీరు దెచ్చుటకు త్రోవలను సిద్ధపఱచుట, సైన్యము చుట్టును నావరించి రక్షించుట, అంగేతరంబులు చలించినను చలింపక యెదురొడ్డినిలుచుట, ప్రవాహంబు లడ్డము వచ్చినప్పుడు సైన్యములను దాఁటించుట, అభేద్యస్థలంబులను బలంబున భేదించుట, శత్రుసైన్యంబులకు నగ్నిముట్టించి స్వసైన్యంబున గలిగిన యగ్నిబాధల నివారించుట, చెదరిన సైన్యంబును నొక్కెడఁ బ్రోగుచేయుట, వైరుల గట్టిమొనలను చెల్లాచెదరొనర్చుట, రిపువర్గమును హుంకరించి

1 మెగాస్తనీసు.

బెదిరించుట, వారిని ద్రొక్కి వినాశముచేయుట, కోటగోడలను దుర్గద్వారములను బురుజులను డీకొని పడఁద్రోయుట, ధనమును మోసికొని పోవుట. ఇందు దుర్గములను సాధించుట ముఖ్యతమము.

ఇట్లుపయోగ పడుచుండుటంజేసి గజములనిన చక్రవర్తికి మహాప్రీతి. వాని సంరక్షణార్థము ఒక్క యధ్యక్షుఁడును, అనేకులు అధికారులును, లెక్కలేని క్షుద్రసేవకులును నియమింపఁబడియుండిరి. వానికై గొప్పగొప్ప యడవులు విడదీసి యుంచియుండిరి. వానికేమాత్రము నొప్పి కలుగఁజేసిన వారికిని శిక్షలు విధింపఁబడుచుండెను. గజశాలల కసవుచేరనిచ్చుటయు, ఏనుఁగులకు ఆహారము వెట్టక పోవుటయు, వానికి పరుండ నేర్పఱచిన మెత్తని భూములలోఁ గాక ఇతరస్థలములలో వానిని పరుండనిచ్చుటయు, ఆయువు పట్టున వానిని గొట్టుటయు, వానిపై నితరుల నెక్కనిచ్చుటయు, సమయముగాని వేళల వాని నెక్కుటయు, ఇఱుకుసందులలోనుండి వానిని నీటియొడ్డునకు నీళ్లుత్రాగించుటకుఁ గొని పోవుటయు, వానిని దట్టమగు నడవులలోనికిఁ బోనిచ్చుటయు నను నివి నేరములుగా నెంచఁబడి యట్టి యపరాధమునకుఁ గారకులైనవారు జరిమానాతో దండింపఁబడుచుండిరి. ఏనుఁగును చంపినవాఁడు ఉరిదీయఁబడుచుండెను.[1]

1. చాణక్యుని అర్థశాస్త్రము 2వ భాగము 32 ప్రకరణము



ఈకాలమునందు వలెనే ఆకాలమునందును ఏనుఁగులు తమ్మును పెంచిన మావటివాండ్రయందు మిక్కిలి విశ్వాసము కలిగి యుద్ధములలో సంరక్షించుచుండెను. ఇందును గుఱించి చంద్రగుప్తుని యాస్థానమున గ్రీకువారి ప్రతినిధిగ నుండిన మెగస్తనీసొక చిత్రమయినకథ వ్రాసియున్నాఁడు.

ఒకానొక భారతీయునకు తెల్ల ఏనుంగుగున్న యొకటి చిక్కెను. అతఁడు దానిని పెంచుకొని వాహనముగ నుపయోగించుకొనుచుండె. దినదినమునకును దానియెడ నతని కనురాగము హెచ్చుచువచ్చెను. అదియును దన యజమానునికి విశ్వాసము నెఱపుచుండెను. ఇట్లుండ రాజున కద్దానిని అపహరింపవలెనను దురాశ పొడమెను. కాని స్వంతగాని కాజంతువుపై నెక్కుడు ప్రేమయుండుటచేతను ఇతరుల వశమున దాని నుంచుటకు బుద్ధిపుట్టక పోవుట వలనను దానితోడంగూడ దేశము వదలి యడవులకుఁ బారిపోయెను. ఈవార్త విని రాజు కోపోద్దీపితుఁడయి ఏనుంగును మనుష్యుని బట్టి తెచ్చుటకుఁ దన పరివారము నంపెను. వారును దరలి పోయి ఏనుంగును దాని యజమానుని దాఁకిరి. గజంబుపైనుండి అతఁడు రాజభటులతోఁ బోరాటము సలిపెను. వానికి ఏనుంగుకూడ సాయమొనర్చెను. కాని రాజభటులనేకులైనందున వాఁడు గాయములుపడి సోలి క్రిందఁబడి పోయెను. యుద్ధమునందు పడిన భటుని నాతని సహభటులు దమ డాలు

లతో గప్పఁబడి అప్పుడే యేనుంగు తన స్వామిని గప్పియుంచి శత్రువులను గొందఱను మడియించి తక్కినవారిం జెల్లాచెదరొనర్చి వైచెను. పిదప నాతనిని తన తొండముతో నెత్తి వీపుపైనిడికొని శాలకుఁ గొనిపోయి స్నేహితుఁడు పోలె నతని ప్రక్క దుఃఖించుచు నిలుచుండె.[1]

### రథములు.

రామాయణ మహాభారతాది కాలమునుండి మనదేశమున మహాయోధులు రథారూఢులయియే యుద్ధముచేయుచున్నట్లు కానవచ్చుచున్నది. సాధారణ సైనికులు మాత్రము నేలపై నిలువంబడి పెనంగుచుండిరి. చంద్రగుప్తుని కాలమున సాధారణముగ నరదంబునకు రెండుగుఱ్ఱములు పూన్చెడువారు. నాలుగు గుఱ్ఱంబుల రథంబులును నుండె. ప్రతి రథంబుమీఁద సారథిగాక యిద్దఱు రథికులుందురు. కొన్నిరథముల మీఁద నిద్దఱుసారథులును, ఇద్దఱుధనుర్ధరులును, ఇద్దఱు ఫలకధారులును నుందురు. పనిఁ బడిన వేళల సారథులుగూడ సమరరంగంబున దమ శౌర్యంబు సూపి యని సల్పుచుండిరి.[2]

ఇట్టి రథసైన్యంబునకు రథాధ్యక్షుం డను అధికారి యుండెడువాఁడు. యుద్ధంబునకుఁ దగిన రథంబులను సిద్ధపఱిచి యుంచుట యతనిపని.

1. మాక్రిండలు మెగస్తనీసు 118 పేజి
2. క్ర్టియసు 8. 14



### సైన్యములోని యధికారుల పరంపర.

చతురంగములోని యొక్కొకయంగమునందలి పదుగురు భటులకుఁ బైయధికారి పదికుఁడు. అట్టి పదికులు పదుగురిపై యధికారి సేనాపతి నాఁబరంగు. అట్టి సేనాపతులు పదుగురిపై యధికారినాయకుండు నాఁజను. అట్టినాయకులందఱకును సర్వ సైన్యంబునకును నధికారి యగువాఁడు సేనాముఖ్యుం డనంబడుచుండెను.

### స్కంధావారనివేశము.

సైన్యము యుద్ధమునకు సన్నద్ధమయి వెడలుటకు మున్నొక నాయకుఁడును నొకజ్యోతిష్కుండును నొకవర్ధకుఁడును, అనఁగా వడ్రంగియుఁ, బెక్కండ్రు కూలివారును బయలుదేరి మార్గములను, అందలి గ్రామములను, అరణ్యములను, వంతెనలను, కాలిత్రోవలను, బావులను, చెఱువులను బరీక్షించి చెడిపోయిన వానిని సంస్కరింపుచుందురు. సైన్యము విడియుటకుఁ దగిన స్థలములను నిర్ణయించి నీలుకొలఁది వలయాకారము గలదిగఁగాని చతుష్కోణాకృతి గలదిగాఁ గాని శిబిరంబును నేర్పఱతురు. శిబిరమునకు నాలుగుద్వారములును ఆఱు త్రోవలును నుండును. అది తొమ్మిదిభాగములుగా విభజింపఁబడును. శత్రువులవలన నపాయము జరుగకుండ దాని చుట్టును కందకములును, గోడలును, పరిఘలును, బురుజులును నిర్మింపఁబడును. రాత్రింబవళ్లు పహరాయిచ్చుటకు పమనెని

మిది జతల సైనికు లుందురు. శిబిరమునందు ప్రమత్తత నెల కొనుటకయి ద్యూతము త్రాగుడు విందులు కలహములు పూర్ణముగ నిషేధింపఁ బడియుండెను. శత్రువులు మారువేస ముతో శిబిరముఁ జొరకుండుట కొఱకు అభిజ్ఞానపత్రము (pass- port)ను బొందనివారు లోనికి రానియ్యఁ బడుచుండ లేదు.[1]

### సైన్యంబులు దాడివెడలు విధము.

గడ్డియు నీళ్లును కట్టెయలును సమృద్ధిగ దొరకు మార్గ మని ముందువెడలిన నాయకునిచే సూచింపఁబడిన వార్తననుస రించి ఆయాగ్రామముల నెఱింగికొని రాజు యుద్ధమునకు వెడలును.

సేనాముఖంబున నాయకులును, నడుమ రాజును అంతః పుర స్త్రీలును, కుడియెడమవైపుల నాశ్వీక సైన్యమును, చుట్టు ను నేనుంగులును దక్కంగల సైన్యమును నడుచును. త్వర గా నడచినయెడల దినమునకు రెండు యోజనములును (రమా రమి 13 మైళ్లు) మందముగా నడచిన నొక్కయోజనంబును (రమారమి 6 మైళ్లు) ప్రయాణము సాగించుచుండిరి. సేన విడిసి యున్నప్పుడు సేనాధ్యక్షుని కుటీరము సేనకు ముందుండును. సైన్యములు వెడలునప్పు డతఁడు వెనుక నడచును.

1. చాణక్యుని అర్థశాస్త్రము. 10; 1.



యుద్ధముచేయు సమయముల భటు లుత్సాహముతోఁ బనిచేయఁగలందులకు గాను శత్రుసైన్యములలోని బంటును చంపినవానికి 20 పణములును, కాల్బలముల నాయకుని చంపిన వానికి 100 పణములును, ఆశ్వికుని జంపినవానికి 1,000 పణము లును, ఏనుంగునుగాని రథంబునుగాని నాశ మొనర్చినవానికి 5,000 పణంబులును శూరాగ్రేసరుల నాయకుని జంపినవానికి 10,000 పణంబులును, యువరాజును గాని సేనాధ్యక్షునిగాని జంపినవానికి 50,000పణంబులును, శత్రురాజును మడియించిన వానికి లక్షపణంబులును బహుమాన మొసంగఁ బడుచుండెను.

### ధర్మయుద్ధము.

హిందువుల యుద్ధవిధులు ఇతరదేశస్థుల వానికంటె మిగుల కరుణాయత్తములు:

“ ఆయుధములు పడవైచినవారిని, జుట్టు విరియఁబోసి కొనియో చేతులను జోడించికొనియో దయవేఁడువారిని, శరణుజొచ్చినవారిని హింసింపఁగూడదని యార్యశాసనము.”[1]

“ భీరులతో, మత్తులతో, ఉన్మత్తులతో, మైమఱచిన వారితో, కవచభ్రష్టులతో, స్త్రీశిశువృద్ధబ్రాహ్మణులతో, యుద్ధముచేయరాదు ”[2]

1 అపస్తంబ. II 5-10-11.

2 బోధాయన. I 10-18-11.

"సంహృతయోధులపత్నులకు సంరక్షణ నొసఁగ వలయు."[3]

మెగాస్థనీసు ఇట్టి హిందువుల యుద్ధధర్మకారుణ్యమునకు సాక్ష్యము పలుకుచున్నాఁడు. "ఇతరదేశస్థులలో నుద్ధకాలము లందు భూనాశనము సామాన్యమైయుండఁగ నందునకు మాఱుగ హిందువులలో పంటకాఁపులు - పవిత్రులును నహింసనీయులును గావున - సమీపముననే పోరుచెలరేఁగుచున్నను భయమించుకయు లేకయే నెమ్మదిగ నుందురు. ఏల యన ఇఱుతెగల పోటరులును పోరుసలుపుచు నొండొరుల నఱకు కొనుచున్నను సేద్యకాండ్ర జోలి కించుకయుఁ బోక నుందురు. మఱియు పగతుని భూమిని అగ్నిదగ్ధముచేయుట గాని అచ్చటి చెట్లను నఱకివేయుట గాని వారికి వాడుక లేదు.

---

3 వసిష్ఠ. XIX. 20.

## ఎనిమిదవ ప్రకరణము.

---

# రాజ్యాంగవ్యవస్థ.

చంద్రగుప్తునికాలమున రాజునకు సలహా నిచ్చుటకు మంత్రిపరిషత్తొకటి కలదు. అందు 12 గురో లేక 18 గురో లేక ఆయా సందర్భములకు వలసినంతమందియో మంత్రు లుండెడువారు. అన్ని విషయములలో రాజు వారిని యాలోచన యడుగుచుండెడు వాఁడు. మిక్కిలి రహస్యముగ నుండఁదగిన విషయములలో నొకరిద్దఱు మంత్రులు మాత్రమె యాలోచనఁ దీర్చుచుండిరి. ఎప్పుడైన నొకప్పుడు రాజు స్వతంత్రించి పని చేయుటయుఁ గలదు. కాని సర్వసాధారణముగ మంత్రులలో బహుజనసంఖ్య ఎట్లు చెప్పిన నట్లు నడుచుకొను చుండెడువాఁడు. సామ్రాజ్యము నందలి దూరపు ప్రాంతములపయి చంద్రగుప్త చక్రవర్తి ప్రతినిధుల నేమించి వారివలన రాజ్యకార్యముల నడపించుచుండెను. ఈ ప్రతినిధులు సామాన్యముగ రాజవంశము వారలయినట్టు కానవచ్చుచున్నది. రాజధానికి వేయి మయిళ్లదూరము నందుండు 'గిర్నారు' అనఁబడు పశ్చిమ ప్రాంతమున పుష్యగుప్తుఁడను ప్రతినిధి పరిపాలించు చుండినట్లును

అతఁ డచ్చటి రైతుల సౌకర్యార్థమయి యొకనదికి యానకట్ట కట్టించి దాని నీటిని యొక తటాకమునకు మరల్చి తప్పని నీటి వసతి నేర్పఱిచెననియు తెలియవచ్చుచున్నది.

## రాజ్యవిభాగము.

ఆ దినములలో సాధారణముగ నైదువందల కాఁపు కుటుంబములు గలది యొకపల్లె. ఇట్టిపల్లెలు ఒకదాని కొకటి రమారమి క్రోశెడుదూరమున నుండుచుండెడివి. అందువలన నాపత్సమయమున నొకయూరివారు మఱియొకయూరివారికి సాహాయ్యము చేయఁగలుగు చుండిరి. పొలిమేర విషయమున వివాదము రాకుండుటకయి నదులు పర్వతములు మొదలగు స్వాభావిక చిహ్నములు పొలిమేర గుర్తులుగ నేర్పఱుపఁ బడి యుండెను. పల్లెచుట్టును కలపతో ప్రాకారము పెట్టుచుండిరి. ఇట్టిపల్లెలు అయిదుమొదలు పదింటివఱకు నొక్కయధికారి క్రిందనుండును. ఆ యధికారికి గోపఁ డనిపేరు. ఈ గోపఁడే ఆ గ్రామములకు సంబంధించిన లెక్కలు వ్రాయుచుండును. గ్రామములు, చేలు, తోఁటలు, మార్గములు, బీళ్లు, దేవాలయములు, తోఁపులు, తీర్థములు మొదలగువాని సరిహద్దు గుర్తులను ఇతఁడు సంరక్షించువాఁడు. [1] గ్రామస్థులు చేసికొను

1. ప్రస్తుత మీ పనులన్నియు కరణములును ల్యాండురికార్డు ఇన్స్పెక్టరు తహశీలుదారులును చేయుచున్నారు [illegible]



దానములు విక్రయములు తనఖాలు ఈతని ద్వారా జరుగుచుండెను. గ్రామములోని ప్రతిగృహమునందలి జనుల యొక్కయు దాసులయొక్కయు సేవకులయొక్కయు పశుపక్ష్యాదుల యొక్కయు లెక్క యీతఁడు వ్రాయుచుండెను. అదే లెక్కలలో ఒక్కొకయింటివారు ప్రభుత్వము వారికి చెల్లించుచుండిన శిస్తుశుల్కముల మొత్తమును తేల్చుచుండును. గ్రామస్థుల వృత్తులను బేర్కొని వారువారు గడించు మొత్తములను రమారమిగ నిర్ణయించి లెక్కవ్రాయుటయు నతని పనులలో నొక్కటి. [1] ఈ కర్తవ్యములను బట్టి ఇతఁడు అప్పటి కరణ మని వేరుగ వ్రాయఁబనిలేదు.

ఎనిమిదివందల గ్రామములపై యధికారికి స్థానికుఁ డని పేరు. ఈ 800 గ్రామముల సంరక్షణార్థము స్థానీయమనఁబడు దుర్గమొం డుండెడిది. ప్రస్తుతపు జమీందారీలలోని ఠాణేదారు శబ్దమునకు ఈ స్థానికుఁడు అనుపదము తండ్రియేమో. గోపుఁడు గ్రామములపైఁ బలె స్థానికుఁడు మండలముపై అధికారి. ఈ యధికారులందఱపై వాఁడు 'సమాహర్త' నాఁబరగుచుండెను. రాష్ట్రమును మండలములుగ విభజించుటయు, గ్రామముల తరగతులను నియమించుటయు, గ్రామాధికారులయొక్కయు స్థానికుల యొక్కయు పనులను బరిశీలించుటయు నీతనికిఁ గర్తవ్యములు. ఈ సమాహర్తగాక రాజ్యాంగశాఖ లొక్కొక్కంటి

1. చాణక్యుని అర్థశాస్త్రము.

కిని నొకయధ్యక్షుఁ డుండును. అధ్యక్షు లందఱును మంత్రుల లోనివారె. వీరు రాజుతోడఁగూడ పైన నుడివినట్లు రాజ్య భారమును వహింతురు.

గ్రామము లుత్తమ మధ్యమాధమ భేదములచే మూఁడు విధములు. ఈవిభాగము గాక యీక్రింది విధముగ వేరుతరగతు లేర్పడుచుండెను.

(1) ఇనాము గ్రామములు
(2) సైనిక గ్రామములు
(3) ధన ధాన్యవస్తువులఁ జెల్లించు గ్రామములు
(4) పశువులను సేవకులను అమర్చు గ్రామములు
(5) పాలను పెరుగును కూరగాయలను ఇచ్చు గ్రామములు.

## రాజ్యాదాయ మార్గములు.

ఇప్పటింబలె చంద్రగుప్తుని కాలంబునను రాజునకు మన దేశమున వరుంబడికి ముఖ్యాధారము. నేల పన్నె యయి యుండెను. “సేద్యము క్రిందనుండు భూమిలో విశేష భాగమునకు నీటి వసతి కలదు. సంవత్సరమునకు రెండు కారులు పంటలు పండును. . .నదులమీఁద కొందఱు అధికారు లుందురు. వారు ఈజిప్టు దేశమునందువలె భూములు కొలిచి రైతులకన్యాయము జరుగకుండుటకయి పెద్ద కాలువలనుండి పిల్లకాలువలకు నీళ్లు



విడుచు ద్వారములను తగువిధమున మూయించుచు తెఱపించుచు నుందురు.” [1]సాధ్యమయినవఱకు ఇట్టి నీటి వసతుల నమర్చి చంద్రగుప్తుఁడు భూములయందు కర్షకులు చేయవలసిన కష్టమును అనుసరించి కరము గ్రహించుచుండెను. ‘హస్త ప్రవర్తిమ’ భూములయందు, అనఁగా చేతి కష్టముచేత నీటిపాఱుదలయగు భూములయందు “ఉదకభాగము” [2]పంటలో నైదవ వంతుగ నిర్ణయింపఁబడి యుండెను. ‘స్కంధప్రవర్తిమ’[3]భూములలో ననఁగా ఎడ్ల సాహాయ్యమున నీరు పాఱుదల చేసికొను భూములలో నాలవ వంతుగను; ‘స్రోతయంత్ర ప్రవర్తిమ’ భూములలో ననఁగా వాయుయంత్రముల [4]మూలమునను ఇతర యంత్రముల మూలమునను సాగగు వానిలో మూఁడవ వంతుగను; నదులు, సరస్సులు, చెఱువులు, బావులు మున్నగువాని

---

1. మెగస్తనీసు. 2. నీటి తీరువయని యర్థము.

3. స్కంధప్రవర్తిమ' మనుదానికి 'భుజముచేత మోసికొనుట' యని కొందఱర్థము వ్రాసి యున్నారు. ఆయర్థమంగీకరించినచో హస్తప్రవర్తిమమునకును దీనికిని భేదమెట్లో తెలియరాకున్నది. భేదము లేనిచో తీరువ ఎట్లు భేదపడునో నిర్ణయింపరాదు. స్కంధమను శబ్దము జత యెడ్లకుం గూడ ప్రవర్తించును గాన ఎడ్లసాయమున నీరు పాఱించుకొని సాగుబడి చేసికొనఁబడు భూము లనుట యుక్తియుక్తముగా నున్నది.

4. వాతప్రవృత్తిమనందిని వస్థాయతన తటాక కేదారారామషణ్డవాపానాం సస్యవణభాగోత్తరికమన్యేస్యే వాయథోపకారందద్యుః. (అర్థశాస్త్రము మూఁడవ భాగము).

క్రింది పంటలలో మూఁడవ లేక నాల్గవ వంతుగను పన్ను నిర్ణయింపఁబడి యుండెను.

అర్థశాస్త్రమున నొక్కెడ "సాగుచేయక వదిలిపెట్టఁబడిన భూములను (రాజు) పంటలో సగము భాగమునకు పైరుపెట్టువారికి ఇయ్యవచ్చును. స్వంత సేద్యముగల రైతులకు నాలవ వంతునకో యైదవ వంతునకో యిచ్చి వేయవచ్చును. లేక వారు అనవసరముగు నష్టము పొందక యియ్యగలిగినంత యిచ్చినను ఇయ్యవచ్చును." అని వ్రాయఁబడియుండుటం జేసి చంద్రగుప్తుని కాలమున రైతున కీయ శక్యముగాని పన్ను రాజడుగకుండెననుట స్పష్టమగుచున్నది. స్వంతముగ చెఱువులు త్రవ్వించుకొనినచో నట్టి ప్రజ యాచెఱువుల క్రింది సాగుపై యైదు సంవత్సరముల కాలమును, శిథిలమైన చెఱువులను చక్కఁజేసికొనువారు నాలుగు సంవత్సరముల కాలమును, చెఱువుల విస్తీర్ణ మెక్కుడు చేసికొని యెక్కుడు భూభాగమును సాగుదల క్రిందికి తేఁ దలంచుకొనిన వారు ఆ భాగముపయి మూఁడుసంవత్సరముల వఱకును, కుష్కి పంటల పండింపు నుద్దేశముతో క్షేత్రముల సిద్ధపఱుచు కొనువారు రెండు సంవత్సరముల పర్యంతమును బన్ను చెల్లించవలదనియుఁ జేయఁబడిన నియమములు పన్నుగ్రహించుటలో రాజునకుఁ గల దూరదృష్టిని వేనోళ్లఁ జాటుచున్నవి.



ఇంతవఱకు వ్రాయఁబడిన తరములు 'ఉదకభాగములని' పేర్కొనఁ బడినవి. అనఁగా నివి పల్లపు భూములమీఁది తరములని యర్థము. మెట్టభూముల పై విధింపఁబడుచుండిన తరములను గుఱించి కనుగొనుటకు ఆధారమెద్దియుఁ గానరాదు.

రాజునకు స్వంతమాన్యము లనేకము లుండెడివి. వానినాతఁడు 'సీతాధ్యక్షుఁ'డనునధికారి మూలమున సాగు చేయించుచుండువాఁడు. ఈయధికారి 'కృషితంత్రగుల్మ వృక్షాయుర్వేదజ్ఞుఁడుగ' నుండును. అతఁడు రాజుగారి క్షేత్రములకు వలయు బీజాదికములను సంపాదించి తత్తచ్ఛాస్త్రములఁ బ్రవీణులగు క్రింది యధికారుల సాయముం గొని దాసులను కూలివారలను ఖయిదీలను వినియోగించుకొని రాజుగారి సేద్యమును సాగించును. అందులకు నవసరమగు నుపకరణముల సిద్ధము చేయించుటయు నతని పనియె. అతఁడు సూర్యచంద్రాదులయు నక్షత్రములయు గతులను గమనించి కాల వైపరీత్యములఁ దెలియఁజేయుచుండినట్లును వాయువులను మేఘములను బరిశీలించి వర్షముల న్యూనాధిక్యము నెఱిఁగించుచుండినట్లును వర్షమాపక యంత్రముల సాహాయ్యంబున 'ద్రోణ' మను పరిమాణము నుపయోగించి వర్షపాతమును లెక్కించుచుండినట్లును గానవచ్చుచున్నది. ఎఱువుల నుపయోగించు పద్ధతులు గూడ నాతఁడే నియమించుచుండినట్లు తెలియుచున్నది. ఈవిధమున కాలవైపరీత్యములను గనిపట్టి వర్షముల న్యూనాధిక్యము నెఱిం

గించి వర్షపాతమును లెక్కించి యెఱువుల సారాసారంబుల నిర్ణయించి సీతాధ్యక్షుఁడు తనశాఖలోని యితరాధికారుల తోడంగూడ రైతులకు సాయపడుచుండెడి[1]వాఁడు

చంద్రగుప్తుని కాలమున గోఽధ్యక్షుఁడను అధికారి యొక్కరుఁ డుండును. అతఁడు రాజుగారి గోవులు మున్నగు పశువుల కన్నిటికిని పాలకుఁడు. ఆపశువులకువలయు నుపచారములు చేయించి వానివలన వచ్చు నాదాయము నతఁడు రాజుగారి బొక్కసమునకుఁ జేర్చుచుండును. వేనవేలు పశువులు రాజుగారి కుండుటంబట్టి యీయాదాయము కొలఁదిపాటియనుటకు వీలు లేదు.

రాజునకు వరుంబడి నీనుటలో సాగుబడి భూములకు రెండవది దేశములోని వ్యాపారసముదాయము.

చంద్రగుప్తుని కాలమున నెల్ల వ్యాపారమును కోటగుమ్మమునఁ గట్టఁబడిన సుంకపుకొట్టుకడనే జరుగవలసియుండెను. ఇతర స్థలముల వ్యాపారము జరుపుట నిషేధింపఁబడియుండెను. వ్యాపారమునకయి రైతులును వ్యాపారస్థులును దెచ్చిన వస్తుసముదాయము సుంకము కొట్టుకడ నమ్మఁబడిన తరువాత అమ్మకపు మొత్తమును బట్టి సుంకము వసూలు చేయఁబడుచుండెను. రైతులు గాని వస్తునిర్మాతలుగాని వస్తు

1. ప్రస్తుతము అగ్రికల్చరు డిపార్టుమెంటు వారీపనియే చేయుచున్నారు.



సముదాయములు ఒక స్థలమునుండి మఱియొక స్థలమునకు మార్చుకొనుచో సుంకపుకొట్టుదారిని రావలసివచ్చినను వారు సుంకమీయ నవసరము లేకుండెను. వివాహార్థమును, రాజున కర్పించుటకును, రాజుగారి భాండారములఁ జేర్చుటకును, మతోపయోగమునకును, ప్రసవించు స్త్రీలకొఱకును, ప్రయోజనముల కొఱకును గొనిపోఁబడు సామగ్రి సుంకములేక తీసికొనిపోఁబడుచుండెను. సుంకపుతరము వస్తువువెలయందు ఇరువదియైదవవంతు మొదలు ఐదవవంతువఱకును గలదు. సుంకపునిబంధనలను మీఱువారికి నేరము ననుసరించి 3000 పణములవఱకును (అనఁగా, ప్రస్తుతపు 2000 రూపాయలు) అపరాధము విధింపఁబడుచుండెను. ఈవిధముగను రాజుగారి బొక్కసమునకు విశేషద్రవ్యము చేరుచుండెను.

విదేశములనుండి దిగుమతియగు సామగ్రిపయి వ్యాపారసుంకముగాక రాజుగారికి మఱియొక విధమగు సుంకము చెల్లుచుండెడిది. మొత్తముమీఁద దిగుమతియగు వస్తువులకుఁ బ్రబలతమమగు పన్ను విధింపఁబడుచుండెను. (1) 'శుల్క' మనఁబడు వ్యాపారసుంకమును (2) 'వర్తని' యనబడు మార్గసుంకమును[1] 'గుల్మదేయ' మనఁబడు సైనిక సుంకమును (4) 'భాగ' మనఁ

1. ఇది మఱియొక రాజ్యమునుండి తన రాజ్యమునకు వచ్చు వస్తువుల మీఁద రాజు విధియించు సుంకము.

బడు దిగుమతి సుంకమును సర్వసాధారణముగ దిగుమతి వస్తువులకుఁ దప్పినవి కావు.

ఇప్పగిది సార్వభౌమునకు నెగుమతి దిగుమతులవలన సుంకముల రూపమున నాదాయ ముండెడిది.

ఆకాలమున కొలతపాత్రలును తులాయంత్రములును ప్రభుత్వమువారే సిద్ధపఱచి యమ్ముచుందురు. వ్యాపారులు వానిని కొనుటయేగాక ప్రతిదినమును వానిపరిమాణము సరియయినదని నిర్ణయముద్ర వైచుటకు ప్రభుత్వమువారికి కొద్దిపాటి రుసుము చెల్లించుచుందురు. వ్యాపారస్థులు ప్రజల నేమాత్రము ఏమఱుచుటకుఁ బ్రయత్నించినను నపరాధులుగ నెన్నఁబడి జరిమానాలతో శిక్షింపఁ బడుచుండిరి.

ఇప్పటి వలెనే చంద్రగుప్తునికాలమునందుఁగూడ 'ఉప్పు' చేయుట అమ్ముట ప్రభుత్వమువారి హక్కేయయి యుండెను. వారు స్వదేశమున స్వంతముగ నుప్పు పండించుటయుఁ గలదు. ఒక్కొకతఱి నా స్వాతంత్ర్యము కౌలుదారులకు గుత్తకిచ్చుటయును గలదు. స్వదేశమునం దుత్పత్తియగుచుండిన యుప్పుగాక విదేశములనుండియు దిగుమతియగు చుండెడిది. అందలి వ్యాపారమును ప్రభుత్వము వారిదే యయి యుండెను.

సురాలోలు లిక్కాలమునందుం బలె నక్కాలమునను ప్రభుత్వము వారికి ద్రవ్యము నీనుచుండిరి. కాని అప్పుడు త్రా



గుడునకయి సర్వస్వము పోఁగొట్టుకొనుట తటస్థింపకుండుటకొఱకు కొన్ని నిబంధనలేర్పడియుండెను. నిర్ణయింపఁబడిన పరిమితికెక్కుడుగ నెవ్వరికిని హాలారసంబు విక్రేత లమ్ముటలేదు. వెలకును హద్దు లునుపఁబడియుండెను. త్రాగి మైమఱచి పడిపోయిన వారి శరీరముపైనుండు సొత్తును గాపాడుటకు నుచితమగు విధులు వియమితమయి యుండెను. విదేశపుసారాయిలపై సాధారణ సుంకములుగాక 100 కి 5 వంతున పన్నులు విధింపఁబడుచుండెను. సురామందిరములను గుఱించిన శాసనములలో, ఆ మందిరములు సౌకర్యములైన పెక్కుగదులుండునట్లును, ఒక్కొక్క గదియందు వలసినన్ని మంచములును కుర్చీలు నుండునట్లును, ఆయాఋతువులకు ఆవశ్యకములైన యనుకూలము లన్నియు పొసఁగియుండునట్లును, నిరంతరము పుష్పహారములతోను అగరు చందనాది పరిమళద్రవ్యములతోను నిండుకొనియుండునట్లును, అలంకరించియుండ వలెనని విధింపఁబడియున్నది. దీనినిఁబట్టి కొందఱు చరిత్రకారులు ఆకాలమున త్రాగుబోతుతన మెక్కుడుగ నుండెనని యూహించుచున్నారు. కాని మొదట వ్రాసిన నిబంధనలను జాగరూకతతో పరిశీలించిన యెడల నీయలంకారాదులు త్రాగనేగు స్వల్పసంఖ్యా జనులయారోగ్యముకొఱకును పరిసరప్రదేశస్థులకు సుగుమప్రసారమాపాదింప నుండుటకును విధింపఁబడెనని తోఁచక మానదు. కొలతపాత్రలును తూనికయంత్రములును ప్రభుత్వము వారి వలననే చేసి యమ్మఁబడు చుండెనని ఇదివఱకు వ్రాసి

యున్నారము. దానినిఁబట్టి 'యిండియన్ అంటిక్వేరి' సంపాదకులు ఆకాలమున నాణెములు బహుస్వల్పముగ నుపయోగింపఁ బడుచుండెననియు వ్యాపారమంతయును వస్తుగ్రహణప్రతిగ్రహణమువలననే జరుగుచుండెననియు వ్రాసియున్నారు. కావున నా కాలమునందు నాణెముల వలన రాజునకు నెక్కుడుగ లాభము గలుగుచుండెనని చెప్పుటకు వీలులేదు. అయినను నక్కాలపు నాణెములును వానియందలి లోహవిశేషంబును ప్రస్తుతపు నాణెములతోటి సామ్యమును మా చదువరులు గ్రహించుటకయి యీక్రింది వివరణ పట్టిక నిచ్చుచున్నాము.

| నాణెముల పేళ్లు. | అందలి విశేష లోహములు. | వెల (గురిగింజలలో) |
|---|---|---|
| 1 పణము | $\frac{1}{16}$ రాగి; $\frac{1}{16}$ సీసము | = 80 గింజలు = $\frac{80}{122}$ తులములు = ఇంచుమించుగ నిప్పటి రూపాయిలో $\frac{2}{3}$ వంతు |
| 2 అర్ధపణము | ,, | =40 గింజలు, |
| 3 పాదము | ,, | =20 గింజలు, |
| 4 అష్టభాగము | ,, [హము | =10 గింజలు, |
| 1 మాషము | $\frac{1}{4}$ వంతు ఇతర లో | 5 గింజలు, |
| 2 అర్ధమాషము | ,, | $2\frac{1}{2}$ ,, |
| 3 కాకణి | ,, | $1\frac{1}{4}$ ,, |
| 4 అర్ధకాకణి | ,, | $\frac{5}{8}$ ,, |



పై వివరణపట్టిక యందుఁ గనినవిగాక అర్థశాస్త్రమునందు చాణక్యుఁడు మూఁడు బంగారు నాణెములను బేర్కొనియున్నాఁడు. 5 గింజల యెత్తుగలది మాషమనియు, 16 మాషముల యెత్తుది సువర్ణము లేక కర్షమనియు, నాలుగుకర్షముల యెత్తుది యొకపల మనియు వాడియున్నాఁడు. ఈ పరిమాణపరంపర తూనికమాత్రమునకయి యుండనోపునా? తూనికమాత్రమునకు సువర్ణపు దిమ్మెలు గావలెనా? చంద్రగుప్తుని కాలమున నియ్యవి వాడుకలోనుండిన బంగారునాణెములని చెప్పుటయే యుక్తియుక్తముగ నున్నది. అప్పటి కాలమున హిందూదేశము బంగారమునకుఁ బేరువడసియుండెను. మెగాస్తనీసు భరతవర్షమున సువర్ణమును త్రవ్వుటను గుఱించి చిత్రమయిన యీక్రిందికథను వ్రాసియున్నాఁడు.

తూర్పు సరిహద్దునందలి 70-80 మైళ్ల చుట్టుకొలతగల ఉచ్చభూప్రదేశమున భారతేయులలో నొక తెగ యగు 'దరదులు' అనువారు వసించుచున్నారు. అచ్చట భూగర్భమున బంగారుగనులు గలవు. అందువలననే సువర్ణమును త్రవ్వుచీమలును నచ్చటగలవు. అవి యడవినక్కలకు పరిమాణమునఁ దీసిపోవు. వాని త్వరితగమనము విభ్రమమును బుట్టించును. అవి వేటాడి జీవనము సలుపును. వానికి సువర్ణమును ద్రవ్వుటకు శిశిరఋతువు అనుకూలము. అవి బంగారుగనులనుండి ఆలోహమును ద్రవ్వి దానితోడం గూడినమట్టిని

అడవిఎలుక (Moles) వలె గనిద్వారమునఁ గుప్పలువైచును. అట్లు పడిన సువర్ణరజమును కరగించుటయే కర్తవ్యము. చుట్టు ప్రక్కలంగల జనులు మోతపశువులను గొనితెచ్చి దొంగతనముగా నామట్టిని మోసికొని పోవుచుందురు. వారు ఎఱుకపడునట్లు వచ్చినచో నచ్చటి యద్భుతమగుఁ జీమలు వారినెదిర్చి పారిపోనీక వెన్నంటి వారిని వారిపశువులను జంపివేయును. కావున వారచ్చటచ్చట వివిధములగు మాంసఖండములనువైచి యా చీమలు వానిని భక్షించుటయందే మఱియుండ బంగారుపొడిని యపహరింతురు. ఆరజమును గరగించు పద్ధతులు తెలియవుగాన వారితరుల కమ్ముచుందురు. "[1]

పైసంగతు లత్యద్భుతముగఁ గన్పించినను నందు సత్యము లేకపోలేదు. త్రవ్వుచుండినది చీమలుగావు. కాని టిబెట్టు దేశపుఖనక్రియాదక్షు లక్కార్యములను దీర్చుచుండిరి. వారి యుపకరణాదులనుబట్టియు వారిపద్ధతులను బట్టియు నభ్యాసములనుబట్టియుఁ బైకథపుట్టియుండుననని నిర్ణయింపఁబడియున్నది.

ఏదియెట్లైనను బూర్వము హిందూదేశమున భీమ్మలు బంగారపు పుట్టలఁ బెట్టుచున్న వన్నను బయటిదేశములవారలు నమ్ముచుండెడివారు. అట్టికాలమున బంగారపు నాణెము లుండె

1. మాక్రిండల్ మెగాస్తనీసు. పే 94. ఈకథ మెగాస్తనీసుకు ముం[illegible] చెప్పుకొని యున్నారు.



నని చెప్పుటకు వేరు యుక్తులుగావలెనా? ఒకవేళ బంగారపు తూనిక దిమ్మెలును నుపయోగించుచుండిరేమొ.[1]

నాణెములకథ యింతటితోఁ జాలింతము. ఇదివఱకుఁ జేర్కొనిన మార్గములేగాక రాజునకు నాదాయము నిచ్చు మార్గము లింకను ననేకము లుండెడివి. వాని విస్తారవివరణ మిట యనవసరము

సామంతప్రభువులు గొనితెచ్చియిచ్చు కప్పములును, గ్రామరక్షక సంఘములు వసూలుచేయు నపరాధములును, ఖయిదీలను విడిపింప నియ్యఁబడుచుండిన ధనమును అభిజ్ఞాన పత్రముల విలువయు, అవసరమగు నెడల దేవాలయములలోని ద్రవ్యమును, ఓడలమీఁది పన్నులును, బాటతీరువలును, గనుల తీరువలును, అడవి ద్రవ్యముల మీఁది సుంకములును, జరిమానాలును రాజుగారి బొక్కసమునకుఁ జేరుచుండెడివి.

## జనాభా లెక్కలు.

నాగరకునకును గోపునకును నియమింపఁబడిన కర్తవ్యములలో జనాభా లెక్క యెప్పటికప్పుడు వ్రాయుట యొక్కటి యయి యుండెను. తమ గ్రామము నందలి ప్రతివ్యక్తియొక్క తెగ, జాతి, పేరు, ఇంటిపేరు, వృత్తి, వరుంబడి, వ్యయము,

1. ఇండియను ఆంటిక్వెరి. సంపుటము. 4-పే. 225.

పశుగణములు వీరు లిఖించి పెట్టుచుండిరి. బయటి వారెవరైనను వచ్చినప్పుడు వారిని గుఱించి తెలిసికొని వ్రాసి పెట్టవలసినదనియు నట్టి వారుగాని మఱియెవ్వరుగాని తప్పు సంగతులు నుడివిన యెడల శిక్షకుఁ బాత్రులగుదురనియు నున్నది. ఇంతకంటె విశేషమగు జనాభాలెక్క లేల కావలెను?

## బాటలు - వాహనములు.

చంద్రగుప్తుని రాజ్యము ఇప్పటి భరతఖండమున కంటె విస్తీర్ణమున ఎక్కుడయినదని ఇదివఱకే వ్రాసి యున్నాము. ఇంతటి రాజ్యములో నెక్కడభాగమునుండి మఱియొక భాగమునకుఁ బ్రయాణాదులు సలుపుటకు సదుపాయములు పుష్కలముగ నుండెను.

పలువిధములగు బాటలు వర్ణింపఁబడినవి. వాని వెడల్పు వానివాని యుపయోగములనుబట్టి 32 అడుగులు మొదలు నాలుగడుగుల వఱకు నుండెడివి. ఉపయోగమును బట్టియు గమ్యస్థాన విశేషమును బట్టియు నీ బాటలకుఁ బేరు లమరియుండెను. రాజమార్గము లనియు, రథపథము లనియు, పశుపథము లనియు, ఖరోష్ట్రపథము లనియు, చక్రపథము లనియు, మనుష్యపథములనియు, అంసపథములనియు, వరుసగ రాజులు, రథములు, పశువులు, ఖరోష్ట్రములు, శకటములు, సాధారణ ప్రయాణికులు, బరువులుమోసికొని పోవువారును ఉపయో



గించు కొనుట వలన వచ్చిన పేళ్లు. రాష్ట్రపథములనియు, వివీతపథములనియు, ద్రోణముఖపథములనియు, స్థానీయపథములనియు, సయోనీయపథములనియు, వ్యూహపథములనియు, శ్మశానపథములనియు, గ్రామపథములనియు, వనపథములనియు, హస్తిక్షేత్రపథములనియు, సేతుపథములనియు, నాయాగమ్యస్థానములనుబట్టి వచ్చిన నామధేయములు.

ఇవిగాక కోటలయందు విశేషమార్గము లుండెడివి. వాని నిటఁ బేర్కొనఁ బనిలేదు.

ఈ బాటలెల్లయును బహుజాగరూకతతోఁ గాపాడఁబడుచుండెను. వీనిపై ప్రయాణికుల కభ్యంతరము గలుగఁజేసిన వారు దండింపఁ బడుచుందురు. ఇందు దక్షిణదేశమునకుఁ బోవుచుండిన బాటల వలన వజ్రములు, ముత్యములు, రత్నములు, బంగారు, శంఖములు మున్నగు వస్తువుల వ్యాపారము మిక్కుటముగ జరుగుచుండినందున నామార్గములకే చాణక్యుఁడు ప్రాముఖ్యత నిచ్చియున్నాఁడు. అన్నిమార్గముల మూలమునను జక్కని వ్యాపారము జరుగుచుండె ననుటకు సందియము లేదు. ఇంతియగాక ఈ మార్గము లింకొకవిధమునఁ గూడ నుపయోగించు కొనఁబడుచుండెను. అతివిస్తారంబగు నారాజ్యమున సమయోచితంబుగ దండులను మందుగుంపు సామగ్రిని దూతలను పనిచి రాజకీయ కార్యములను జక్కపెట్టు కొనుటకుఁ జక్రవర్తికీ మార్గములెంతయుఁ దోడ్పడు చుండెడివి.

ఇట్టి మార్గముల నిరంతరమును బ్రయాణము సలుపుచుండిన వాహనసాధనములను గుఱించి యోజింతము. అందు రథములు మొదటివి. సైన్యమును గుఱించి వ్రాయునప్పుడు రథాధ్యక్షుఁ డొక్కఁడుండెనని వ్రాసితిమిగదా! దాని వలననే అప్పటికాలమున రథము లెంత ముఖ్యవాహనము లయినదియు మాచదువరు లూహించు కొనఁగలరు. ఏడుజాతుల రథములుండెడివి. ఎత్తునందు పదియడుగులు గలవి యున్నతతములు. అట్లే వెడల్పునందుఁ బండ్రెండడుగుల వఱకుం గలవు. దేవరథములనియు, పుష్పరథములనియు, సాంగ్రామికరథములనియు, పారియానిక రథములనియు, [1] పరపురాభియానికములనియు [2] వైనయికములనియు, [3] రథములలో ఉపయోగము ననుసరించి విభేదము లుండెడివి.

రథములకుఁ దరువాత లఘుయానము, గోలింగము, శకటము నాఁబరగు బండ్లు ముఖ్యసాధనములు ఇవ్వియే సర్వసాధారణముగ నుపయోగింపఁ బడుచుండెడివి. వీనిని రథములను లాగుటకు ఒంటెలును, ఎద్దును, గుఱ్ఱములును వాడఁబడుచుండెను. బండ్లు నడపువానికి చక్రచరుఁడని పేరు.

---

1. సాధారణప్రయాణముల కుపయోగ పడునవి.
2. పరరాజుల పై దండు వెడలునప్పు డుపయోగ పడునవి.
3. అభ్యాసమున కుపయోగింపఁ బడునవి.



శివికములును పీఠికములును ననంబడు పల్లకీలును నక్కాలమున నుండెడివి.

ఇన్ని తెఱంగులగు వాహనముల ప్రయాణంబున కాకరమగు మార్గముల పథికులకు నపాయములు గలుగకుండుటకుఁ దగిన నిబంధన లేర్పఱుపఁబడి యుండెను. వాని వివరణ యనవసరము.

ప్రయాణికుల సౌకర్యార్థము మార్గముల కిరుప్రక్కలను చెట్లవరుసలు పెంచఁబడుచుండెను. అచ్చటచ్చట నీటి వసతు లేర్పఱుపఁబడియుండెను. పూటకూలి యిండ్లును విశ్రమాలయములును బొడగట్టుచుండెను.

ఇదివఱకు వ్రాయఁబడిన దంతయును భూమార్గములను గుఱించియే. నీటిబాటలును చంద్రగుప్తునికాలమున సుప్రసిద్ధములయి దూరభాగముల నొండొంటితోఁ జేర్చి భూమార్గముల వలెనే పాటలీపుత్ర సామ్రాజ్యమునకుఁ బఱుత్వ మొసంగుటయే గాక లోకమునందలి యితర రాజ్యములతోడను అందలి ప్రజలతోడను భారతేయులకు వ్యాపార సంబంధములు కల్గించి గౌరవైశ్వర్యంబుల సమకూర్చుచుండెను. నీటిబాటలలో ననేక విభేదము లెన్నఁబడినవి. సాధారణ నదీనదములకును కాలువలకును 'కుల్యామార్గము'లనియు సామ్రాజ్యములోని రేవులొండొంటికిని గల తీరమార్గములకు 'కూలపథము'లనియు విదేశములతో సంబంధము గలుపుచుండిన నిండు సముద్రమార్గ

ములకు 'సంయానపథ'ములనియుఁ బేళ్లుగలవు. ఈనీటి బాటల కర్హమగు నావ లనేక తరములవి యుండెడివి. సంయాత్యనావలును ప్రవహణములును సముద్రముమీఁద ప్రయాణికుల కుపయోగపడునవి. శంఖముక్తాగ్రాహిణనావలు పేరే ప్రకటించునట్లు సాగరమునందు ముత్తెముల నేరి తెచ్చుటకుఁ బయనమగునవి. మహానావలు మహానదులయం దుపయోగపడునవి. క్షుద్రనావలును తెప్పలును బుట్టలును (హరగోలు), ప్లవములును మున్నగు నీటిని దాఁటించుసాధనములకు లెక్కలేకుండెను.

నావలలోని యధికారులును, సేవకులును, వారివారి కర్తవ్యములును విస్తారముగ వర్ణితములయి యున్నవి. కావున నావికాయాన మప్పుడు పూర్ణస్థితియం దుండెనని చెప్పనొప్పును.

వ్యాపారము—చేతిపనులు.

ఇట్టిబాట లుండుటవలనఁ జంద్రగుప్తునికాలమున వ్యాపారము అతివిస్తారముగ జరుగుచుండెను. మధుర[1], అపరాంత[2], కళింగ, కాశి, వంగ, వత్స[3], మహిష[4] దేశములు సుందరతమమగు ప్రత్తి వస్త్రములఁ బంపుచుండెను. ముత్య

1 దక్షిణమధుర.
2 కొంకణము.
3 కౌశాంబి.
4 మాహిష్మతి. కొందఱిమతంబున మైసూరు.
} అర్థశాస్త్ర సం. 2, అ 11.



ములు పారశీకము నుండియు బర్బరమునుండియు; వాసనద్రవ్యములు కామరూపము[1] నుండియు, సింహళమునుండియు; తోళ్లు హిమాలయ పర్వతములమీఁది మ్లేచ్ఛగ్రామముల నుండియు; 'కాలేయక' మనుగంధపుచెక్క స్వర్ణభూమి యనఁబడు బర్మా నుండియు; పట్టుగుడ్డలు చీనానుండియు; అగరు సముద్రమున కావలనుండియు వచ్చుచుండెను. క్రీ. పూ. ఆరవ శతాబ్దమున భరతవర్షపుఁ బశ్చిమతీరమందలి వణిక్కులు బాబిలోను రాజ్యముతో వ్యాపారాదులు సలుపుచుండి రనుటకు నిదర్శనములు గలవని బ్యూలరుపండితుఁడు వ్రాయుచున్నాఁడు. ఇదియును చంద్రగుప్త చక్రవర్తి కాలమునకు సంబంధించినదగుటవలన పైజాబితాలఁతోడంజేర్చిన నప్పటి వ్యాపారపరిమితి యపారమని వెల్లడి సేయుచున్నది.

సర్వసాధారణముగ వ్యాపారము వెంటన చేతిపను లభివృద్ధి యందుచుండును. అవ్వానియవస్థను గుఱించి విశేషము వ్రాయుటకు విపులాధారములు లేవు. సూత్రాధ్యక్షుఁడను అధికారి పొడగట్టుటవలనను అతఁడు నేతపనిని చూచుకొనుటకు మాత్రమే నియోగింపఁబడి యుండుటవలనను అప్పని అక్కాలమున విస్తారము జరుగుచుండెనని చెప్పవచ్చును. కుమ్మరము వడ్రంగము మున్నగు సాధారణపుఁ బనుల నిట వక్కాణించుటే యనవసరము. అర్థశాస్త్రము నందలి యొకానొక ఘట్టములోని

1 అసాము.

వ్రాతనుబట్టిచూడ నాకాలమున గాజుపని జరుగుచుండినట్లును అది నాణ్యపుబనులలో నొక్కటిగ నెన్నఁబడుచుండి నట్లును గానవచ్చుచున్నది. [1]

## న్యాయవిచారణ.

"హిందువులు సొమ్మును వడ్డికిచ్చుటలేదు. అప్పుపుచ్చు కొనుటయు నెఱుంగరు. ఒరులకు గీడొనరించుటకాని, ఒరుల వలన గీడొందుటకాని ప్రాచీనాచారమునకు విరుద్ధము. కావున సమ్మతి పత్రములుగాని తాకట్టులుగాని దొరకవు. ఒకవేళ ఋణ మిచ్చియున్నను ధనము నిక్షేపించియున్నను, దానిని ఋణగ్రస్తుని వలనగాని ధనగోప్తవలనగాని తిరిగి రాఁబట్టుటకు శాసన సాహా య్యము లేదు. కావున ఋణదాతగాని ధననిక్షేపిగాని విశ్వసించిన వాఁడు మోసకాఁడయినయెడ, నందునకుఁ దన్నుదా దూఱు లాడుకొనుటకంటె నితరోపాయముగానఁడు." అని మెగాస్తనీసు వ్రాసియున్నాఁడు. ఈవాక్యములు స్థూలదృష్టితో వ్రాయఁ బడినవనియు వానివలన నప్పటి యమాయకస్థితి నిరూపింపఁ బడుచున్నదనియు మాత్రము చెప్పవలసి యున్నది. పైనివర్ణిత మయిన వ్యాపారాదుల పరిమాణమునుబట్టి చూచినను చాణక్యుని అర్థశాస్త్రమునుబట్టి చూచినను అక్కాలమున న్యాయ స్థానపరంపరయుఁ దదుచితచట్ట సముదాయంబును నుండెనని వ్యక్తమగుచున్నది.

1. ఇండియన్ ఆంటిక్వెరి సం. 34. పే. 116



ప్రతిగ్రామికుఁడును, అనఁగా గ్రామాధికారియు, గ్రామ వృద్ధులతోడం గూడ ననఁగా గ్రామ పంచాయతితోడం గూడ ప్రథమన్యాయస్థానంబై యలరారుచుండు. కొన్ని వ్యాయోగ ములనీ న్యాయస్థానము వారికి సంపూర్ణాధికార ముండెడిది. దొంగలను దుర్మార్గులను గ్రామికుఁడు దన గ్రామమునుండి వెడలఁగొట్టుటకును స్వతంత్రుఁడయి యుండెను. ఇతనిది మొదటి న్యాయస్థానము. రాజుగారిది ఉత్తమన్యాయస్థానము. ఈరెంటికిని మధ్య స్థానము వహించి దేశమునందలి న్యాయ విచారణయంతయు నడపు న్యాయస్థానములు పెక్కులుండెడివి. ధర్మస్థీయములనియు కంటకశోధనములనియు నవిరెండు తెఱం గులుగ విభజింపఁబడియుండె. ఈవిభాగమునకుఁ గారణము వ్యాయోగ విశేషంబె.

ధర్మస్థీయములు ఆఱుగురు న్యాయాధిపతుల సంఘ ములు. అందుమువ్వురు శాస్త్రాధ్యయన పారీణులై ధర్మస్థులు నాఁ బరగుచుండ్రు. తక్కుంగల మువ్వురును రాజుగారి యమాత్యులలోనివారు. వీరు లోకానుభవము గల వారగుటం జేసి శాస్త్రవేత్తలకు సహకారులయి న్యాయము దీర్చుచుం దురు. ధర్మస్థీయన్యాయ సంఘముల మ్రోల విచారింపఁబడు చుండిన విషయములు సర్వసాధారణములు. ప్రజలలో నొండొ రులకుం గల సామాన్య సంబంధ విషయక వివాదములును స్వల్ప ప్రజాసంఘంబు లొండొంటికిం గల సామాన్య సంబంధ

విషయక వివాదములును ఈ ధర్మస్థీయములు దీర్చుచుండెడివి.[1] వీనికి కొద్దిపాటి జరిమానాలు విధించుటకంటె నెక్కుడధికారము లేదు.

కంటకశోధన న్యాయసంఘముల మువ్వురు అమాత్యులు మువ్వురు ప్రదేష్టారులును అధికారులు. అమాత్యులు లోకానుభవాదులు గల మంత్రి వర్గములోని వారని యిదివఱకే వ్రాయఁబడియె. స్థానికులయి విషయములను జక్కఁగ విమర్శించి కనుగొనుటకు యోగ్యత గల యధికారులు మువ్వురకును ప్రదేష్టారులని పేరు. వీరు ఏయభియోగము వచ్చినను దానికి వలయు నుపక్రమ ప్రయత్నములను బరీక్షలను జేసి అమాత్యులకు సాయ పడుచుండెడివారు. రాజునకును రాజ్యమునకును సంబంధించిన నేరములును ప్రజోపద్రవ కరములగు నేరములును హత్యేత్యాది ఘనదోషములును బహుజనసంబంధ

1 వ్యవహారస్థాపనలు, సమయావిచ్ఛేదాదులు, స్వామ్యాధికారంభృత్యాధికారములు, దాసకల్పనలు, ఋణములు, ఔపనిధికములు, విక్రీత క్రీతానుశయములు, దానములు, సాహసములు, దండపారుష్య వాక్పారుష్యములు, అస్వామి విక్రయములు, స్వస్వామిసంబంధములు, సీమావివాదములు, మర్యాదాస్థాపనములు, వాస్తుకములు, వాస్తువిక్రయములు, వివీతక్షేత్రపథహింసాదికములు, బాధాబాధికములు, వివాహ ధర్మములు, వివాహసంయుక్తములు, స్త్రీధన కల్పనలు, సంభూయసముద్ధానములు, దాయవిభాగదాయక్రమములు మున్నగునవి ధర్మస్థీయములకు విషయములని అర్థశాస్త్రమున వర్ణింపఁబడినవి.



కములును నీకంటక శోధనములకు విషయములు.[1] ఉరిశిక్షనిచ్చుటకుఁ గూడ వీని కధికారము గలదు.

పైరెండు తెఱంగుల న్యాయసంఘములును సంగ్రహణములందును అనఁగా మన తాలూకాపట్టణమువంటి పట్టణములందును నాలుగువాదల గ్రామములకు ముఖ్యపట్టణములగు ద్రోణముఖములందును 800 కు ముఖ్యములగు స్థానీయములందును ప్రతి జనపథసంధి యందును అనఁగా రెండుమూఁడు మండలముల పొలిమేరలు కలియు పట్టులందును నిర్ణీతకాలమున చేరి న్యాయము తీర్చుచుండెను.

ఈన్యాయసంఘములకు ననుసరణీయమైన సాధనములు నాల్గు విధములు. మొదటిది; ధర్మము. ఇది శాస్త్రిచోదితము. వ్యాఖ్యాన భేదమున్నపుడే దప్ప ఇదియనుల్లంఘనీయము. రెండవది; వ్యవహారము. వ్యాజ్యేదారులు తత్పూర్వము చేసికొనిన యొడంబడికలు మున్నగు నుపకరణములును సాక్షుల సాక్ష్యమును నిండిమిడియున్నవి. మూఁడవది; చరిత్ర. అనఁగా ఆచారాదుల ననుసరించి యేర్పడిన తీర్మాన సముదాయము. నాల్గవది; రాజ శాసనము. అనఁగా రాజులు పరంపరగ నేర్పఱచుచు

1 కారకరక్షణము, వైదేహరక్షణము, ఉపనిపాతప్రతీకారము, గూఢా జీవులనుండిరక్ష, ఉపకర్మాభిగ్రహము, ఆశు మృతక పరీక్ష, వాక్యకర్మాను యోగము, సర్వాధి కరణ రక్షణము, కన్యాప్రకర్మము మున్నగునవి కంటక శోధనములకు విషయంబులని అర్థశాస్త్రము తెలుపుచున్నది.

వచ్చిన చట్టములు. ఇందు కడపటిమూఁడు సాధనములును వరుస క్రమమున బలవత్తమ బలవత్తర బలవంతములు. అయిన నిందెద్ది యయిన ధర్మ విరుద్ధముగాఁ గాని న్యాయ విరుద్ధముగాఁ గాని ఉండినచో ననుసరణీయము.

సర్వ జనులకును సామాన్యముగఁ దెలిసిన ఈనాలుగు సాధనములు గాక న్యాయసంఘములకు మఱియొక సాధనముం డెడిది. అది వేగులవారి సమూహము. వారు దేశము నందలి ప్రతివిషయమును గని పెట్టిరాజునకుఁ దెలియఁ జేయుచుండుటే కాక యవసరమగు సంగతులను న్యాయ సంఘముల వారికిని తెలిపి న్యాయవిచారణకుఁ దోడ్పడ నేమింపఁబడిరి. కాని వారి వార్తలను మాత్రము న్యాయాధికారులు బహు జాగ్రత్తతోఁ బరీక్షింపుచుండిరి. ఇత రాధారము సంపూర్ణముగ నుండినపుడే తప్ప ఈసాధన ముపయోగింపు కొనఁ బడుచుండలేదు.

చంద్రగుప్తుని కాలపుఁ జట్టములు పరిపూర్ణత్వమున నిప్పటి చట్టములకుఁ దీసి పోవుటలేదు. భార్య మూర్ఖురాలయి నప్పుడు భర్త ఆమె నెంత వఱకుఁ బారుష్యముతోఁ జూడ వచ్చునో చెప్పి ఆమెను వెదురుబద్దతో నైనను త్రాటితో నైనను దన యఱచేత నైనను పురుషుఁడు మూఁడు దెబ్బల కంటె నెక్కుడు కొట్టినచో నేరస్థుఁడగునని వ్రాయఁబడి యున్నది. దీనిని బట్టి మా సిద్ధాంతము నిశ్చయమనుట తెల్లము కావున విశేష మిట వ్రాయుట యనవసరము.



### ఈతిబాధలు, వాని నివారణము.

అతివృష్టిరనావృష్టిః శలభా మూషకాః శుకాః
ప్రత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయః స్మృతాః॥

అని ఈతిబాధలు వర్ణింపఁబడినవి. వీనినుండి ప్రజలను సంరక్షించి పరిపాలించినవాఁడె ధర్మము నెరవేర్చిన రాజని మన శాస్త్రకారుల మతము. మిడుతలు, ఎలుకలు, చిలుకలు మున్నగునవి వేఁటలవలనను మందులవలనను ప్రాంతిక రాజులు యుద్ధమువలనను నివారింపఁబడుదురు. చంద్రగుప్తుఁడీ రెండుసాధనములును సంపూర్ణముగఁ గలవాఁడని అతనిచరిత్ర మొదటినుండి చదివినవారందఱకు విదితంబె. అక్కాలమున గృహములు సర్వసాధారణముగఁ గలపచేఁ గట్టఁబడుచుండి నందున నతివృష్టిబాధయందొక యంశమునకుఁ బ్రతీకారము గాన వచ్చుచున్నది. కాని యతివృష్టివలనను ననావృష్టివలనను గలుగు గొప్పబాధలు క్షామములును తత్ఫలంబుగ జాడ్యములును. ఇవిగాక పైశ్లోకమున నుడువఁబడని మఱియొక దేశోపద్రవ కారణంబును గలదు. అది యగ్ని. ఈ మూఁడు బాధలను నివారించుటకుఁ దరతరములుగ నన్ని ప్రభుత్వములవారును బాటుపడుచు వచ్చుచునే యున్నారు. చంద్రగుప్తుని కాలమున నతఁడెట్లు ప్రవర్తించినదియు నిట వివరించుట కర్తవ్యము.

మెగాస్తనీసు వ్రాఁతలననుసరించి యక్కాలమున సర్వసాధారణముగ చంద్రగుప్తుని సామ్రాజ్యము సుభిక్షముగ నుండెననియే చెప్పవలసి యున్నది. కాని అర్థశాస్త్రమున దుర్భిక్షముల సంగతి తడవి తత్ప్రతీకార పద్ధతులు వాకొనఁబడి యుండుటచే క్షామమేదో యొకప్పుడు తటస్థించినను దటస్థించి యుండవచ్చును.

కోష్టాగారాధ్యక్షుఁ[1]డను అధికారి యొక్కరుఁడుండును. అతఁడు రాజునకయి వసూలగు సర్వసస్యాదులును పోగుచేసి కాపాడెడువాఁడు. అట్లుపోగైన భోజనసామగ్రియందు రాజెప్పుడును సగపాలుకంటె నెక్కుడుపయోగింపరాదు. తక్కుంగల యర్థభాగంబును ప్రజల యవసరముల కొఱకు తీసియుంచుచుండిరి. ధాన్యాదులు చెడిపోకుండుటకయి ప్రతిసంవత్సరమును అదివఱకుఁ జేరినరాసుల నితరులకిచ్చి క్రొత్తపంటల ఫలంబునుండి బదులుకొనుచుందురు. ఇట్లు సేకరింపఁబడిన సామగ్రిగలవాఁడగుట క్షామకాలమున రాజు ప్రజలకు భోజనమునకును విత్తనములకును ధాన్యము పంచిపెట్టుచుండు వాఁడు. ధనవంతులగు పౌరులనుండియు ఇతరరాజులనుండియు ధనము సంపాదించి క్షామనివారణార్థ ముపయోగించు చుండువాఁడు.

1. కోష్టమనగా జీర్ణకోశము. దానినుండి దేహపోషణమునకు వలసిన వస్తువులని విశేషార్థము. అట్టివస్తువుల కొట్టుగావున కోష్టాగారము. అర్థశాస్త్రము. సం 2 అ 15.



మనప్రభుత్వము వారింబలె దుర్భిక్షసమయములఁ జంద్రగుప్తుఁడు గొప్ప తోటలువేయించుట చెఱువులు కాలువలు త్రవ్వించుట మొదలగు పనులుచేయించుచుండినట్లును తెలియవచ్చుచున్నది.

క్షామములు ప్రతిదినప్రవర్ధమానములుగాక ఎప్పుడో యొకప్పుడు తటస్థించుచుండినందునను తన యాదాయమున నర్థభాగము దన్నివారణార్థము వినియోగించుటకు సార్వభౌముఁడు సన్నద్ధుఁడయి యుండుటనుబట్టియు నక్కాలమునఁ బ్రజలు క్షామమనిన వెఱపు లేనివారయియే యుండియుందురనిన ననృతముగానేరదు.

జాడ్యముల నివారణార్థము చంద్రగుప్తుఁడు పూర్ణమగు నేర్పాటులఁ జేసియుండె ననుటకు సందేహములేదు. ఏనుఁగులకును గుఱ్ఱములకును జికిత్సకుల నేర్పఱచినవాఁడు ఇక్కాలమునను అరుదుగ గన్పట్టు ధాత్రికలను సైన్యముల కమర్చినవాఁడు నైన సార్వభౌమునకు ప్రజల యారోగ్యమునెడ దృష్టి నిలువకున్నె? మెగాస్తనీసు పాటలీపుత్ర పరిపాలనమునకు నేర్పడిన యాఱుపంచాయతులలో నన్యదేశీయులఁ గాపాడు పంచాయతిని గుఱించి వ్రాయుచు "జబ్బుగానున్న వారికి వలయు నుపచారముల జాగరూకులయి యొనర్చుట" యని వ్రాసి యున్నాఁడు. దీనివలన నాపంచాయతికిలోఁబడి వైద్యులు

తత్తదుచితోపకరణములం గొని సిద్ధముగ నుండుచుండిరని యర్థము. వారణాసియు తక్షశిలానగరంబును విద్యాపీఠములయి విలసిల్లి వైద్యశాస్త్రప్రవీణులను దేశమునకు సమర్పించుచుండెనని యిదివఱకే వ్రాసియున్నాము. అలకసుందరుఁడు (అలెగ్జాండరు) ఈదేశముపై దండెత్తి వచ్చునెడ గ్రీకుదేశీయులగు తన భిషజ్ఞులను వెంటఁ గొనివచ్చెను. పాంచాలదేశమునం దతఁడుండ నాతని సైనికులకు పాముకాటులు తప్పినవిగావు. ఆ యపాయకరమగు నుపద్రవమునుండి గ్రీకువైద్యులు దమ వారిని రక్షించుకొను మార్గము గానలేకుండిరి. అప్పుడు అలకసుందరుఁడు హైందవవైద్యులసాయము వేఁడ వారు తక్షణము వ్యాళవిషానలంబునుండి గ్రీకులను దప్పించిరి. దానిచే నాతఁడు నివ్వెరగంది హైందవవైద్యుల శక్తిసామర్థ్యంబులమెచ్చి తన సైనికుల కపాయకరమగు ఋజలు సంభవించినపుడెల్లను మనవైద్యులకడకే ఏగవలయునని యాజ్ఞాపించెను.[1] గ్రీకుచరిత్రకారుఁడు వ్రాసినయీవ్రాఁతను బట్టిచూడ గ్రీకువైద్యులకంటె హైందవ వైద్యులే అక్కాలమున నెక్కుడు విజ్ఞానము గలవారయి యుండిరనుట విస్పష్టము.

చంద్రగుప్తుని కాలమున భిషజులనియు, చికిత్సకులనియు, జాంగలీవిదులనియు, సూతికాచికిత్సకులనియు వైద్యులు వారి వారి యభిమాన వైద్యశాఖను బట్టి పిలువంబడుచుండిరి.

1. ఆరియన్



భిషజులు సర్వవైద్యవిశారదులు. చికిత్సకులు సాధారణ వైద్యులు. జాంగలీవిదులు విషవైద్యులు. సూతికాచికిత్సకులనువారు మంత్రసానులు. ధాత్రికలును సైన్యమువెంట నడచు రణవైద్యులును ఈతరగతిలోఁ జేరినవారె.

మూఁడుమూలికల పేరు నెఱింగినవారెల్లరును వైద్యులుగ నుండుటకు వీలుండినది గాదు. ప్రభుత్వమువారి యనుమతిలేని దెవ్వరును వైద్యవృత్తి నవలంబింపరాదు[1] ఆవృత్తియందుండి అజాగరూకులయి మెలఁగనురాదు. వైద్యుని లోపంబున రోగికి నపాయముగలిగినచో వైద్యుఁడు దండార్హుఁడయి యుండెను. అనుమానాస్పదంబగు మరణము తటస్థించినచో నీయిరువదవ శతాబ్దంబునంబలె నప్పుడును శవమును పగులదీసి ఆశుమృత పరీక్ష (Post Mortem Examination) చేయుచుండెడివారు.

ఇట్టి నియమములతో వైద్యులసిబ్బంది యుండినపుడెట్టి విశేషరుగ్మత వాటిల్లినను దగుసాయము గలుగుచుండెనని ప్రత్యేకించి వ్రాయుటయే పని లేదు. క్షామాదుల ఫలంబుగ జనించిన 'మారక' వ్యాధులను రూపుమాప నెల్ల వైద్యులును దమ తమ మందు తిత్తులతో సిద్ధముగ నుండువారు. వారి

1. ఈవిషయమున శాసనముచేయుటకు మనప్రభుత్వమువా రిప్పుడిప్పుడు ప్రయత్నము సేయుచున్నారు.

తోడంగూడ దైవప్రార్థనాదికములు సల్పి యాపదం బాపఁగల సాధుజనంబులును బరిశ్రమ చేయుచుందురు.

అగ్నిబాధ లేకుండఁ జేయుటకుఁ దగిన నిర్బంధములును బరికరములును నేర్పఱుపఁబడియుండెను. వేసవి కాలమున గ్రామికజనంబులు అగ్ని నార్పు పది యుపకరణంబుల (5. ఘటములు; 1. కుంభము; 1. ద్రోణము—అనఁగా తొట్టి; 1. మిచ్చెన; 1. గండ్రగొడ్డలి—ఇది దంతెలు దూలములు పడఁగొట్టుటకు; 1. తూరుపుబుట్ట—పొగను బారదోలుట కిది; 1. అంకుశము; 1. పటకారల జత; 1. తోలు సంచి) జూపుటొండె పచనాదికార్యముల నింటి వెలుపలఁ జేసికొనుటొండె చేయవలసియుండెను.

ఎచ్చటనైన నగ్నిబాధ గలిగినయెడల నాప్రాంతమునందలి గృహస్థులెల్లరును దమ తమ యుపకరణములతో వెలువడి యాయగ్నిని చల్లారుపవలసి యుండెను. అట్లు చేయనివారికి శిక్షలు విధింపఁబడుచుండె

## పంచాయతులు

పురపరిపాలనాక్రమము లెటువంటివో పాటలిపుత్ర వర్ణనాధ్యాయమునందు విస్తరింపఁబడి యున్నవి. సైన్యవ్యవస్థ ప్రకరణమునఁ దత్పరిపాలనాక్రమము వివరింపఁబడి యున్నది. మొత్తముమీఁద తేటపడునంశ మెద్దియన్న సమస్తాంశములకును పంచాయతి పరామర్శయను పద్ధతి ముఖ్యాధారముగ గ్రహింపఁబడి యుండుటే. పుర పరిపాలనమునకు ఆఱుపంచాయతులు,



సైన్యనిర్వహణమునకు ఆఱు పంచాయతులు, శిల్పులు, వర్తకులు, కర్మకరులు మొదలుగాఁగల వృత్తికులముల విచారణకును ఆయాకులమున కాయాకులస్థుల పంచాయతులు, గ్రామపాలనమునకు గ్రామపంచాయతి యనుచు నిట్లు పంచాయతి పుంజముగా నున్నట్లు తేటపడును. కొన్ని పంచాయతులు రాజనిర్ణీతములును రాజపురుషనిర్ణీతములును; తదితరము లెల్ల జనసముదాయ నిర్మితములు. అత్యంతబలిష్ఠ రాజకార్యముల వినా తక్కిన వన్నియు జననియుక్త పంచాయతులు. వీనియందును రాజపురుషులైన గ్రామప్రముఖులైన సభ్యులుగ నుండిరి. కాఁబట్టి రాజభక్తికి విరోధము లేకుండను జనస్వాతంత్ర్యమునకు లోపము లేకుండను కార్యములన్నియు నిర్వహింపఁబడె. మఱియు పంచాయతివారు తమ తీర్మానించు విషయములందు ప్రత్యక్షజ్ఞానానుభవములుగల వారుగాను, వాది ప్రతివాది సాక్షుల పూర్వోత్తరముల తెలిసినవారుగాను, ఆయాజన సముదాయమునకు సత్యసాత్త్వికాదులయందు యశోమాన గణ్యతాబద్ధులుగాను ఉండుటంబట్టి వారి నిర్ణయములు న్యాయ్యములుగాను అంగీకార్యములుగాను నుండె. వారు జనసముదాయక్షేమాభివృద్ధుల సహజ ప్రీతియుతులగుటంబట్టియు, తత్సముదాయ అవయవీభూతులు కావునను వివాద నిర్ణయంబులకు అనగత్యవ్యయంబుల కాస్పద ముండెడిలేదు. కావున న్యాయనిర్ణయములు సులభ సాధ్యములై యుండుచు జనులకు సుఖ

కరములై యుండె. ఇక్కాలమునందు బలె వ్యాజ్యములకుఁ గల కాలవిలంబములు కాని, పలు తెఱంగుల ద్రవ్యనష్టములుకాని, న్యాయనాదుల తలక్రిందుల పొరలింపులు కాని, న్యాయనిర్ణయ విపరీతములు కాని, వివాదుల యితర కార్యభంగములు కాని ఎంతమాత్ర ముండ లేదని నమ్మవచ్చును. జనస్వతంత్రతా బుద్ధియు పదేపదే వర్ధిల్లుచు ప్రజాగౌరవమును భద్రముగ సంరక్షింపఁబడె. రాజక్షేమమును అభివృద్ధిఁ బొందె.

రాజు.

ఇప్పగిది సర్వవిధములఁ బ్రజల సంరక్షయే ప్రథమకర్తవ్యముగఁ జేయుచుండిన చంద్రగుప్తుని దినచర్యను గొంచెముగ నిట వర్ణింపవలసియున్నది.

దినము ఎనిమిది భాగములుగను రాత్రి యెనిమిది భాగములుగను విభజింపఁబడి యుండెను. ఈ భాగములకు నాళిక లని పేరు. దివసపు మొదటినాళిక రక్షకుల నేమించుటయందును లెక్కలఁ బరిశీలించుటయందును రాజు గడపుచుండును. తరువాతయొక్క నాళికకాలము అనఁగా రమారమి ఇప్పటి 7-30 మొదలు 9 గంటలవఱకును ప్రజల మేలు కీడుల నరయుట యతనిపని. పిదప నాళికకాలము అతని భోజనాదులకును జదువునకును వినియోగింపఁబడుచుండె. నాలవ నాళికయందతఁడు కరాది హిరణ్యంబును గ్రహించుటయందును అధ్యక్షుల నియమించుటయందును వెచ్చించును. ఐదవనాళిక మంత్రి వర్గముతో జరుగ



వలసిన ఉత్తరప్రత్యుత్తరముల కేర్పడి యుండెను. ఆఱవనాళిక యాటపాటలకును వినోదములకును నియమితము. ఏడవనాళిక యందు నేనుఁగులను, గుఱ్ఱములను, రథములను, కాల్బలములను రాజు పరీక్షించును. ఎనిమిదవ నాళికయుద్ధ విషయంబుల సేనాధ్యక్షునితోఁ బర్యాలోచించుటయందు గతించును. రాత్రియందలి ప్రథమనాళిక వేగులవారి వార్తలకును, రెండవది స్నానాదులకును,మూఁడవది మృదంగాదికముల సుస్వనములచే నిద్రనందుటకును, నాల్గవ ఐదవనాళికలు నిద్రకును, ఆఱవది మంగళారావములకు మేల్కాంచి ధర్మముల మననము చేయుటకును, ఏడవది రాజ్యకార్యపద్ధతుల నిర్ణయించుకొని చారుల నియోగించుటకును, ఎనిమిదవది ఆచార్యులను, గురువులను, జ్యోతిష్కులను, వైద్యులను జూచుటకును వారి యాశీర్వాదముల నందుటకును వినియోగింపఁ బడుచుండెను.

ఈవిధముగ రాజుయొక్క దినచర్య నిర్ణీతమయి యుండెను. విశేషకార్యము లున్నపుడు రాజీ కాలక్రమమును మార్చుకొనుచుండె ననుటకు సందేహము లేదుగాని సర్వసాధారణముగ నియ్యది యతనిచే ననుసరింపఁబడుచుండెను.

“కార్యమున కెప్పుడును సిద్ధముగనుండుటయె రాజునకు వ్రతము. ధర్మమును జక్కఁగ నెరవేర్చుటయె యజ్ఞకర్మ. ఎల్లరయెడ సమభావమునఁ బ్రవర్తించుటయె యాతనికి నవభృథస్నానము”

"ప్రజలసౌఖ్యమే యతని సౌఖ్యము. వారి క్షేమమే యతని క్షేమము. తనకుఁ బ్రీతికరమగునది ప్రీతికరంబని యతఁడు తలఁపరాదు. ప్రజలకుఁ బ్రీతికరంబగునదియె నిశ్చయంబుగ ప్రీతికరంబని యతఁ డెన్నవలయు"

"రాజెల్లపుడును నప్రమత్తుఁడయి ధర్మములఁ దీర్పవలయును; అప్రమత్తతయె ఐశ్వర్యంబునకు మూలంబు; దానివ్యతిరేకంబ దుఃఖమునకుఁ బునాది."

అను నీసూత్రంబులు చంద్రగుప్తుని జీవయాత్రకు మూలాధారములు. కావుననే రాముఁడుంబలె

"తండ్రి క్రియఁ" జంద్రగుప్తుఁడు
"దండ్రులమఱపించి ప్రజలఁ దారక్షింపన్
"దండ్రులనందఱు మఱచిరి
"తండ్రి గదా" చంద్రగుప్త "ధరణిపుఁడనుచున్"

---

## తొమ్మిదవ ప్రకరణము.

### కొన్ని యాచారములు.

#### రజస్వలానంతర వివాహములు.

చాణక్యుఁడు అర్థశాస్త్రమున శిక్షాస్మృతి వ్రాయుచు రజస్వలానంతర కన్యలయెడ ద్రోహబుద్ధి చూపువారల కొక విధమగు దండనను విధించుచున్నాఁడు. ఒక్కెడ కన్య రజస్వలయయి ఏడుమాసములు చెల్లినచో యామె కృపకుఁ బాత్రుఁడగుట తప్పుకాదని విధించుచున్నాఁడు. రజస్వలయయినపిదప మూఁడుసంవత్సరములు అవివాహితగనుండు కన్యను సజాతిపురుషుఁడు అనుభవింపవచ్చును. మూఁడుసంవత్సరములకు పైఁబడియుండిన యెడల తండ్రికిఁ జెందవలసిన విభూషణము లాకన్యస్వాధీనమున నుంచుకొనదేని ఆమెను విజాతీయుఁ డయినను అనుభవింపవచ్చును. శుద్ధచరిత్ర లేని కన్యయని కన్యాస్వీకారముచేసిన తరువాత బయల్పడినచో నట్టి కన్యను త్యజింపవచ్చునని మఱియొక్కెడ లిఖింపఁబడియున్నది. అట్టి సందర్భముల శుల్కమును స్త్రీధనంబును వరునకు ఇచ్చివేయవలసినదనియు కన్యాదాత జరిమానాకుఁ బాత్రుఁడు గావలసినదనియు శాసింపఁబడినది. శుల్కమును గుఱించి వ్రాయుచు నింకొకపట్టున చాణక్యుఁడు తల్లిదండ్రు లిరువురును

పరలోకవాసులయి యుండునెడ కన్యయే శుల్క[1] స్వీకారము చేయవచ్చునని నిర్ణయించుచున్నాఁడు. వ్యాఖ్యాన మవసరము లేకయే పైవిషయములు చంద్రగుప్తునికాలమున రజస్వలానంతర వివాహములు సాధారణములని చాటుచున్నవి. రజస్వలానంతర వివాహములు సాధారణ మను సిద్ధాంతము తేలిన పిదప బాలురకుగాని బాలికలకుగాని "అతిబాల్య వివాహములు" నాఁబరగు ననుచిత శృంఖలబంధనము దటస్థించుచుండ లేదని వేరుగ వ్రాయవలయునా?

## పునర్వివాహములు.

"భార్యవలన పురుషునకు సజీవసంతానముగాని మగబిడ్డలుగాని కలుగకున్నను లేక సంతానమే లేకపోయినను అతఁడు మఱియొక్కర్తెను బెండ్లాడుటకు ఎనిమిది సంవత్సరములు ఆగవలెను. భార్య మృతశిశువును గనినచో పదేండ్లు

1. ఈ శుల్కము నిప్పటి కన్యాశుల్కముగదా యని యెంచఁబోకుఁడి. ఆపత్కాలమున స్త్రీలకు ఉపయోగపడుటకయి వివాహసమయముల వరుఁడు ఇచ్చు ద్రవ్యరూపమగు ఆస్తికి శుల్కమని పేరు. ఆభరణరూపముగ నొసంగు ఆస్తికిని వృత్తిరూపముగనిచ్చు ఆస్తికిని స్త్రీధనమని పేరు. శుల్కమునకును స్త్రీధనమునకును భార్య సంపూర్ణస్వతంత్రురాలు. దుర్భిక్షములను, దానధర్మములకును, రోగనివారణార్థమును, ఆపత్సమయములను నీ శుల్కమును స్త్రీధనమును వినియోగించుకొనుటకుఁ గొంతవఱకు భర్తకునుగూడ స్వాతంత్ర్యముండెడిది. ఇప్పటి శుల్కచ్ఛాయయు నచ్చటచ్చటఁ గానవచ్చునదిగాని ఈ విషయ మింకను శోధనీయము.



వ్యవధి కావలెను. ఆమె యాఁడుబిడ్డలనే కనుచుండిన పండ్రెండు సంవత్సరములు చూడవలెను. తరువాత పుత్రులు గావలెనను వాంఛపొడమినచో నతఁడు మఱియొక స్త్రీని వివాహమాడవచ్చును. ఈనియమములను దిరస్కరించువాఁడు భార్యకు స్త్రీధనమును శుల్కమును ఇచ్చివేసి ఇంకను నధికముగ ధనమునిచ్చి ప్రభుత్వమువారికిఁ గొంత జరిమానా అచ్చుకొనవలెను. వివాహకాలమున శుల్కాదుల స్వీకరింపనివారికిఁ గూడ నీవిధముగా శుల్కాదుల నిచ్చి తగురీతిని వృత్తినికలిగించి పురుషుఁడు పుత్రకాముఁడై ఎందఱుస్త్రీలనైనను వివాహము చేసికొనవచ్చును. "స్త్రీలు పుత్రులఁ బడయుటకు సృష్టితులు" అను వాక్యము లర్థశాస్త్రమునఁ గానవచ్చుటవలనఁ జంద్రగుప్తచక్రవర్తికాలమున బురుషుఁడెందఱుభార్యలనైనను పెండ్లాడుటకు స్వాతంత్ర్యము గలవాఁడై యుండెనని విశదమగుచున్నది.

ఇఁక స్త్రీపునర్వివాహములను యోజించిన

"భర్తగతించినవెనుక భార్యధర్మకామయయి జీవింపనెంచుకొనినచో యామె స్త్రీధనమును శుల్కమును ఆమెకిచ్చివేయవలసినది పేరునకు మాత్ర మాయమకిచ్చియుండి సర్వ్వయమున కయ్యవి యామెస్వాధీనమున నుండని యెడల నవ్వానికగువడ్డీతోడంగూడ నవి చెల్లింపఁబడవలెను.

"ఆమె కుటుంబకామయయి పునర్వివాహమును ఆశించెనేని ఆయమకు భర్తగాని మామగాని ఇచ్చియుండిన సొమ్ము ఈయఁబడవలయును." అనియు

"భర్త హ్రస్వప్రవాసమునకుఁ బోయియుండిన యెడల బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర స్త్రీలు అతనికయి యొక్క సంవత్సరము వేచి యుండవలెను. సంతానము గలవారయిన పక్షమున సంవత్సరమున కంటె నెక్కుడు వేచియుండవలెను. భోజనాదులకు వసతులున్న యెడల రెండింతల కాలము వియోగము భరింపవలెను. భుక్తికి జరుగని స్త్రీలను జ్ఞాతులు నాలుగు లేక ఎనిమిదిసంవత్సరములు సంరక్షింపవలెను. పిదప వివాహకాలమున వారికిదత్తము చేయఁబడిన ఆస్తినిచ్చి పునర్వివాహము చేసికొన నియ్యవలెను.

"భర్త బ్రాహ్మణుఁడయి అధ్యయనార్థము దేశాంతరస్థుఁడయి యున్న సంతానరహిత యగు స్త్రీ పదిసంవత్సరములతనికయి వేచియుండవలెను. సంతానవతి యయిన యువతి పండ్రెండు సంవత్సరములు గడుపవలయు.

"భర్త క్షత్రియుఁ డయినచో భార్య ప్రాణమున్నంత కాలము వేచి యుండవలయు. కాని వంశవిచ్ఛిన్నమును దొలఁగించుటకొఱకు సవర్ణుఁడగు ద్వితీయభర్తను స్వీకరించినను నపవాదము నందదు"

"భర్తదీర్ఘప్రవాసమునకు వెడలినను, సన్యాసియయినను, మృత్యువునందినను సంతానవిరహితయగు భార్య ఏడు మాసములు వేచియుండవలెను. సంతానసమేతయైన పక్షమున నొక్కసంవత్సరము వేచియుండవలెను. ఈ కాలపరిమితి దాఁటినపిదప స్త్రీ తనభర్త కనిష్ఠసోదరుని లేకున్న తనభర్త గోత్రములోనివానిని పునరుద్వాహమున స్వీకరింప వచ్చును."



అని అర్థశాస్త్రము వక్కాణించుటంబట్టి పురుషులకుం బలె స్త్రీలకును చంద్రగుప్తుని కాలమున పునర్వివాహ విషయమున స్వాతంత్ర్య ముండెనని తెల్లమగుచున్నది.

## దాంపత్యవిమోచనము.

చంద్రగుప్తునికాలమున మనమిప్పుడు మనదేశమున విననైన వినని యొక యాచార ముండెడిది. ఆయాచారము దాంపత్యవిమోచనము. భార్యాభర్తలు పరస్పరము స్నేహభావము కుదుర్చుకొనలేనిచో విధ్యుక్తముగ జరిగిన వివాహంబైనను నిర్బంధము గాదనుట యీ యాచారముయొక్క ముఖ్యప్రయోజనము. ఇట్టి యాచార మిప్పుడు విశేషముగఁ బాశ్చాత్య దేశములయందు ప్రబలియున్నది. అమెరికారాష్ట్రమునందు మితిమీఱిపోయి యున్నది. చీటికి మాటికి భార్యాభర్తలు న్యాయస్థానముల కెక్కి యొకరిపై నొకరు అభియోగములను దెచ్చి వివాహబంధమును ద్రెంచుచున్నారు. ఇట్టి యనర్థముల కాకరమగు నీయాచారము పలువురచే ఖండింపఁబడుచున్నది. అయిన నిది చంద్రగుప్తుని కాలమున నేపగిది వ్యవహారము నందుండెనో కనుంగొనిన యెడల విభేదము తేటపడఁగలదు.

భర్తపై విద్వేషముగలిగిన స్త్రీ ఏడుమాసముల కాలము అలంకారాదుల పొందఁబోక కాలము గడుప వలెను. తరువాతఁ దనకు భర్తయిచ్చిన నగలను శుల్కమును సంపూర్ణముగ నాతనిస్వాధీనముచేసి అతనికి మరియొక భార్యను స్వీకరింప ననుమతి నియ్యవలెను. భర్త భార్యపై విద్వేషము గలవాఁడయ్యెనచో భార్యను భిక్షుకుల [1]గృహములనో బంధువుల యింటనో పోషకులయింటనో శరణమంద ననుజ్ఞ నీవలెను. పురుషుఁడు తనభార్యపై అన్యాయముగ నేరము మోపి ప్రత్యక్షసాక్షుల చేఁ గాని నిర్ధారణ కాఁజాలని దుష్కార్యముల నామె కారోపించినయెడల నతఁడు పండ్రెండు పణములు అపరాధము నచ్చుకొనుచుండెను. భార్య భర్తయందు విద్వేషముకలదైనను అతనియిష్టములేక వివాహబంధవినిర్ముక్త కాఁజాలదు. ఇదే విధముగ భర్తయు భార్య కిష్టములేనిచో వివాహబంధమును ద్రెంచుకొనఁగూడదు. కాని పరస్పరవిద్వేష ముండిన యెడల దాంపత్యవిమోచనము కల్పించుకొనవచ్చును. భర్త భార్యవలన అపాయము కలుగునను భయమంది ఆ భయాతిశయంబుచే విమోచనము గోరుపక్షమున నాయమకు చెందవలసిన సర్వస్వమును నతఁడిచ్చివేయవలెను. భార్య భర్తవలని అపాయమునకు జడిసి ఆ యపాయమునుండి తప్పించుకొనుటకు విమోచనమును ఆశించినచో నామె యేవిధమగు ధనమునకుగాని ఆస్తికిగాని హక్కుగలదికాదు.

1. వైరాగ్యవంతులగు స్త్రీలు.



ఈ దాంపత్య విమోచనాచారము మొదటి నాలుగు తెఱంగుల వివాహములకును నిషేధింపఁబడి యున్నది. బ్రాహ్మము, ప్రాజాపత్యము, ఆర్షము, దైవము అనునియ్యవి ఆ నాలుగు తెఱంగులు. సాలంకార కన్యాదానమునకు బ్రాహ్మమని పేరు [1]శుల్కాది విరహితంబుగఁ గన్యాదానం బొనర్చుట ప్రాజాపత్యము నాఁబరగు[2]. ఒకటిలేక రెండు జతల యావులం గొని కన్యనిచ్చుట ఆర్షమనంబడు[3] యజ్ఞమున ఋత్విక్కునకుఁ గన్యాదానము సేయుట దైవము [4]అనంబడియెడి. రజస్వలానంతర వివాహములు సామాన్యములయి యుండినందున నీ నాలుగు విధముల యుద్వాహములయందును కన్యకును కన్యయొక్క తలిదండ్రులకును వారివారి స్వాతంత్ర్యంబుల నుపయోగించుకొని తమలోఁ దామాలోచించుకొని వధూవరులకు సౌఖ్యావహంబగు విధంబున వివాహములు నడుప వీలుండెను. ఈ వివాహము లిట్లు ఆలోచితములయి లోభాదిదుర్గుణవ్యాపారవిదూరంబులగుటచేత వీని విషయమున విమోచన విధులు అనావశ్యకములయ్యెను తక్కంగల వివాహము లన్ననో చూడుఁడు.

1. బ్రాహ్మోవివాహ ఆహూయ దీయతే శక్త్యలంకృతా (యాజ్ఞవల్క్య 1-58.)

2. "సహోభౌచరతాంధర్మమితి వాచానుభాష్యచ కన్యాప్రదానమభ్యర్చ్యం ప్రాజాపత్యో విధిఃస్మృతః" మనుస్మృతి 3-30.

3. ఆదాయార్షస్తు గోద్వయం—యాజ్ఞవల్క్య 1-59.

4. యజ్ఞస్య ఋత్విజేదైవః— " "

గాంధర్వము: ఇయ్యది కన్యాపురుషు లొండొరులను జూచుకొనినంతమాత్రనఁ బెండ్లిచేసికొనుట.[1] ఇట్టి వివాహము భ్రమ కాకరంబుగదా. వినికిడిమాటలవలనను ఆకస్మిక దర్శనము వలనను ఒక్కరినొక్కరు ప్రేమించిన నా ప్రేమ కొన్ని సందర్భములఁ గ్రమక్రమముగ క్షీణించి దానిస్థానమున నసహ్యత నా దేశంబగుట సర్వజనవిదితము. అట్టి సందర్భముల బంధవిమోచనమునకు మార్గము లేకపోయిన ననర్థములు వాటిల్లును గదా!

ఆసురము:[2] ఈతెగ పెండ్లిండ్లు నేఁటికిని మనదేశమునఁ గానవచ్చుచు మన సంఘాభివృద్ధికి వేరుపురుగులై పరిణమించుచున్నవి. ధనాశాపిశాచము పీడింపఁ గన్యాశుల్కము పుచ్చుకొని తలిదండ్రులు మాంసవిక్రయ ఘనిష్ఠమైన వెనుదీయక తాముగడుపార కన్నబిడ్డలను అమ్మివేయుటను మన ధర్మకర్తలు ఒక విధమగు వివాహముగ వర్ణింపక తప్పనందుల కెంతయుఁ జింతిల్లవలసి యున్నది. అయిన వారిడిన పేరు మాత్రము ఈ వివాహముల నెంతవఱకు ఖండింపవలెనో యంతవఱకును ఖండించుచున్నది. ఇట్లు దుష్టమగు వివాహంబుగావున దీనికి విమోచనం బవసరమని వేరుగఁ జెప్పఁబనిలేదు. కులగోత్రములను స్థితిగతులను రూపారూపంబులను ఆరోగ్యానారోగ్యంబులను

1. గాంధర్వః సమయాన్మిథః— యాజ్ఞవల్క్య. 1-61.
2. ఆసురో ద్రవిణాదానాత్ యాజ్ఞవల్క్య 1—61
మనుస్మృతి 3—33



యౌవనవృద్ధాప్యంబులను యోగ్యతాయోగ్యతలను విచారింపక భర్తను గట్టిపెట్టిన నాతఁడు దుర్భాగ్యుఁడో షండుఁడో యైన భార్య యేమిచేయవలయును? ఆతనిం బరిత్యజింప వలసినదే గదా! ఈ కన్యాశుల్కాచారపు దుష్ఫలంబులను మాన్పుటకు నిప్పుడు మనదేశంబున దాంపత్యవిమోచన స్మృతియొండు చంద్రగుప్తుని కాలంబునందువలెఁ గల్పించిన శ్రేయోదాయకం బగు నని తోఁచెడిని.

రాక్షసము: యుద్ధమునందు కన్యయొక్క బంధువుల నోడించి కన్య నెత్తుకొని పోవుటకు రాక్షసమని పేరు.[1] రుక్మిణీకృష్ణుల వివాహ మిా తెఱంగుది. పూర్వము ఈవిధమగు వివాహములయందు కన్యాపురుషులకుఁ బరస్పరానురాగము విస్పష్టముగఁ గానఁబడుచున్నది. అది యుండినను గాంధర్వ వివాహముతో నిదియును సామ్యముకలదియేకాన దీనను భ్రమాదుల కాస్పదంబుగలదు. ఒకవేళ నిందు కన్యక కనురాగము లేకుండుటయుఁ దటస్థింప వచ్చును. అప్పుడిది గాంధర్వంబున కంటె దూష్యంబయ్యెడు. కావున నిద్దానికిం గూడ విమోచన స్మృతి.

పైశాచము: ఇది వివాహములయం దధమము. కన్య కిష్టము లేకయే ఆమె నిదురించుచుండఁగనో మైమఱచి యుండఁ

1. రాక్షసోయుద్ధహరణాత్: యాజ్ఞవల్క్య 1—61
మనుస్మృతి 3—33

గనో మనో వికలత్వమంది యుండఁగనో ఆమెపైఁబడి వరుఁడు ఆమెను లోఁబఱచుకొనుట పైశాచ మనంబరగు. ఇద్దానిని వివాహవిధులలో మన ధర్మకర్త లేల చేర్చిరో తెలియ రాకున్నది.[1] ఈ బాధమునకు విమోచన మవసర మని వేరుగ వ్రాయవలెనా? నట్టి విమోచనమొక్కటియెగాక కామాంధకారసంజనితదుశ్చేష్టాలంకృతుండయి ఈ విధమగు వివాహంబు నాశించువరునకు నుచితంబగుఁ గఠిన శిక్షాస్మృతియుఁ గూడ యత్యంతావశ్యకంబె. అయిన చంద్రగుప్తుని కాలంబున నా శిక్షాస్మృతి మాత్ర ముండినట్లు గానరాదు.

ఎనిమిదివిధముల వివాహములను జర్చించి పైనివ్రాసిన విషయములు వాకొనిన పిదప చంద్రగుప్తునికాలమునఁ బ్రచారమునం దుండిన దాంపత్యవిమోచనచట్టముయొక్క లాభాలాభము లిట్టివని మా చదువరులకుఁ బ్రత్యేకించి నివేదించుకొనఁ బనిలేదు.

చంద్రగుప్తుని కాలమున మఱియొక చిత్రము కలదు. ఆస్తివిభాగములు చేసికొనుటకు హక్కుదారు లెల్లరును యుక్తవయస్కు లయియే యుండవలెను. యుక్తవయస్కులు గాని హక్కుదారులుండి వారికి యుక్తవయస్సు రాకముందే విభా

1. సుప్తాం మత్తాం ప్రమత్తాం వారహోయత్రోపగచ్ఛతి
సపాపిష్ఠోవివాహానాం పైశాచశ్చాష్టమో ऽధమః మనుస్మృతి 3—34



ములుగ తీర్మానము చేయఁబడినచో వారికి అప్పులతో సంబంధము లేకుండెను. ఆస్తికిమాత్రము వారు హక్కుదారులే గాని అప్పులకు వారు ఉత్తరవాదులు గారఁట![1]

1. అర్థశాస్త్రము ప్ర. 3. అ. 5.

## పదియవప్రకరణము.

---

# చంద్రగుప్తుని సమకాలీనులు.

చరిత్రమున మహాపురుషు లెప్పుడును నొంటిగఁ దోఁచుట లేదు. పరిస్థితి పరిపక్వము గుదిరినంగాని మహాపురుషు లవతరించుట యరుదు. కాన లోకచరిత్రమున సుప్రసిద్ధములగు పట్టుల నెటఁ బరిశీలించినను కార్యనిర్వాహణధురంధరులు సమాజములు కల్పించుకొని విచ్చేసిరో నాఁ బరఁగుచుండ్రు. చంద్రగుప్త చక్రవర్తికాలము నిట్టిదియే. చంద్రగుప్తుని గంటికి రెప్పవోలె కాచి యాతనికి రాజ్యమును సంపాదించిపెట్టిన చాణక్యుండును, ఆచాణక్యునకుఁ బ్రశంసనీయుండగు విరోధియయి పరఁగినరాక్షసుండును, చంద్రగుప్తుఁ డడవుల నిడుములు గుడుచుచుండ లోకమునంతయు నేకచ్ఛత్రముక్రిందికి దేఁ బ్రయత్నించిన సుప్రసిద్ధ వీరుండగు నలెగ్జాండరును, అలెగ్జాండరునకుఁ దరువాత నాతని కార్యమును గొంతదీర్చి యంతటి వాఁడని పొగడ్తఁగని చంద్రగుప్తచక్రవర్తిరాజ్యము నపహరింపనెంచి యాతనిచే పరాజితుఁడయి తనబిడ్డ నాతనికిచ్చి సంధిచేసికొనిన శెల్యూకసును, శెల్యూకసుచే నిర్ణీతుఁడయి చంద్రగుప్తుని యాస్థానమున రాయబారిగనుండి తన దినచర్యాగ్రంథముచే నిప్పుడు



హిందూదేశ పూర్వచరిత్ర లేఖనమునకు నాధారభూతుఁడయిన మెగాస్తనీసును మనకు సంస్మరణీయులు. వీరిచరిత్ర దొరికినంత వఱకు సంక్షిప్తముగ నీ క్రిందఁ బొందుపఱచుచున్నారము.

### చాణక్యచరిత్రము.

శ్రీమద్రామాయణమునందు అయోధ్యాపురిని దశరథసుమంత్రులను, కిష్కింధాపురిని సుగ్రీవహనుమంతులను, భారతమునందు ధృతరాష్ట్రవిదురులను, కృష్ణార్జునులను చేర్చిచేర్చి తలఁచుట యెంతప్రకటమో, అట్టులనే ముద్రారాక్షసమును చదువువారలకు చాణక్యచంద్రగుప్తులను, నందరాక్షసులను నేకశ్వాసముతో స్మరించుట సహజము. మఱియు నా చదువరులు చాణక్యవాక్యములను చాణక్యచేష్టితములను పఠించుతఱి, విశ్వామిత్రుని కోపసాహససామర్థ్యములను, భీష్ముని నీతి ప్రవీణతను, కృష్ణుని శత్రుసంహారమును కపటసూత్రధారిత్వమును, హనుమంతుని స్వామికార్య ధురంధరత్వమును, హనుమద్భీష్ముల బ్రహ్మచర్యానిష్ఠను స్మరింపకమానరు.

విష్ణుపురాణములోను మత్స్య వాయు భాగవతపురాణములందును, బృహత్కథయందును చాణక్యుఁడు ప్రశంసింపఁబడియున్నాఁడు. కామందకములో "ప్రతిగ్రహముచేయ దియు విశాలమునైనదియునగు ఋషివంశములలో పుట్టిన యశస్వి,

అగ్నిసమతేజుఁడు, వేదవిద్వరుఁడు, నాల్గువేదములను ఒక్క వేదము వడువున అధ్యయనము చేసినవాఁడు, ప్రజ్వలనతేజుఁడు, అభిచారవజ్రముతో నందపర్వతమును వేరుతో పడగొట్టిన భూసురుఁడు, శక్తిధరసముఁడు, మంత్రశక్తితో నేకాకిగ కార్యకరణశక్తుఁడు, చంద్రగుప్తునకు ఈమేదినిని సంపాదించి యిచ్చినవాఁడు, అర్థశాస్త్రి మహాసముద్రమునుండి నీతిశాస్త్రామృతమును చిలికియెత్తినవాఁడు నైన విష్ణుగుప్తునకు నమస్కరించెదను"[1] అని యున్నది.

రాక్షసుఁడు చాణక్యసన్నిధి చేరినపుడు, "ఇతఁడు గదా దురాత్ముఁడు లేక మహాత్ముఁడు కౌటిల్యుఁడు! సముద్రము రత్నములకెల్ల బొక్కసమైనయట్లు సర్వశాస్త్రములకును శరణ్యుఁడైనవాఁడు. వీనియందు మాత్సర్యవశమున గదా ఈతని గుణ

1. వంశేవిశాలవంశానా మృషీణామివభూయసాం ।
అప్రతిగ్రాహకాణాంయో బభూవభువివిశ్రుతః ॥
జాతవేదాఇవార్చిష్మా న్వేదా న్వేదవిదాంవరః ।
యోఽధీతవాన్సుచతుర శ్చతురోఽప్యేకవేదవత్ ॥
యస్యాభిచారవజ్రేణ వజ్రజ్వలనతేజసః ।
పపాతమూలతఃశ్రీమా న్సుపర్వానందపర్వతః ॥
ఏకాకీమంత్రశక్త్యాయః శక్త్యాశక్తిధరోపమః ।
ఆజహారనృచంద్రాయ చంద్రగుప్తాయమేదినీమ్ ॥
నీతిశాస్త్రామృతంధీమా నర్థశాస్త్రమహోదధేః ।
యఉద్దధ్రేనమస్తస్మై విష్ణుగుప్తాయవేధసే ॥



ములకు పరితోషింపక యున్నారము!"[1] అనుచు పాండిత్యస్తవమును జేసియున్నాఁడు. దశకుమారచరితము, పంచతంత్రము, కాదంబరి, చణ్డకౌశికము, బృహత్కథ, హితోపదేశము, విక్రమార్కచరిత్రము మున్నగు గ్రంథములయందు సమస్తరాజనీతిశాస్త్రములకును చాణక్యుఁడు గొప్పప్రమాణముగ నంగీకరింపఁబడియున్నాఁడు[2].

1. ఆకరః సర్వశాస్త్రాణాం రత్నానా మివసాగరః ।
గుణైర్న పరితుష్యామో యస్యమత్సరిణోవయమ్ ॥

2. నీతిశాస్త్రము మనదేశమునందు మొట్టమొదట నుత్పన్నమయినది. సంస్కృతగ్రంథావళియం దత్యంత ప్రాచీన మయినది. చాణక్యుని నీతిసారము స్వజాతీయశాస్త్రము లన్నిటిలోను అత్యంతము బహుజనాదృత మయినది.

ఇటీవల రెండుమూఁడు వత్సరములక్రిందట మైసూరు రిపోర్టునందు మ-రా-రా-శ్రీ. ఆర్. శ్యామశాస్త్రిలుగారు, బి. ఏ. చాణక్యకృత అర్థశాస్త్రమునందు ఒకభాగమును . ఇంగ్లీషునందు భాషాంతరీకరించుచు వచ్చిరి. ఇయ్యది ప్రాచీనగ్రంథ ప్రతిగా ననేకపండితులచే నంగీకరింపఁబడియున్నది. చాణక్యరచిత శాస్త్రములును అందు రూపముగ నలఁడుపడసిన బిరుదులును ఈదిగువ శ్లోకమునందు గూర్చియున్నవి.

వాత్స్యాయనోమల్లనాగః కౌటిల్యశ్చణకాత్మజః ।
ద్రావిలః పక్షిలస్వామి విష్ణుగుప్తశ్చాంగులశ్చసః ॥

ఇందు పక్షిలనామమున అతఁడు నైయ్యాయికుఁడనియు, కౌటిల్య పేర రాజతంత్రజ్ఞుఁడనియు, జ్యోతిశ్శాస్త్రమునందు విష్ణుగుప్తుఁడనియు, కామసూత్రములయందు వాత్స్యాయనుం డనియు నీతిశాస్త్రమునందు చాణక్యుఁడనియుఁ బ్రసిద్ధిఁగాంచియున్నాఁడు. మల్లనాగనామము అతని యుద్ధవీరత్వమును, ద్రావిలనామము రణరంగ ప్రాముఖ్యతను ప్రకటించుచున్నవి. అంగుల

ముద్రారాక్షసమునందు ప్రబలపాత్రముగఁ బ్రజ్వలించుచు, పరిస్ఫుటబుద్ధిని, ఆత్మవిశ్వాసమును, యుక్తితంత్రజ్ఞతను, నిరంకుశ నీతిశాస్త్రప్రావీణ్యమును, దూరదర్శనమును, నిర్ణీతఫలప్రాప్తికి వలసిన సర్వోద్యమ పరత్వమును చాణక్యుఁడు వెల్లడి సేయుచున్నాఁడు. ఈనాటకమునందలి సర్వకార్యవ్యవసాయమును చాణక్యునిదిగనే ద్యోతక పడుచున్నది.

ఇతఁడు "విఘ్నైర్ముహుర్ముహురపి హన్యమానాః ప్రారబ్ధముత్తమగుణా నపరిత్యజన్తి,"[1] అను శ్లోకమునకు దృష్టాంతరూపుఁడన్నను సరిపోదు. విఘ్నములఛాయలైనను పొడఁగట్టనట్టులు భూతభవిష్యద్వర్తమానములను గణితశాస్త్రజ్ఞుల సునిశ్చితతో సమాసపఱచి, యుపక్రమించిన యత్నములను పూర్వనిర్ణీత యుపసంహారములకు కొనసాగించుచు ఆయాదేశములలో నాయాకాలములలో అస్ఖలిత జయులై సంచరించిన మహాత్ములలో నొకండు. గ్రీకులలో అలెగ్జాండరు, రోమనులలో సీజరు, ఫినిషియనులలో హానిబలు, యూరోపియనులలో నెపో

నామము గణితశాస్త్ర నిపుణతను తెలిపెడిని కాఁబోలు. పాఠాంతరము త్రికాండశేషమునందు అంసుల అని యున్నందున విశాలభుజుఁడు దృఢగాత్రుఁడని సూచించుచున్నది.

1 శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు గురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.



లియను, అమెరికనులలో వాషింగుటను చరిత్రములఁ జదివిన వారల కెట్టియుత్సాహము పుట్టఁగలదో యట్టియుత్సాహము చాణక్య చంద్రగుప్తుల చరిత్రము చదివిన వారికిఁ బుట్టకమానదు. అలకసుందరాదులకైన కొన్నికొన్ని యపజయములు, చిత్తక్లేశములు కలవు. కాని ఈ చాణక్యునకు మాత్ర మది యేమియు లేదు. "వృషలుని కల్పనాయాసమును నాయొక్క మతి జాగరూకతయు" నని చాణక్యవచనమున చదువరులు తడయగల్గుచున్నది. కాని, సమస్తవిషయములును అతఁడు అనాయాసముగనే నిర్వహించునట్టులు ఒక్కయుదంతము వెనుక మఱియొకటి అనాలస్యముగ వచ్చుటంబట్టి కార్యప్రవాహమునందు వేవేగముగ అందఱిని లాగికొని పోవునట్లును తోఁచుచున్నది.

ప్రతిజ్ఞాభంగకారి గాఁగల దయాదాక్షిణ్యముల కెడమియ్యక, అప్రతిగ్రహణవ్రతంబును మఱపింపఁగల రాజకీయాభిమానాడంబర కాంక్షలఁ గలనైనను తలఁపక, జీర్ణకుడ్యపు పర్ణశాలయందు త్రేతాగ్నిసంరక్షణావిహిత కర్మల పరిపాలించుకొనుచు బ్రాహ్మణ వృత్తిపరుఁడై రాజనీతి ధురంధరతయందు తస్నితియుక్తమార్గము నవలంబించుచు, బ్రాహ్మణక్షాత్రధర్మముల సమ్మేళన పఱచికొని, చాణక్యుఁడు శాంతాశ్వ ఉగ్రాశ్వములఁ బూన్చిన శకటంబుం ద్రోలు సారథివలెఁ బ్రవర్తించె. "ఇక్కాలమందును బ్రాహ్మణాది జాతిజన్యులు స్వస్వధర్మముల పరిపాలించుకొనుటకు వీలులేక, అధర్మ

ములు శాస్త్రములయందు మాత్రము సుస్థిరములై నెలకొని యుండఁగ, దినదినానుభవమునందు మిశ్రాచారపరులై యుండఁ జూడమె? నిత్యకర్మానుష్ఠానములు త్రేతాగ్నిహోత్రక్రియలు గ్రామవాసములలో సహితము అంతర్ధానములైనవి గదా?'' యుందురే? మహమ్మదీయ ప్రభుత్వమునందు శ్రుతిస్మృతుల యదార్థానుష్ఠానము లెట్లుండెనో తచ్చరిత్రకారులు చెప్పఁగలరు. తత్పూర్వమునందున చాణక్యుఁడు ఇప్పటి వారింబలె వేషధారి బ్రాహ్మణుఁడనుట బొత్తిగ ననాదరణీయము. వారి నిష్ఠ లెల్లయు బౌద్ధజైనుల వ్యాప్తిని ఆటంకపఱుచుటకు చాణక్య ప్రభృతులైన బ్రాహ్మణులు పన్నిన కుట్రయని ముద్రామంజూషమునందు చాణక్యవాఙ్మూలముగ చెప్పఁబడియున్నది. కొందఱు పశ్చిమఖండపు పండితులు నిట్లే యూహించిరి. కాని ఇయ్యది శంకనీయమని టెలాంగుగారి యభిప్రాయము. నాల్గవ శతాబ్దమునందు బౌద్ధనిగ్రహము చేసినట్లు తెలిసెడి గుప్తవంశపురాజుల చెయిదమును చాణక్యునిపై నారోపించిరేమొ? బౌద్ధనిగ్రహకథకు చోటియ్యక మెగాస్తనీసుదినచర్య వారిని గుఱించిన ప్రశంసయే చేయకున్నది. కావున బౌద్ధజైనులయాధిక్యతకు అశోకవర్ధనుని కాలమే మొదలనియూహింపవలసియున్నది. అథవా బౌద్ధులవంటి వారిని నిగ్రహించుటకు వారిని మించిన సుశీలతానుష్ఠానము యుక్తిమార్గముకాని కేవల రాజస తామసభూయిష్ఠమైన రాజద్రోహాది కార్యముల వంటిది కాదని



జ్ఞప్తి నూపవలసి యున్నది. మనము నిర్ణయింపఁగలదెల్ల నేమనఁగ, చాణక్యుని యభిప్రాయము స్వధర్మువును రక్షించుకొనవలసినది; క్షత్రియ కృత్యములలో ఫలసంప్రాప్తికిఁ గావలసిన మార్గ మేదియైనను నీతియుక్తమెయగు. రాక్షసుఁడు చంద్రగుప్త నాశమునకై చేసిన కూటప్రయత్నములును అటువంటివిగనే యున్నవి. కావున ఆకాలపు రాజామాత్యకులములవారి యభిప్రాయమున నీతిస్వరూప మమ్మెయిని భావింపఁబడి యుండెననవలయు.

'చాణక్యవటువు' అన్నపదము రాక్షస రాక్షసపక్షపాతుల వైరహేళనములనేకాక చాణక్యుని వయస్సును రాక్షసుని వయస్సుకంటె మిక్కిలియు తక్కువయని గాన్పింపఁజేసెడిని. కొందఱి యభిప్రాయముచొప్పున చంద్రగుప్తుఁడు సర్వార్థసిద్ధికి మనుమఁడే యయిన నందులతనికి పిన్నతండ్రులు కావలెను; అట్టి నందుల శైశవమునుండి కాపాడినవాఁడును మధ్యవయస్సు దాఁటినవాఁడుగను, చాణక్యుఁడు మధ్యవయః ప్రవిష్టుఁడుగను ఉండవలయు.*

చాణక్యుఁడు పరిపూర్ణముగ దుష్టాత్ముఁడాయనిన, రాక్షసుని సామర్థ్యమును, స్వామిభక్తిని శ్లాఘించువాఁడుగ నున్నాఁడు.

* "భో అమాత్యరాక్షస, విష్ణుగుప్తోఽహామభివాదయే" అను వాక్యమును బలుకుచు చాణక్యుఁడు రాక్షసునకు నమస్కరించుటయె యాతని న్యూనవయస్కతకుఁ జాలినంత యాధార మయ్యెడిని.

అటువంటి యమాత్యుని సురక్షితునిగ చంద్రగుప్త సాహాయ్యమునకు కూర్చి యుండనియెడల ముద్రారాక్షసమునకును ముద్రామంజూషమునకును అవకాశాస్పదతలే లేకపోయి యుండును. మిత్రునికై ప్రాణత్యాగ, మానత్యాగ, క్షేమత్యాగ, కుటుంబత్యాగములకు అవలీలగఁ దెగించిన చందనదాసుని శ్లాఘించి కార్యార్థము కారాగృహాది పీడలకు లోఁబఱచినను, కడపట నతని లోకమునకెల్ల అగ్రశ్రేష్ఠిగా నియమించుచున్నాఁడు. చంద్రగుప్తుఁడు వృషలుండైనను, ప్రాచీనక్షత్రకుల జనితపరిపాలిత రాజ్యమునకు, సింహాసన సదృశపార్థివ సాంగత్యమునుబట్టి అభిషేకముఁ జేసినవాఁడు.

అర్థరాజ్యదానమున కొప్పుకొని పర్వతకేశ్వరుని పిలిపించినవాఁడు విషకన్యకద్వార యాతనిని చంపినదిచూచిన, "పూర్వప్రతిజ్ఞయగు నందరాజ్య సర్వస్వమునకును చంద్రగుప్తాభిషేకమునకును భంగముగలిగెడిని. మఱియు నాపార్వతుఁడు అర్థరాజ్యలాభముతోఁ దృప్తిఁబొందక అడియాసపడి స్వరాజ్యబలమును గూర్చికొని చంద్రగుప్తార్థరాజ్యమును కబళించునట్టి యనియతధర్ముండు. కావున అతని సామీప్యమున ప్రతిజ్ఞాసర్వస్వభంగమునగు" నని యూహించి ఇట్టి సందిగ్ధమున, పర్వతకుని తొలఁగించుట సునీతియే అనియు అందున కుపాయము రాక్షసుఁడే చూపఁగా దాని నంగీకరించుటయే భగవదాజ్ఞయనియు నూహించెబోలు. వైరోచకుని యభిషేకమునకును అదేన్యాయ



మనుటతోఁగూడ కూటతోరణమునుండి చంద్రగుప్తునితప్పించుటయు నధికముఖాంతరమాయె. రాక్షసగ్రహణమునకై చేసిన యుపాయము పంచరాజనిగ్రహమునకును మలయకేతు సంయమనమునకును సాహాయ్యమగునట్టులు గావించిన బహుఫలదాయైకనీతిబీజము, ద్విపక్షసేనలకును అనగత్య జీవనష్టములేక యుండునట్లును భూలుబ్ధులైన మూలకంటకులు మాత్రము నివారింపఁబడునట్లును, వేయఁబడుట మహామేధావియు, మహాజనోపకారియునగువాని కర్మగా శ్లాఘింపఁదగినది. †

రాక్షసుని భేదించుటకు తానాలోచించినపుడెల్ల వీరరసంబగు ఆత్మశ్లాఘనవచనంబుల నేకాంతమున భాషించినవాఁడైనను రాక్షసమిత్రంబగు చందనదాసుని యెదుట "అన్యచ్ఛనందమివ విష్ణుగుప్త—" అనుచు ఆత్మస్తుతివిషయముగ అర్థోక్తి యందు లజ్జనునటించుటయు "సర్వం మే—(అనియర్థోక్తి యందు లజ్జనునటించుచు) వృషలస్య వీరభవతా సంయోగమిచ్ఛోర్చన్నయః" అనునదియు చాణక్యుని సభావినయమును

† కర్లైలను గొప్పచరిత్ర తత్త్వజ్ఞుఁడు ప్రాన్సుదేశపు నెపోలియను బర్మనుదేశపు ఫ్రెడరిక్కు చక్రవర్తుల తారతమ్యములఁ బరిశీలించుచు, ఇరుతెగలకును ప్రాణనష్టము అనావశ్యకముగ హెచ్చక కార్యసాధకమైన పరాజయమె జయతుల్యమని భావించిన ఫ్రెడరిక్కుని కోమలతయే, అత్యంతప్రాణనష్టముతో జయసంపాదనము చేసిన నెపోలియనుని క్రౌర్యముకంటె మిక్కిలి శ్లాఘనీయం బని అభిప్రాయ పడుచున్నాఁడు.

ద్యోతక పఱచుచున్నవి. ఇట్టి స్వస్తుతియందు లజ్జగలవాని నైజము ఎంతటి నీతినమ్రతయో తేటపడుచున్నది.

కౌటిల్యుఁడను పేరంబరగంగిన ఈతని కౌటిల్యము ఇతనికి మాత్రము సహజమా? అనివిచారించితిమా, తనయనుజుఁడు లక్ష్మణునిచేసేవయందుచున్న శ్రీరాముఁడు సుగ్రీవవిభీషణులను అనుమోదించుచు వారి అగ్రజులయిన వాలి రావణులపై నభియోగముగావించిన కౌటిల్యమును, వాలి సుగ్రీవులు పోరుచుండు తఱి చెట్టుచాటుననుండి వాలిని ఏసిన కౌటిల్యమును, పూతనహననము మొదలుకొని దుర్యోధన సంహారమువఱకును కృష్ణుఁడాచరించిన కౌటిల్యమును, భీష్మద్రోణ కర్ణహననమునకై యాచరింపఁబడిన శిఖండి యుధిష్ఠిరార్జున కౌటిల్యములును, ఒక్కొక్క యుద్ధమునందును అలెగ్జాండరు వినియోగించిన కౌటిల్యమును, సీజరు అగస్టసుల కౌటిల్యమును, మహమ్మదు ఘోరి అల్లాఉద్దీను బాబరు ఔరంగజేబుల కౌటిల్యమును, క్లైవు హేస్టింగ్సు కౌటిల్యమును, నెపోలియనుని కౌటిల్యమును, బిస్మార్కు కౌటిల్యమును, ఈసమస్త కౌటిల్యుల క్రౌర్యమును జూడఁజూడ ధర్మాసక్తులకుఁ బూర్ణముగ గర్హణీయంబయిన కౌటిల్యము రాజనీతియందు తఱుచుగఁ గన్పట్టుచున్నదని చెప్పవలసి యున్నది. ఇది యెంతయు విచారకరము.



“చాణక్యుని అంతరంగ జీవితము అతిశ్లాఘనీయము. తీవ్ర నిత్యాచారానుష్ఠానములను యావజ్జీవబ్రహ్మచర్యావలంబనమును వినాయించి తక్కినయంశములందెల్ల తత్కాలికుఁడగు రిఅస్టాటులు పేరుగల అలెగ్జాండరుని గురువువంటి ఉగ్ర శిక్షకుఁడు. అతనియింట సమస్తఅలంకారాడంబరములును వర్జితములు. అతఁడు జితేంద్రియుఁడును సుఖదుఃఖ ఉదాసీనుండును. చిరంజీవియై మనియుండి వార్ధక్యమున ప్రాచీనాచారానుసారముగ అరణ్యనివాసియాయె. ఈప్రసిద్ధమహాత్ముని చరిత్రము చూడ నతి మహోన్నత దశయందును సర్వసంగపరిత్యాగమునకు ప్రమాణమైయుండె గావున నే బ్రాహ్మణభావ మట్టిదై యుండవలెనని శాసించినవాఁడు. సార్వభౌమాధికారైశ్వర్యములు అతని యాజ్ఞయం దిమిడియున్నను వానినన్నిటిని తాత్త్వికౌదాసీన్యముతో చూచువాఁడు. అతని సమస్తకృత్యములును పరిశీలింప సమస్త కలాశాస్త్రాధికారియు,కల్పనాకౌశల సంపన్నుఁడును అరిస్టాటులు వలెనే సర్వశిష్యులను తనఫక్కిననుసరించునట్లు వాంఛితముల నియమింప యత్నించినవాఁడును నైకను పట్టుచున్నాఁడు”. 1

చాణక్యునకు ‘బండదంతుఁడ’నియు హేళననామమును గలదఁట! ఆదియేలయనఁగ నతని యమ్మ ముంబంటిని పీకికొను మన్నందున మాతృవిధేయతకు కొఱంత లేక యట్లుగావించి కొనెనఁట!

1. భువనచందదత్తు.

కాఁబట్టి ఈమాతృభక్తియందు అరిస్టాటులుకంటె నతని శిష్యు నలెగ్జాండరుకంటె మిక్కిలియు శ్లాఘనీయుఁ డని యెంచఁదగిన వాఁడు.

రాక్షసుఁడు.

చంద్రగుప్త చాణక్యులకుఁ దరువాత రాక్షసుఁడే ముఖ్యపురుషుఁడు. అయినను ఇతని చరిత్ర వ్రాయుటకుఁ జారిత్రకమగు నాధారము లెవ్వియుఁ గానరావు. ముద్రారాక్షస కథ వ్రాయునెడల మూఁడవప్రకరణమున రాక్షసుని బుద్ధిచాతుర్యమును స్వామిభక్తిని వెల్లడిపఱచు నంశములు పేర్కొనఁబడినవి. ఇదివఱకు చాణక్యచరిత్రము వ్రాయుటలో నతని వయస్సును గుఱించి కొంతచర్చించినారము. ఇతఁడు నందవంశమునకు మొదటినుండియు మంత్రియైపరఁగి ఆమైత్రిచే నావంశమును నిలుపఁబెట్టుటకు మహాసాహసమునఁ బ్రయత్నించిన ననన్యసామాన్యస్వామిభక్తుఁడు. విధివశమున నాతని పన్నుగడలెవ్వియును ఫలించినవిగావు. కష్టపరంపర లెన్ని డీకొనినను ఆలుబిడ్డలు ఇడుముల గుడుచుచున్నను దన కెంత యపాయము వాటిల్లినను వెనుదీయక కార్యము సాగినంతకాలము ధైర్యముతో స్వామికై పరిశ్రమ సల్పిన మహావీరుఁడుగదా ఇతఁడు. చాణక్యుఁడే ఇతనిని గుఱించి.

"కొందఱు ద్రవ్యకాంక్షమెయి
గొల్తురురాజుల ద్రవ్యమున్నచోఁ



కొందఱు రాజు లాపదలఁ
గూరిననాఁడు భవిష్యదాశచే
నుందురు వీడకుండ; నిటు
లుర్వికిఁ బాసిన రాజులందు నీ
చందము భక్తిఁ జూపఁగల
సాధులు మాత్రము దుర్లభుల్ గదా!"

అని నుడివియున్నాఁడు. ఇంతకంటె నెక్కుడు వ్రాయుటకు వీలులేకుండుట కెంతయుఁ జింతిల్లవలసి యున్నది.

అలకసుందరుఁడు.

ఇతఁడె అలెగ్జాండరునాఁ బరఁగువాఁడు. ఈతనిని చంద్రగుప్తుని సమకాలికుఁడుగ నెన్నుట యంత సమంజసము గాకున్నను సెల్యూకసురాజ్యముతో నీతనికి విశేషసంబంధముగలదగుటచేతను ఇతఁడు భారతవర్షముపై దండెత్తివచ్చినప్పుడు చంద్రగుప్తుఁడీతనిని సందర్శించినట్లు చెప్పఁబడియుండుటచేతను ఈతని చరిత్ర యప్పటి పాశ్చాత్య ప్రపంచపరిజ్ఞానమునకు ముఖ్యతమ మగుటచేతను నిట నది సంక్షిప్తముగ వర్ణితమగుచున్నది.

---

1. ఇయ్యది ఈక్రిందిశ్లోకమునకు శతావధానులఁ దిరుపతి వేంకటేశ్వర కవుల భాషాంతరీకరణము.

ఐశ్వర్యాదనపేత మీశ్వరమయం లోకోర్థతః సేవతే
తంగచ్ఛంత్యనుయే విపత్తిషు పునస్తే తత్ప్రతిష్ఠాశయా
భర్తుర్యే ప్రలయేపి పూర్వసుకృతాసంగేన నిఃసంగయా
భక్త్యాకార్య ధురంవహన్తి బహవ స్తేదుర్లభాస్త్వాదృశాః

ఇతఁడు గ్రీసుదేశమున కుత్తరమునందలి మెకడోనియా రాజ్యమునకుఁ బ్రథమచక్రవర్తి నాఁ జను ఫిలిపునకు పుత్రుఁడు. తల్లిపేరు ఒలింపియాను. అలకసుందరుఁడు జన్మించిన ముహూర్తము సుముహూర్తము. ఫిలిపున కప్పుడ మూఁడు శుభవార్తలొక్కట వచ్చిచేరెను. ఆతని సేనాని మహాయుద్ధ మొక్కంట విజయముగొనుటయు, అశ్వము పందెమున గెలుపునందుటయు, అలకసుందరుఁడు పుట్టుటయు నొక్కనిమేషమున నాతని వీనులకు విందుగొలిపెను. (క్రీ. పూ. 355 సం|| జూలై మాసము 6 వ తేది) నాఁటినుండి యలకసుందరుఁడు గారామునఁ బెరుగుచుండె. ఆతనికి మొదటినుండియు దేహముపై విశేషాభిమానము లేకుండెను. ఎల్లప్పుడును నుత్తమాదర్శములయెడనె అతనికి దృష్టి నిలుచుచు వచ్చెను. గ్రీసుదేశమున సుప్రసిద్ధములయి ఎల్లయావనులకు నాదరణాస్పదములయిన ఒలింపియాపందెములకు నితనిని బురికొల్పిన 'నాతోఁ బ్రతిఘటింపఁ గిరీటధారులే తేరిచో నేను పందెమునకుఁ బోవుదు" నని యె నఁట. ఫిలిపు నూతనముగ విజయము నందెననియు గొంతరాజ్యమును గైవసము చేసికొనెననియు వినినప్పుడెల్ల నలకసుందరుఁడు సంతసించుటకు మాఱుగ తనప్రతాపమును బ్రకటించుటకు నవసరములు దగ్గుచు వచ్చునేయని చింతించుచుండెనఁట !

ఇట్టి తేజోవంతుఁడగు నీబాలుఁడు కార్యములయందుఁ దన ప్రతిభను జూపకుండువాఁడుగాఁడు. ఫిలిపులేని సమయ



మున పారసీకదేశమునుండి కొందఱు రాయబారు లాతని నగరమునకు విచ్చేసిరి. అప్పు డలకసుందరుఁడు వారి కుచితమర్యాదతో స్వాగతమిచ్చి వారినుండి ఆ యాదేశముల స్థితిగతులను, వ్యాపారములను అందలి మార్గములను ప్రభుత్వపద్ధతులను నరసికొనియెను. దీనికిఁ గొంత కాలమునకుఁ దరువాత నలకసుందరుని బుద్ధిని ధైర్యమును వెలువఱచు విశేష మొక్కటి దటస్థించెను. ఫిలిపునకు క్రొత్తగుఱ్ఱ మొండు బహుమానముగ దొఱకెను. దానిని స్వాధీనపఱచుకొని స్వారిచేయుట కెవ్వరికిని సాధ్యముగాలేదు. పెద్దవారలపాటు లన్నింటిని జూచుచుండిన బాలుఁ డలకసుందరుఁడు "అరరె! వీరు దీనిని స్వాధీనముచేసికొన లేకున్నారే" యని యొకటిరెండుమారులు తండ్రికి వినవచ్చు తెఱంగున గొణఁగెను. అంత ఫిలిపు దన కుమారుని పొగరునకు నచ్చెరువంది యశ్వముపై నతనిని స్వారిచేయ నియోగించెను.

అంత నలకసుందరుఁడు గుఱ్ఱపునీడ దానిముందు రానట్లుత్రిప్పి దాని నధిరోహించి దౌడు విడువసాగెను. అది కని యెల్లరుం బ్రశంసించిరి.

అరిస్టాటిలు నా సుప్రసిద్ధుఁడగు గ్రీకు తత్వవేత్తకడ అలకసుందరుఁడు విద్యాభ్యాసము చేసెను. నైజశక్తిం జేసియు గురుప్రభావంబునను నతఁడు పదునారు వత్సరంబుల వాఁ డగుసరికి ఫిలిపువలన మెకడోనియాకుఁ దానులేని సమయములఁ బ్రతిని

ధిగ నేమింపఁ బడియెను. తండ్రి యొక దండయాత్రకుఁ బోయి యున్న సమయమున మెడారిజాతివారు తిరుగుబాటు నొనర్చిరి. బాలుం డయ్యును అలకసుందరుఁడు వారిపైనెత్తిపోయి వారిం బరాజితులఁ జేసి తనపేర నొక పట్టణమును గట్టించెను. తరువాత తండ్రి తోడం గూడ యుద్ధభూమికి వెడలి కెరోనియా యుద్ధ మని పేరుగాంచిన సమరమున ముఖ్యుఁడై పనిచేసెను. ఫిలిపు కుమారుని మిక్కిలి గౌరవముతోఁ జూచుచువచ్చెను.

అయిన నియ్యది బహుకాలము నడచినది గాదు. వయసుచెల్లి నవాఁడే యయినను ఫిలిపు మోహావేశముచే రెండవ భార్యను బెండ్లియాడెను. దానివలన గృహకల్లోలములు కలిగి అలకసుంద రుఁడు దేశత్యాగియయి తలఁదాచుకొనవలసి వచ్చెను. ఒక స్నేహితుని మధ్యవర్తిత్వమున నతఁడు మరల తండ్రి కడస్నేహ భావముతో వచ్చి చేరెను. పిదపఁ గొంతకాలమునకు నన్యా యము ననుభవించి క్రుద్ధుండయిన పౌరుడొక్కఁడు ఫిలిపును దుదముట్టించెను. అలకసుందరుఁడు సింహాసనము నధిష్టించె (క్రీ పూ. 335). వెన్వెంటన ఫిలిపు సామ్రాజ్యమున నెల్లెడల తిరుగు బాటులు దలసూపి రాజ్యవిచ్ఛేద మగునట్లు గాన్పించెను. గ్రీకుపట్టణములగు థీబ్సు ఆథెన్సులు యుద్ధమునకు సమకట్టెను. అలకసుందరుఁ డందఱ సాహసమున నెదిర్చి పరాజితులఁ గావించెను. గ్రీకుపట్టణ రాజ్యములెల్లయు నితనిన తమనాయక శిఖామణిగ నెన్నుకొని అప్పుడు దమకును పారసీకప్రభు వగు డెరయ



సునకును నడచుచుండిన విగ్రహమున కితనిని నియమించిరి. రమూరమి యీకాలప్రాంతమున నొక విచిత్రమగు నుపాఖ్యానము జరిగినట్లు తెలియుచున్నది. గ్రీకుపట్టణములు అలకసుందరుని తమనాయక శిఖామణిగ నెన్నుకొను సమయమున దేశము యొక్క పదిచెరంగుల యందలి ప్రముఖులెల్లరును విచ్చేసి యుండిరి. సైనోపునగరమునకుఁ జేరిన 'డయోజనిసు' అనుతత్త్వ శాస్త్రవేత్త మాత్రము రాఁడయ్యె. ఏల రాకుండెనో చూచివత్తుముగాకయని యలకసుందరుఁడు పయనమై పోయెను. ఆ సమయమున డయోజనిసు సూర్యరశ్మిలో పరుండి యుండెను. జనులు గుంపుగ వచ్చుటంజూచి యతఁడు తలయెత్తి చూచెను. అంత నలకసుందరుఁ డాతని సమీపించి "అయ్యా, తమకు నేనెవ్విధ ముననైన నుపయోగపడఁ గలుగుదునే" యని యడుగ "నీవు సూర్యరశ్మి కడ్డము నిలువకున్నఁ జాలును" అని ప్రత్యుత్తర మిచ్చె నఁట! అది విని యలకసుందరుఁ డాతని స్వాతంత్ర్యము నకుమెచ్చి "నే నలకసుందరుఁడుగాకుండిన డయోజనసు నగుట కాస చేసియుందు" నని పలికెను. దీనింబట్టి యలకసుందరుఁ డెంత నమ్రతగలవాఁడో చదువరు లెఱుంగఁ గలరు.

గ్రీకుపట్టణములచే నాయకశిఖామణిగ నెన్నుకొనఁబడి అలకసుందరుఁడు డెరయసుపైకి వెడలెను. ఇప్పుడు మనయందువలె నక్కాలమున గ్రీకులుమున్నగు జాతులవారియందుఁ గూడ శకునములయెడ నెక్కుడు నమ్మక ముండెడిది. ఆ నమ్మక

ములవలన నిప్పుడు మనకుఁ గార్యభంగము గలుగునట్లే వారికిని గార్యభంగ మగుచుండెడిది. అలకసుందరుఁడు మాత్ర మట్టి నమ్మకముల యాటంకమునకు నిలిచినవాఁడుగాఁడు. శకునములు దన్ననుసరించునట్లు చేసెనేగాని తాను శకునముల ననుసరింపఁడయ్యె. ఇట్లు మహాశక్తితోఁ గార్యములుసలిపి శత్రువుల భూమిం జొచ్చి వారిని రణరంగంబున నోడించి వారిదేశమునందు విశేషభాగము నాక్రమించుకొని యుద్ధములందు దొరకిన కొల్లను గ్రీకుపట్టములకు బహుమానముగా ననిపెను. గార్డియ మను పట్టణమును స్వాధీనము చేసికొనినప్పు డచ్చటి జను లొక రథమును జూపి దానికాడికి వైచియుండిన ముడిని విడఁదీసిన వాఁడు లోకంబునంతయు నేకచ్ఛత్రాధిపతిగ నేలు నని నుడివిరి. అంత అలకసుందరుఁడు కత్తిదూసి యాముడిని భేదించి వైచెనని చెప్పుదురు. ఇప్పటికిని ఆంగ్లేయభాషయందు "గార్డియను ముడినివిప్పుట" యనిన గొప్పచిక్కును వదలించుట యని యర్థము. ఇంచుమించుగ నీగార్డియను ముడినివిడఁదీసిన కాలముననే అలకసుందరుఁడు జబ్బుపడియెను. అతని రుగ్మతకుఁ దగు మందు నిచ్చువారులేరైరి. అప్పుడు ఫిలిపు అనువాఁ డొకఁడు సాహసించి ఔషధంబియ్యవచ్చెను. కాని అతఁడు కపటియనియు డెరయసుపక్షపాతియనియు నాతనిచేతి యౌషధమును గొనవల దనియు నలకసుందరున కొకమిత్రుఁడు వ్రాసెను. అలకసుందరుఁ డది చూచికొని ఫిలిపు మందుఁగిన్నె చేతి కందిచ్చిన తరుణమున నా



యుత్తరము నాతనికిచ్చుచు మందును ద్రావివైచెను. ఫిలిపును విశ్రాంతిఁ జెందెను. అప్పుడు ఫిలిపు అలకసుందరుల డెందములఁ గొందలము గొనిన భావము లూహ్యములేగాని వర్ణనీయములు గావు. కొంతసేపటికి అలకసుందరుఁడు మందువలన నారోగ్యము పొందువడఁ దన మెకడోనియనుల కమందానందము గలిగించుచు డెరయసును సంపూర్ణముగ నోడింప బయలుదేరెను. అజాగ్రత్తవలన డెరయసు ఇఱుకుప్రదేశమున యుద్ధముచేయ వలసివచ్చినందున అలకసుందరుని సైన్యము కొద్దియేయైనను సునాయాసముగఁ బారసీకులను దోలివైచెను. డెరయసు మాత్రము దప్పించుకొని పోయెను. అతనిభార్యయు తల్లియు మఱియిద్దర వివాహితలగు కన్యలును నలకసుందరునిచేఁ జిక్కిరి. వారి కీతఁడు గనుపఱచిన మర్యాదవలన నితఁడు డెరయసునకే సంస్తవనీయుఁ డయ్యెను. ఆ యువిదలకు అలెగ్జాండరు రాజవనితలకుం దగు సదుపాయము లన్నియు నమర్చెను. పురుషు లెవ్వరును వారి యంతికముల కడకు పోఁగూడ దని శాసించి వారి కేలాంటిలోపమును రానీక కాపాడెను. డెరయ సొక్కరుఁడు లేఁడనుటఁ దక్క వారికి డెరయసునగరమునకంటె అలకసుందరుని నగరముననె నెక్కుడు సౌఖ్యము గల్పింపఁబడెను. పట్టువడిన కొన్నిమాసములకు డెరయసుభార్య గర్భస్రావమువలన మృతినొందెను. తన యుదారహృదయమును డెరయసునెడఁ జూపుటను వీలులేకపోయెనే యని వగచుచు నలకసుందరుఁ డామెను

మహావిభవముతో నుత్తరక్రియలు జరిపించెను. ఇదివిని డెరయసు వికలమనస్కుఁడయ్యె. కాని ఆతనిభార్యతోఁగూడ పట్టుపడి ఆమెయొద్ద అలెగ్జాండరువలన సేవకుఁడుగ నియమింపఁబడి ఆమె మరణానంతరము దప్పించుకొనిపోయి డెరయసుం జేరియుండిన కొజ్జా టిరియు సనువాఁడు అలెగ్జాండరుయొక్క నైర్మల్యముం బ్రశంసించి నమ్మకమగు సాక్ష్యమువలికి డెరయసు మనముం దేర్చెను. అలెగ్జాండరు శుద్ధచరిత్రుఁడని నాఁడు నేఁకిన్నొక్కి వక్కాణించి యున్నాఁడు.

ఈ దుఃఖము వాటిల్లిన కొంతకాలమునకె డెరయసునకు నలెగ్జాండరుతో ఘోరయుద్ధము సంప్రాప్తించి అపజయము కలిగెను. నాఁటితో పారసీకసామ్రాజ్య మంతరించె. అలెగ్జాండరునకు గ్రీసుమొదలు భరతవర్షము వఱకుంగల ఆసియాఖండంబును ఈజిప్తుదేశమును లోఁబడిపోయె. అచిరకాలంబుననె డెరయసు పరలోకప్రాప్తిఁ జెందెను. అతని కళేబరంబును రాజపురుషుని కళేబరమునకుం దగినరీతిని మర్యాదదప్పకుండ సమ్మానించి ద్రావకములోనునిచి ఆతనితల్లికి నివేదించునట్లు అలెగ్జాండరు ఏర్పాటులఁ గావించెను. డెరయసుతోఁ బోరుసల్పుచుండిన కాలమున నలకసుందరుఁడు చూపిన కొన్నిగుణములు ప్రశంసనీయము లయి యతని స్వభావమును దెలియఁజేయుచున్నవి.

అరిస్టను అను సేనానియొక్కఁడు శత్రువులలో నొక్కరుని జంపి వాని శరీరముంగొని తెచ్చి అలకసుందరునకు సమర్పించి



"అయ్యా, మాజాతిలో నిట్టిసమర్పణకు బంగారుగిన్నె బహుమానము" అనియెనఁట. అంతట అలకసుందరుఁడు "వట్టిగిన్నె యేల? నిండుగిన్నె నిచ్చెద." నని యొక బంగారుగిన్నెకు సారానించి అందిచ్చి అతనిని గౌరవించు తెఱఁగునఁ దానును ద్రావెను.

ఒకదివసము హీనజన్ముఁ డొకఁడొకఁడోనియను కంచరగాడిదెపయి రాజుగారి ద్రవ్యమును వేసికొని బొక్కసమునకుఁ దోలుకొని పోవుచుండెను. మార్గమధ్యమున నామోయుపశువు పడిపోయెను. అంతట నాసేవకుఁడు ద్రవ్యపుమూటలను వీపున వేసికొని మోయలేక మోసికొనిపోవుచుండెను. అప్పుడు వానిని అలకసుందరుఁడు చూచుట తటస్థించెను. వెంటనే సంగతులు తెలిసికొని అలెగ్జాండరు "మిత్రమా! నిలువుము. ముందునకు సాగిపోవలదు. అది నీ సొమ్ము. నీయింటికిఁ గొనిపోయి నీవే యుపయోగించుకొనుము" అని నియోగించెను. ఆహా! ఒక్కనిమిషంబున దారిద్ర్యమునుండి లేవఁదీసి మహైశ్వర్యవంతునిగఁ జేసిన అలెగ్జాండరునెడ నాదరిద్రుఁ డెంత భక్తివిశ్వాసములు గలవాఁడయ్యెనో మనమెఱుంగఁ గలమా? అలెగ్జాండ రింతటి యుదారవంతుఁ డనియైన మన మిప్పుడు లెక్కవేయఁగలమా?

ఒకసందర్భమున నలెగ్జాండరు సైన్యము మిక్కిలి విరివియగు నిర్జలప్రదేశముగుండ ప్రయాణము సలుప వలసివచ్చెను.

కొందఱు మెకడోనియనులు మాత్రము ఒకవేటికడ బుడ్లలో నీరు నించుకొని తమవాహనములపైఁ దెచ్చుకొనుచుండిరి. అలెగ్జాండరునకు విశేషము దప్పిపుట్టెను. అప్పుడు వారిలో కొందఱు శిరస్త్రాణంబున నొక్కట నీరుసించి అతని కిచ్చిరి. అతఁడు దానిని బుచ్చుకొని ఎవ్వరికిఁగాను గొనివచ్చుచుండి రని యడిగెను. వారు “మాబిడ్డలకొఱకు కొనివచ్చుచున్నారము. మాప్రభువు జీవించినచో నిప్పటిబిడ్డలు పోయినను మాకు బిడ్డలకుఁ గొదవ యుండ”దనిరి. ఈలోపల నలకసుంధరుఁడు చుట్టుఁజూడ సైనికులనేకులు దలలువాంచి అతనిచేతిలోని నీటివైపునఁ జూచుచుండిరి. అది గమనించి అతఁడు “నేనుదకమును ద్రావినయెడల నావలెనే పిపాసాపీడితు లగు నీసైనికులు అధైర్యపడియెదరు” అనుచు నీటిని వెనుకకు నిచ్చివేసెను. అతని యౌదార్యమునకును త్యాగమునకును మెచ్చి సైన్యమెల్లయు నొక్క-పెట్టున మిక్కిలి తెగువతోఁ ద్రోవనడచెను.

అలెగ్జాండరు భరతవర్షముమీఁదికి దండెత్తి వచ్చుట మున్నగు విషయములు నాలుగవ ప్రకరణమున వ్రాయఁబడినవి. మరల నిచ్చట వ్రాయుట అనవసరము.

డెరయను మరణానంతరము అలెగ్జాండరు దనరాజ్యమునందు సంబంధములును బాంధవ్యములును నుండిన రాజ్యస్థైర్యమున కనుకూల మగునని తలఁచి పౌరవాత్యపద్ధతులను అవలంబింప మొదలిడెను. భతవర్షమునుండి తిరిగి పోవుచు



సూసాపట్టణముకడ మహావైభవమున రోక్సానా యను పారసీక కన్యను జేపట్టి పెండ్లియాడెను. తన మిత్రులకును బంధువులకును గ్రింది యధికారులకును అనేకులకుఁ బూర్వదేశములయందలి కన్యలను వివాహమున నిప్పించెను. 9000 వివాహములు జరిగెను. తాను ఉడుపులు మున్నగు నితర విషయములను గూడ పౌరవాత్యపద్ధతులనే అనుసరించుచు వచ్చెను.

భరతవర్షమునుండి దిరిగి పోవుచు నతఁడు బాబిలోనువద్దకు వెళ్లినప్పటి కాతనికిఁ జలిజ్వరము సంభవించి మృతుఁడయ్యెను. (క్రీ. పూ. 323)

అలెగ్జాండరు అంతిమదశయందు విశేషము త్రాగుటవలన కొందఱను అన్యాయముగఁ జంపినట్లు చెప్పఁబడుచున్నది. ఎట్టివారికిని గళంకము లుండును గదా!

## సెల్యూకసు.

అలెగ్జాండరుచేఁ జయింపఁబడి కొంతకాల మాతని పాలనకు లోనయియుండి ఆతని మరణానంతరము చెల్లాచెదరయి పోయియుండిన రాజ్యశకలములను, జంద్రగుప్తుఁడు భరతఖండమును ఏకచ్ఛత్రాధిపత్యము గ్రిందికిఁ దెచ్చుచుండిన కాలముననే, ఏకచ్ఛత్రాధిపత్యమునకుఁ దేఁ బ్రయత్నించి జయము వడసి చంద్రగుప్తు నెదిర్చి నిలువలేక అతనికిఁ బుత్రికనిచ్చి మైత్రి చేసికొనిన మహావీరుఁడు ఈ సెల్యూకసు.

ఇతఁడు క్రీ. పూ. 358-354ల మధ్యకాలమున జననమందెను. ఇతఁడు రమారమి ముప్పదిసంవత్సరముల వాఁడయి ఆసియా మీఁదికెత్తిపోవనున్న అలెగ్జాండరు సైన్యమునఁ జేరువఱకుం గల ఇతని జీవితచరిత్రము మనమెఱుంగము. క్రీ. పూ. 326 వ సంవత్సరమున నితఁ డలెగ్జాండరు సైన్యములోని ముఖ్యాధికారులలో నొక్కఁ డయి కన్పట్టుచున్నాఁడు. అఫ్ఘనిస్థాన ప్రాంతము నందలి పర్వతప్రదేశమున నలకసుందరుని భీతుంజేయుట చేత నతనికడఁ బ్రధానాధికారిగ నేమింపఁబడెను. అలెగ్జాండరు, టాలమీ, పర్డిక్కాసు, ల్గాసిమేకసులతో భరతవర్షముం జొచ్చి పురుషోత్తముతోడి పోరున నితఁడు పేరుమగండయి వెలసె. అందువలన నలకసుందరున కీతనిపయి ననురాగము చెన్నువహించి నల్లగుపించుచున్నది. సూసాపట్టణమున క్రీ. పూ. 324 వ సంవత్సరమున జరిగిన మహావైభవోపేత వివాహములలో నలెగ్జాండరు వివాహమునకు రెండవ దీళనిదె యయి యొప్పెను. పారసీక ప్రభువ్రులలో నలెగ్జాండరు మామయు నీతని మామయు సమానౌన్నత్యముగల ప్రముఖులు.

బేబిలోనున క్రీ. పూ. 323 లో నలెగ్జాండరు పరలోకగతుఁ డయిన పిదప నాతని రాజ్యమంతయు నరాజకముగాఁ జొచ్చెన. ఫ్రిజియాక్షత్రపుఁడగు ఆంటిగోనసును, ఫిలిపుసేనాని యగు ఆన్టిపేటరును, ఈజిప్తుక్షత్రపుఁడగు టాలిమీయును,



మెకడోనియాప్రతినిధియగు క్రెటరసును స్వతంత్రరాజులముగాఁ గలుగుదుము గదాయని పన్నుగడలకు ప్రారంభించిరి. కొలఁది కాలముననే రోక్సానాకు కొమరుండుపుట్టె. పర్డిక్కాసు ఆ చిన్నియలెగ్జాండరునకు సహపాలకుఁ డయ్యెను. ఇతర క్షత్రపులతోఁ జేరియుండిన సెల్యూకసునకును వెన్వెంటనె రాజ్యభాగ మబ్బియుండునుగాని ఏకారణముననో అతఁడు సహపాలకుని రక్షకసైన్యమున (Companions) కధ్యక్షుఁడుగ నుండ నియ్యకొనెను. అయిన నిది బహుకాలము జరిగినదిగాదు. క్రీ. పూ. 321 లో ఆన్టిగోనసు సహపాలకుని యాజ్ఞ నుల్లంఘించుటంజేసి వీరిద్దఱకును విగ్రహము ప్రారంభ మాయెను. క్షత్రపు లందఱును ఆన్టిగోనసుతోఁ జేరిరి. పర్డిక్కాసు విగ్రహమును నడుపుచు సైన్యముతో నీజిప్తుఁ జొచ్చెను. అతని సైన్యము లోడిపోయి యతఁడు ప్రాణము లర్పింపవలసి వచ్చెను. బహుకాలముగ సంగతులను గమనించుచుండిన సెల్యూకసు సమయము చూచుకొని సహపాలకుని దిగనాడి క్షత్రపుల పక్షమునఁ జేరిపోయెను.

సహపాలకుఁడు పర్డిక్కాసు మడిసిన పిదప ఆన్టిపేటరాతని స్థానమునకు నియమింపఁబడియెను. అట నతనికిఁ గొన్ని చిక్కులు దటస్థించెను. సైనికులలోఁ గొందఱకు నాతఁడు ఇయ్యవలసిన ధనమిచ్చుటకు సందర్భము లతనికి వ్యతిరేకము లయ్యెను. అంతట వారతనిని శిలావర్షమున నొప్పించి చంపఁజూచిరి. ఆ

తరుణమున వారినుండి యాతనిని సెల్యూకసు దప్పించె. కృతజ్ఞతఁ జూపుటకు నతఁడును సెల్యూకసునకు బేబిలోనియా ప్రభుత్వ మిచ్చి యనిపెను. ఇదియు సెల్యూకసునకుఁ జాలకాలము దక్కినదిగాదు. అన్టిగోనసు మహాబలవంతుఁ డగుటయు అతనికిని సెల్యూకసునకును వైరము గలుగుటయుఁ దటస్థించెను. ఎంతఁ బ్రయత్నించినను అన్టిగోనసును సమాధానపఱచుట యసాధ్య మయ్యెను. క్రీ. పూ. 317 లో సెల్యూకసు ఈజిప్టునకుఁ బారి పోయి టాలమీ శరణుఁ జొచ్చెను. 316లో రాజవంశము పేరైనను లేకపోవుటయు అన్టిగోనసు ప్రబలప్రభు వగుటయు సంభవించె. అంతట నితరక్షత్రపులు—ఈజిప్టున టాలమీయును, అతనికడఁ జేరియుండిన మన సెల్యూకసును, మెకడోనియాయందు కసాండరును లాసిమేకసును,—అన్టిగోనసునెడ నీర్ష్యగలవా రయి యాతనిపై వైరమూని క్రీ. పూ. 315 నందుఁ గొన్ని సమాధానము లడిగిరి. దానిపయి వారికిని అతనికిని విగ్రహముపుట్టె. అందు 315 మొదలు 312 వఱకును సెల్యూకసు టాలమీ సేనానులలో నొక్కఁడుగఁ బనిచేసెను. కాని యాసంవత్సరము ప్రారంభ మగునప్పటికి సెల్యూకసున కదృష్టము పట్టుటకుఁ బ్రారంభించెను. అన్టిగోనసు మెకడోనియాపై కెత్తిపోవ నుండెను. ఆదాడి నాటంకపఱచి యతని విఫలమనోరథునిఁ జేయ సెల్యూకసు ఉపాయము వెదకి ఆతని కుమారుని పరాజితుంజేసి యతని సైన్యములను 'గాజా' యుద్ధమున నుఱుమాడించెను. అంతటితో



అన్టిగోనసు తనచేసిన ఏర్పాటులనెల్లయు మార్చుకొనను వాఁడాయెను. సెల్యూకసు శకము ప్రారంభమయ్యె. టాలమీ 800 పదాతులను 200 స్వారులను ఇచ్చి సెల్యూకసును బేబిలోనియా స్వాధీనపఱచుకొనుమని పనిచెను. ఇంత స్వల్పసైన్యముతో నేమి చేయవచ్చు నని కొందఱు సెల్యూకసుతో వాదింపఁ జొచ్చిరి. కాని అలెగ్జాండరు దృష్టాంతమును జూపియును వీరపురుషోచిత ధర్మములఁ నుపన్యసించియు శకునముల గనుపఱచియు సెల్యూకసు దనబలములఁ బురికొల్పి మార్గమున జయము గొనుచు బేబిలోనుచేరి అన్టిగోనసు పక్షము వారిని పరాజితుల నొనర్చి యానగరమును వశపఱచుకొనెను. నాఁడె సెల్యూకసుల సామ్రాజ్యజన్మదినము. నాఁటినుండియు సెల్యూకసు తన స్థానమును బలపఱచుకొనఁ జొచ్చెను. అచిరకాలముననే అన్టిగోనసు తన పుత్రుఁ డగు 'నికనరు' ను 10,000 పదాతులతోను 7000 అశ్వికులతోను సెల్యూకసు పైకి ననిపెను. ఇతని సైన్యమున 3000 కాల్బంటులును 400 స్వారులును నుండిరి. అయినను సెల్యూకసు ప్రతిభవలన నీచిన్న సైన్యము నికనరును సంపూర్ణముగ నోడింపఁ గలిగెను. ఈదెబ్బతోడనె అన్టిగోనసునకుఁ బశ్చిమమునఁ దొందరలు చూపట్టెను. అయినను వెనుదీయక అన్టిగోనసు తనకొమరుని డెమిట్రియసును బేబిలోనియా మీఁదికి గొప్పదండుతో ననిపెను. ఆ దండు కొల్లగొట్టుటతప్ప మఱి యేవిధమయిన ఫలమును గొనిరాదయ్యె. సెల్యూకసు

మెల్లమెల్లఁగ ఆన్టిగోనసు పక్షపాతులను పరాజితులఁ జేసి మరల బేబిలోనియాను స్వాధీనపఱచుకొనెను. రెండవమారితఁడు ఈనగరమును కైవసము చేసికొనినది మొదలు క్రీ. పూ. 302 వఱకు తొమ్మిది సంవత్సరముల కాలమేమి జరిగెనో మన మెఱుఁగుట కాధారములు గానరావు. 302 లో సెల్యూకసు లాసిమేకసులకును ఆన్టిగోనసునకును ఇప్సను అను స్థానమున యుద్ధము జరిగెను. ఆన్టిగోనసు హతుఁడయ్యె. సెల్యూకసునకు పాలెస్టను మొదలు భరతఖండమువఱకుఁ గల రాజ్యము సర్వస్వాతంత్ర్యములతో నబ్బెను. పాలెస్టను సెల్యూకసునకును ఈజిప్తుక్షత్రపుఁడగు టాలమీకును వివాదకారణమయ్యె. కాని టాలమీ సెల్యూకసునకు కష్టకాలమున సాయముచేసినవాఁడు గావున నావివాదము అప్పుడు విగ్రహాము కాదయ్యెను.

సెల్యూకసు రాజ్యవిస్తారము పెంపునందిన ఆ 303 వ సంవత్సరముననే అతఁడు భరతవర్షము పయికెత్తివచ్చి చంద్రగుప్తునిచేఁ బరిభవమొంది పుత్రికనిచ్చి సంధిచేసికొనెను.

సెల్యూకసు బలవంతుఁ డగుట చూచి తక్కుంగల క్షత్రపులతనిపై విరోధమూనిరి. టాలమీ లాసిమేకసు లొక్కండ్రైరి. కొంతకాలము ఆన్టిగోనసు కుమారుఁడు డెమిట్రియసు సెల్యూకసుతోడఁ జేరి, కొంతకాల మెదిరించి, కొంత కాలములోఁబడి పలుపాట్లఁబడి క్రీ. పూ. 283 లో విషము పుచ్చుకొని చచ్చెను. అతనితోటి సంబంధములలో సెల్యూకసు ఉదారుఁడుగను



దయార్ద్రహృదయుఁడుగను ధైర్యశాలిగను గన్పట్టుచున్నాఁడు. డెమిట్రియసు పలుత్రోవలఁ ద్రొక్కి తుట్టతుదకుఁ జిక్కి సెల్యూకసుచే రాజపురుషోచిత మగు చెఱయందుంచఁబడెను. అప్పుడు లాసిమేకసతనిని జంపిన రెండువేల టాలెంటులు ఇచ్చెద నని సెల్యూకసునకుఁ దెలియఁపఱచెను. దానిపై సెల్యూకసు నుండిపడి అట్టి దుష్కార్యము తగ దని లాసిమేకసునకు విశదీకరించుచుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

ఒకతఱి ప్రజకొందఱు డెమిట్రియసు పక్షమువహించి యుండిరి. అతనికిఁ గొంచెముగ విజయము కలిగి యుండెను. బలములఁ జేర్చుకొని అతఁడు కొంత యనారోగ్యము దటస్థించినను లెక్కసేయక పితూరీపోట్లాటలు జరుపుచుండెను. అట్టి సమయమున సెల్యూకసు డాలునొక్కటిని మాత్రము చేతఁబట్టుకొని యొంటరిగా డెమిట్రియసు విడిసియుండిన యడవిఁజొచ్చి యచ్చటి యుద్ధభటులను దనపక్షమునకు రావలసిన దని చీరెనఁట! ఆహా! ఎంతసాహసము! ఎంతధైర్యము!!

ఇంత యాత్మవిశ్వాసము గలవాఁడు గావుననే దైవము గూడ నతనికిఁ దోడయ్యె.

లాసిమేకసు టాలిమీల రాజ్యములలో నంతః కలహములు పొడఁగట్టె. క్రీ. పూ. 281 న, లాసిమేకసు సెల్యూకసుచే యుద్ధమున మడిసె. టాలమీ రాజ్యమున కర్హుండగు కెరౌనసు టాలమీ ఈతనివద్ద శరణుఁ జొచ్చియుండె. అట్లగుటచేత

సలెగ్జాండరు రాజ్యమున నీజిప్తుదప్పఁ దక్కిన భాగంబుల కీతఁడు సర్వాధికారి యయి ఈజిప్తు యువరాజును దన వశవర్తినిగఁ జేసికొని యడ్డులేక యలరారె.

సెల్యూకసునకు ఆంటియోకసు నాఁబడు పుత్త్రుఁడు గలఁడు. సెల్యూకసు డెమిట్రియసు బిడ్డను స్ట్రాటొనిసె అను నామెను బెండ్లియాడి యుండె. ఆంటియోకసునకు నామెపయి యనురాగము గలిగెనఁట. అంతట సెల్యూకసు పుత్త్రుని యందలి ప్రేమచే నాయమ నాతనికిచ్చి వారిద్దఱను అర్థరాజ్యమున కధికారులను జేసి పంపియుండెను. (క్రీ. పూ. 293) నాఁటినుండియు వారల కీపౌరస్త్యదేశములను ఇచ్చి వైచి తాను తన తండ్రి తాతల దేశమగు మెకడోనియాయందు కడపటి దినములు గడపవలయునను నుద్దేశము కలిగినట్లు గానుపించెడు. ఆయుద్దేశమును నెఱవేర్చుకొనుకొఱకు సెల్యూకసు క్రీ. పూ. 281 లో మెకడోనియాకుఁ బ్రయాణమయ్యెను. వెన్వెంటనె కెరౌనసుటాలమీయుఁ జనియె. మధ్యమార్గమున నీకెరౌనసుయొక్క విశ్వాసఘాతుకముచే సెల్యూకసు అకాలమరణము నందెను.

అతనిచే స్థాపితమయిన రాజ్యము బహుకాలము జరిగి చరిత్రమున ప్రసిద్ధిగాంచెను.

### మెగాస్తనీసు.

మెగాస్తనీసును గుఱించి మనకు విశేషము తెలియదు. ఇతని గ్రంథమును లేదు. ఇతని తరువాతి గ్రీకు గ్రంథకారు లితని



వని కొన్నికొన్ని వాక్యములు అనువాదించి యుండుటంబట్టి లోకమున కితని చరిత్ర తెలియకున్నను ఇతర విషయముల చరిత్ర పరిస్ఫుటముగఁ దెలియవచ్చుటకు వీలు కలిగియున్నది.

కొందఱు మెగాస్తనీసు పారసీకుఁడనియు నలెగ్జాండరు వెంట వచ్చినవాఁడనియు ననుచున్నారు. కాని యవి వట్టియూహలు.

ఇతఁడు క్రీ. పూ. 302 లో సెల్యూకసుచే చంద్రగుప్తుని యాస్థానమున రాయబారిగ ననుపఁబడెను. ఇతఁడు పంజాబులోని నదులను బేర్కొనుటచే నామార్గముగఁ బాటలీపుత్రముం జొచ్చిన ట్లూహింపఁ దగియున్నది. ఆపట్టణమున నితఁడు బహుకాలము నివసించెను. దానికిఁ బూర్వభాగమందుండు భరతవర్షమును ఇతఁడు సమక్షముగఁ జూచియుండ లేడు. కొందఱితఁడు చంద్రగుప్తునితోడంగూడ దేశమును జుట్టుచుండె నందురుగాని దాని కాధారము గానము. ముఖ్యముగ బ్రాహ్మణుల నుండి విని సర్వమును నితఁడు వర్ణించియున్నాఁడు. దేశభాషలు చక్కఁగఁ దెలియమిం జేసి వినుటయొక్కటి యర్థముచేసికొనుట మఱియొక్కటియయి ఈతఁడొక కొన్ని యద్భుతముల వ్రాసె ననుటకు సందియము లేదు. కాని కొందఱు వాదించు విధంబున నితఁడు గపటికాఁడు. భాషలు దెలియమిం జేసియు హైందవపద్ధతులను గ్రీకు అనుభవములతో విమర్శించుటం జేసియుఁ గొన్ని లోపములు గల్గిన వనుట సమంజసము. ఇంతియ

గాక ఇతని సంపూర్ణగ్రంథము లేని దీతని దూరనేఁకిదరంబు? తరంబైనను అదెట్టి న్యాయంబు? తెలిసినది తెలిసినవఱకు దేశమును గుఱించియు, భూస్థితిని గుఱించియు, శీతోష్ణస్థితిగతులను గుఱించియు, పశుపక్ష్యాదులను గుఱించియు, జాతిమతములను గుఱించియు, ఆచారవ్యవహారములను గుఱించియు, రాజ్యాంగపద్ధతులను గుఱించియు విషయమును సేకరించి లిఖించియుంచి భారతవర్షప్రాచీనచరిత్రాంశములఁ బెక్కింటికి నాధారభూతుఁడైన ఈమెగాస్తనీసు మనకు సంస్మరణీయుండు గాఁడే!

సమాప్తము.



# ప్రకటనలు

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల

## నియమములు

1. దేశాభివృద్ధికి అవశ్యకములైన గ్రంథములు ప్రచురించి భాషాభివృద్ధి చేయుటయే యీ గ్రంథమాలయొక్క యుద్దేశము. ఇందు సంవత్సరమునకు రమారమి 1600 పుటలుగల స్వతంత్రమైన గ్రంథములు నాలుగు ప్రచురింపబడును.

2. కొందరు తలచునట్లు ఇది మాసపత్రికకాదు. ఇందు (i) దేశదేశముల చరిత్రములును, (ii) పదార్థ విజ్ఞాన శాస్త్రము (Physics), రసాయనశాస్త్రము (Chemistry), జీవశాస్త్రము (Biology), వృక్షశాస్త్రము (Botany), మొదలయిన ప్రకృతిశాస్త్రములును, (iii) దేశోపకారులగు కొందరు మహనీయుల చరిత్రములును, (iv) ఇంగ్లీషునందలి ఉద్గ్రంథములభాషాంతరీకరణములును మాత్రము ప్రచురింపబడును. చరిత్రానుసారములగు కల్పిత కథలు (Historical Novels.) గూడ ప్రచురింపబడును, కావ్యనాటకాదు లిందుండవు.

3. ఈ గ్రంథమాలలో నిదివరకు అచ్చువేయబడిన గ్రంథముల నన్నిటిని కొనుచు, నికముందు సంవత్సరమునకు నాలుగు చొప్పున ప్రచురింపబడు గ్రంథముల నన్నిటిని గొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపు చందాదారులు.

4. శాశ్వతపు చందాదారులకు ఈ గ్రంథమాలలోని గ్రంథములన్నియు సంచెకూలి మేమే భరించి నూరుపుటలకు రు 0-4-0 చొప్పుననిచ్చెదము. ఇతరులకు ఈ పుస్తకములు అంచెకూలి గాక నూరుపుటలకు రు0-6-0చొ॥ నీయబడును. సంవత్సరము ఒక్కింటికి 1600 పుటలకంటె నెక్కువ పుటలుగల గ్రంథములు మేము ప్రచురించముగాన, చందాదారులకు సంవత్సరమునకు రూ. 4-0-0 కంటె నెక్కుడు కర్చు కానేరదు.

5. శాశ్వతపు చందాదారులు సంవత్సరపు చందా మొదట నీయనక్కరలేదు. ఒక్కొకపుస్తకము అచ్చుపడగానే అది వ్యాల్యూపేయబిల్ ద్వారా పంపబడును.

6. వెనుకటి పుస్తకములనన్నిటినిగొను చందాదారులు 0-4-0 లు ప్రవేశరుసుముక్రింద చెల్లింపవలెను. ఈ సొమ్ము దరఖాస్తుతో పంప వచ్చును. లేదా మేము మొదటపంపు వి. పి. లో చేర్చి రాబట్టుకొందుము. వెనుకటి పుస్తకములనన్నిటిని ఒక్కసారి కొనలేని వారు రు 5-0-0ల వెలగల పుస్తకములు మొట్టమొదట కొనిన జాలును. మిగతా పుస్తకములు తరువాత తెప్పించుకొనవలెను.

7. వెనుకటి పుస్తకములు అక్కరలేనివారును, లేక కొన్నిమాత్రమే కావలెనను వారును ప్రవేశరుసుముక్రింద రు 1-0-0 చెల్లింపవలెను.

8. గ్రంథమాలలోని గ్రంథములన్నియు నునుపైన దళసరికాగితములమీద ముద్రింపబడును. అనేక చక్కనిపటములలో నొప్పుచుండును. క్యాలికో బైండుచేయబడును. సరసమైన వచనశైలిని కలిగియుండును. ఇట్లు సర్వాంగసుందరములై చౌకవెలలకు దొరకు గ్రంథములు తెలుగుభాషలో నరుదు.

---

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల

## ప్రచురింపబడిన గ్రంథములు.

| | | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|---|
| 1. | అబ్రహాములింకను (Abraham Lincoln)* | 0- 8-0 | 0-12-0 |
| 2. | హిందూమహాయుగము (Hindu Period) | 0-11-0 | 1- 0-0 |
| 3. | జీవశాస్త్రము (Biology)* | 1- 0-0 | 1- 8-0 |
| 4. | రాణీసంయుక్త (Historical Novel) | 0- 9 0 | 0-12-0 |
| 5. | మహమ్మదీయమహాయుగము (Mahammadan Period) | 1- 3-0 | 1-12-0 |
| 6. | పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics)* | 0-14-0 | 1- 5-0 |
| 7. | రసాయనశాస్త్రము (Chemistry) | 0-13-0 | 1- 5-0 |
| 8. | ఆంధ్రులచరిత్ర (1-వ. భా.) (Andhra History i.) | 1- 0-0 | 1- 4-0 |
| 9. | విమలాదేవి (Historical Novel) | 0-13-0 | 1- 2-0 |
| 10. | కలరా (Cholera)* | 0- 4-0 | 0- 6-0 |
| 11. | 12. 13. ప్రకృతిశాస్త్రముల ప్రథమపాఠములు* | 1- 2-0 | 1-10-0 |
| 14. | భౌతికశాస్త్ర ప్రథమపాఠములు* | 0- 7-0 | 0- 9-0 |
| 15. | రా. బ. క. వీరేశలింగముగారి స్వీయచరిత్రము | 1- 0-0 | 1- 8-0 |
| 16. | భౌతికశాస్త్రము (Physiography) | 1- 0-0 | 1- 8-0 |
| 17. | ఢిల్లీదర్బారు (Dheli Durbar) | 1- 0-0 | 1- 8-0 |
| 18. | ఆంధ్రులచరిత్రము (2-వ. భా.) (Andhra History ii.) | 1- 0-0 | 1- 8-0 |
| 19. | చంద్రగుప్తచక్రవర్తి (Emperor Chandra Gupta) | 0- 8-0 | 0-12-0 |
| 20. | చలిజ్వరము (Malaria) | 0- 5-0 | 0- 7-0 |

☞ ఇందు చందాదారులు పోస్టేజి భరించ నక్కరలేదు. ఇతరులు పోస్టేజి భరించవలెను. పుస్తకము లన్నియు చక్కని క్యాలికో బైండు చేయబడినవి.

* ఈ గ్రంథములు ప్రస్తుతమందు లేవు.

సెప్టెంబరు 1912
మద్రాసు.

ఆ. లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం,
మేనేజరు

